

శ్రీమదాంధ్ర వాల్మీకి

# వచన రామాయణము

## అరణ్య కాండము



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ



రచయిత్రి శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ

పతిదేవులు (పరమపదవాసులు) శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులు అయ్యవార్లతో

Published by

**www.pravachanam.com**

# శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము

(రిజిస్టర్డ్ ట్రస్ట్ 327/95, తేది 18-8-95)


శ్రీ జీయర్ స్వామివారి కార్యాలయం
7-7-41, రామారావు పేట
కాకినాడ - 533 004
తూ॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్
ఫోన్స్ : 0884 - 2371064, 2371070.





వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ
రామానుజ జీయర్ స్వామివారు


తేది : 18-09-2020

## మంగళాశాసనములు

శ్రీమద్రామాయణం శ్రీరామానుజ సంప్రదాయానికి మూలాధారమని, సాక్షాత్తు వేదమని, శ్రీరాముడు వేద పురుషుడని మన పూర్వాచార్యుల వాక్కు

అట్టి శ్రీమద్రామాయణమును సంప్రదాయానుగుణముగా, సరళ వచనములో రచించారు పండితురాలైన శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ గారు. వీరు శతాధిక వృద్ధులు. వారికి అనేక మంగళాశాసనములు.

శ్రీమతి సీతమ్మగారి శతజయంతి సందర్భంగా ప్రకటిస్తున్న ఈ సరళ వచనరూప రామాయణము అందరికీ ఉపయోగ పడాలని మా ఆకాంక్ష.



ఈ పుస్తకం ముద్రణకి ప్రవచనం.కామ్ వారు సహకరిస్తున్నట్లు తెలిసింది. వారికీ అనేక మంగళాశాసనములు.

(శ్రీరంగ రామానుజ జీయర్,
కాకినాడ)



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారి

## శతజయంతి సందర్భంగా

కుటుంబ సభ్యుల కానుక

# అరణ్య కాండము



పరిష్కర్త

**శ్రీ వింజమూరి శేషఫణి శర్మ**


ముద్రణా సహకారం

pravachanam.com బృందం

# అరణ్య కాండము

శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ



ముద్రణ

**నవంబరు, 2020**

వెల

**అమూల్యం**

ముద్రణా  సహకారం

**pravachanam.com బృందం**

సంప్రదించుటకు

**శ్రీ ఎస్.టి.పి.ఎస్.వి. రాఘవాచార్యులు**

9490942884

ప్రింటర్

**ముద్రిక ప్రింటర్స్, విజయవాడ**

# నివేదన

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ నారాయణుల కటాక్షముచే మంచి ఆరోగ్యముతో మా మధ్య కదలాడుచూ ఈ శార్వరి నామ సంవత్సర ఆశ్వయుజ బహుళ ద్వాదశి, హస్తా నక్షత్రము అనగా 12-11-2020 నాడు నూఱవ వసంతము పూర్తిచేసుకొనుచున్నారు మా కుటుంబపెద్ద శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారు. ఈమె పతిదేవులైన పరమ పదవాసులు శ్రీమాన్ వేంకటరాఘవాచార్యులువారు గొప్ప ఉపాసకులు, మంత్రశాస్త్రవేత్త. వీరికి నలుగురు కుమారులు మఱియు ముగ్గురు కుమార్తెలు. ప్రస్తుతము రెండవ కుమారుడైన శ్రీమాన్ శ్రీవెంకటేశ్వర్లుగారి కుటుంబానికి సేవా భాగ్యము కలిగించుచు హైదరాబాదు నందు నివసించుచున్నారు.

ఆమె పుట్టింటి నుండి సంగీత సాహిత్యాలు, సంప్రదాయకత, పఠనాసక్తి, ఆర్షజ్ఞానము, దైవచింతన అరణంగా తెచ్చుకొని మెట్టినింట పతిదేవుల సాహచర్యములో దైవోపాసన, పరోపకారము అలవరచుకున్న ఉభయవంశ పవిత్ర. తల్లిదండ్రులైన శ్రీమాన్ మొలుగు వెంకట నరసింహాచార్యులు, వెంకటనరసమ్మ శిక్షణలో వాల్మీకి రామాయణము ఆమెకు నిత్యపారాయణ గ్రంథమైనది. అదియే ఈ గ్రంథ రచనకు నాందియైనది. అజరామరమైన శ్రీమద్రామాయణానికి ఎన్ని వ్యాఖ్యానములు, అనువాదములు ఉన్నా వేటి తీరు వాటిదే. ఆయా రచయితల అనుభూతులు కూడా వాటి వాటి ప్రత్యేకతలు కలిగి ఆస్వాదయోగ్యంగా ఉంటాయి. 'ఆంధ్రవాల్మీకి' శ్రీ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) గారి 'ఆంధ్రవాల్మీకి రామాయణ' పద్యకావ్యము పఠన ఆమెకు రామాయణముపై మరింత అవగాహన పెంచడమేగాక సామాన్యులకును

అర్థమగునట్లు తనదైన శైలితో తెలుగు వచనములో రామాయణమును ఉత్తర కాండ సహితముగా అనువదించుటకు మూలమైనది. ఆమె రచన స్నిగ్ధమైన తేటనీటిధార, సహజమైన శైలీప్రవాహము.

ఈ సంకల్పమునకు తగిన ప్రేరణ యిచ్చి ప్రోత్సహించినవారు ఆమె సోదరులైన ఆధ్యాత్మికవేత్త శ్రీమాన్ మొలుగు రంగాచార్యులుగారు కాగా రచనలోని సహజధారను పరిష్కరించినవారు పెద్దకుమారుడైన రాధా కృష్ణమాచార్యుని మిత్రులు, పండితులు, కవులునైన శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. ఆమెపై నున్న వాత్సల్యముతో 'ప్రవచన శిరోమణి' శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు వారి అభినందనములను తెలియజేయగా 'న్యాయ–ఉభయవేదాంత ప్రవీణ' శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులు గారు వారి ఆశీస్సులను అందజేశారు.

ఈ రామాయణ కథానాయకుడైన శ్రీరాముని అన్నదమ్ములవలె నుండెడి ఈమె కుమారులు తొలి ప్రయత్నముగా వీరి రచనలలోని 'రామానుజ చరిత్ర', 'బాలకాండము'లను మూడవ కుమారుడైన శ్రీమాన్ నరసింహాచార్యులు – లీల దంపతులును, 'సుందరకాడము'ను శ్రీమాన్ రాధాకృష్ణమాచార్య – భూదేవి దంపతులును, 'దశరథుని కోడళ్ళు'ను మూడవ అల్లుడైన శ్రీమాన్ కరి రాధానాధాచార్యులు – విజయలక్ష్మి దంపతులు ప్రచురింపజేసిరి. ఈమెకు సేవచేసి ఈ రచనలు చేయుటకు చక్కని వాతావరణము కల్పించినవారు నాల్గవ కుమారుడైన శ్రీమాన్ శ్రీమన్నారాయణ, సీత దంపతులు.

అటు పిమ్మట సీతమ్మగారు ఈ వచన రామాయణ మూలప్రతులను శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము (కాకినాడ) వ్యవస్థాపకులు అయిన శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారికి సర్వహక్కులతో సమర్పించినారు. అంతేగాక వీరి కథా

సంపుటీకరణములైన సన్మార్గదర్శనము, ఆత్మజ్ఞానమునకాధారము, అహం వేద్మి మొదలగునవి స్వామివారి ఆధ్యాత్మిక మాసపత్రిక 'శరణ్య'లో ప్రచురితమైనవి.

శతజయంతి సందర్భమునకు తగిన బహుమాన రూపములో ఈ వ్రాతప్రతులను వెలుగులోనికి తీసుకురావలెనను, శాశ్వతముగా నిక్షిప్తపరచ వలెనను కోరికతో ఈ వచన రామాయణమును (ఏడు కాండలు) నేటి సరళి ననుసరించి అంతర్జాలమునందు ఉంచినచో అందరికీ అందుబాటులో నుండునని తలచి, పెద్దల అనుమతితో ప్రవర్తించుచుంటిమి. ఇందుకుగాను పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు తమ దివ్య మంగళాశాసనములను కృపజేసినందున ఆమె మఱియు ఆమె కుటుంబము తరఫున స్వామివారికి అనేకానేక దాసోహములు. అలాగే అంతర్జాలము నందుంచుటకు, ముద్రణకు సహకరించిన 'ప్రవచనం.కాం' బృందము వారికి మా ధన్యవాదములు. ఈ ఆలోచన చేసి, సాకారము చేయుటలో ముఖ్య భూమిక వహించిన వారి మనుమలైన శ్రీమతి కొమాండూరి శిరీష, కులశేఖర్ దంపతులు ఎంతో అభినందనీయులు. ఈ గ్రంథము www.pravachanam.com నందు ఎల్లవేళలా లభ్యమగును గాన ఈ అవకాశమును అందరూ సద్వినియోగపరచుకొనవలసినదిగా మనవి.

ఈ పుస్తకము పఠించు సహృదయులకు శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రులవారు కరుణా కటాక్షముల ననుగ్రహించి సర్వశ్రేయాలు కలిగించుగాక!

**కుటుంబ సభ్యులు**

**(12-11-2020)**

# ముందుమాటలు

**శ్రీ** సకల భువన సామ్రాజ్యలక్ష్మీ ప్రసాద సిద్ధికొరకై యా దివ్యమహిషిని ప్రార్థన చేసి నే చెప్పబోవు తొలి పలుకులు రసజ్ఞులైన మహనీయ పాఠకులందరు ఆలకింతురు గాక.

నా చిన్నతనమున మా తండ్రిగారైన మొలుగు వెంకట నరసింహాచార్యులు గారు నాకు అక్షర జ్ఞానముతో బాటు కావ్యపఠనమందు ఎంతయో అభిమానము కలిగించిరి. సంస్కృత వాల్మీకి రామాయణముపై మక్కువ వారివలననే కలిగినది. దానిని చదివినను పూర్తిగా అవగాహనము చేసుకొనలేనను భయముతో సంస్కృతమునకు సరియగు ఆంధ్ర పద్య కావ్యమునకై యెంతయో యత్నించితిని. నా తపన ఫలించి అట్టిది లభించినది. కాని యెంత హృద్యముగ నున్నను పద్యమును చదువువారు నేడు కరవైపోవుచున్నారు. పండితులకు సంస్కృత మైనను, ఆంధ్ర పద్యమైనను, వచనమైనను ఒకటే ఉపాదేయమే వచనమైనచో సామాన్యులును చదివి యానందించగలరు. నేను ఆంధ్ర రామాయణ గ్రంథలభ్యతకై పడిన తపన – వాల్మీకి రామాయణమునకు సరియగు తెలుగు వచన రామాయణమునకై మరి యెవ్వరును పడరాదని తలచి – యీ రచనకు పూనుకొంటిని.

నాకు లభించిన ఆంధ్ర వాల్మీకి రామాయణ పద్యకావ్యము మూలానుసారియైయున్నది. ఆంధ్ర వాల్మీకి, వాసుదాసు వంటి సార్థక నామములు గల శ్రీ వావిలికొలను సుబ్బారావుగారిచే రచింపబడినది. కనుక

దానిని చదివి వచన రూపమునకు తెచ్చుటకు ఉత్సాహపడితిని. రామాయణము వంటి కావ్యమును అందరు చదివి ఆనందించునట్లు ప్రసన్న మాధుర్యమైన వచనములో వ్రాయుట నాకు సాధ్యపడునా? అను శంక నన్ను బాధించు చుండగా, మా ఇలవేల్పులు శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మి అమ్మవారును, శ్రీ ఆపదోద్ధారక ఘోర వీర లక్ష్మీనృసింహస్వామివారును, శ్రీ పంచాయతన వేణుగోపాలస్వామి వారును రచనకు ఉపక్రమించుమని నన్ను ఆదేశించిరి.

శ్రీమాన్ మాంత్రిక రాణ్మౌళి, శ్రీమత్పండిత మంత్రరత్న బిరుదాంకితులైన నా పతిదేవులు శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకటరాఘవాచార్యుల వారి యాదేశము లభించినది. వారి ఆదేశముల ననుసరించి, ఆదేశకర్తలపైననే భారముంచి రచనకు ఉపక్రమించితిని.

మా పొరుగువారైన శ్రీ అవ్వా జగన్నాథశాస్త్రిగారి సతీమణి సుశీలాదేవిగారు కావ్య పఠనమునందు ప్రీతి కలవారు. పరహృదయములను అవగాహన చేసుకొను సహృదయ స్నేహపాత్ర. వారు నేను వ్రాసిన దానిని చదువుచు సూచనలనిచ్చుచు ప్రోత్సహించిరి. నా మనుమలు శ్రీధర్, శ్రీకాంత్‌లు శ్రద్ధతో భౌతిక సౌకర్యములు కల్పించుచు వచ్చిరి. నా సోదరుడు మొలుగు రంగాచార్యులు రచనలో మెళకువలు తెలుపుచు, వాక్య నిర్మాణమున సూచన లిచ్చి సహాయపడినాడు. నా పెద్దకుమారుడు రాధాకృష్ణమాచార్యులు కోరగా గ్రంథమును పరిష్కరించుటేకాక శుద్ధప్రతిని కూడ వ్రాసియిచ్చిన పండితులు, ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు నగు శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. వీరు కవులు, సాయిభక్తులును. కాళిదాస విరచిత రఘువంశమును ఆంధ్రమున పద్య కావ్యముగా 'రఘువంశ తిలక చరితము' అను పేరున, మయూర కవి విరచిత సూర్యశతకమునకు వ్యాఖ్యను వ్రాసి ప్రచురించినవారు, ఇంకను అనేక రచనలు చేసినవారు. వీరికి నాయందు గల సోదరీ వాత్సల్యము,

శ్రీరామచరితముపై గల అభిమానమును యింతటి శ్రమ తీసుకొనుటకు కారణములైనవి.

వీరందరికి శ్రీ సీతారాములు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి రక్షింతురు గాక!

ఈ గ్రంథమును శ్రీ సకలభువన సామ్రాజ్య లక్ష్మీనారాయణ స్వామివారికి తత్కటాక్ష లబ్ధికోరి నా హృదయ కుసుమముతో జతచేసి సమర్పించుచున్నాను. ఇందలి గుణములను గ్రహించి దోషములు విసర్జించ గోరుచున్నాను. కథానాయకుడు శ్రీరామచంద్రుడు సాగరమును దాటించి హనుమను అనుగ్రహించినట్లు యీ సంసార సాగరము నుండి నన్ను తరింపజేసి పరమపదము ననుగ్రహింప గోరు భాగవత పదదాసి.

(సం) **శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**

**(అయ్యవారిరుద్రవరము)**






**శ్రీ**మాన్ శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకట రాఘవాచార్యులుగారు మంత్రానుష్ఠానము చేసి సిద్ధి నొందిన మహనీయ చరిత్రులు. వారి ధర్మపత్ని వెంకట సీతమాంబగారు, వారి ధర్మపత్నియై జన్మసిద్ధమైన భగవద్భక్తికి మెరుగుపెట్టుకొనిన ధన్యురాలు. ఆమె లౌకిక విద్యలలో ప్రావీణ్యమును సంపాదింప యత్నించలేదు. కాని ఉత్తమ గృహిణిగా శ్రీ రాఘవాచార్యులుగారి సాహచర్యమున, భగవదుపాసనమున పరినిష్ఠితురాలై భగవదనుగ్రహ పాత్రతనందినారు. భగవత్కటాక్ష విశేషముచే దివ్యమైన జ్ఞానవైశద్యము, సౌమ్యమైన వాక్కు, ప్రకృతిసిద్ధమైన మాధుర్యము వారి కలవడినవి. ఈమె పతివ్రతయగుటచే పతివ్రతయై కారుణ్యరూపిణియై ఛాయవలె శ్రీరామచంద్రుని అనువర్తించి, తన నడవడిచే లోకాన్నే కాక ప్రియుని కూడ పరవశింపజేసిన ధన్యచరిత. భూజాత సీత చరిత మీమె మనసు నాకర్షించినది.

"సీతాయాశ్చరితం మహత్" అని పేరుపొందిన శ్రీరామాయణము ఆంధ్ర వాల్మీకి నుండి వెల్వడినది. అది ఈమె భాగ్యవశముచే నిత్యపారాయణ గ్రంథమైనది. పెద్ద పాండిత్యము కాని, భాషాజ్ఞానము కాని లేదని చెప్పుకొనుచున్న ఈమెకు ఆ రామాయణము నంతను తన వాక్యములతో తెనుగున వ్రాయవలెనని కోరిక కలిగినది. ఇది పూర్వజన్మ సుకృత ఫలము. శ్రీరాముని చరితము చదువుట, అనుభవించుట మాత్రమే కాక తామాస్వాదించిన దానిని తమదిగా చేసుకొని తన వాక్కులతో ఆవిష్కరించవలెనని కోరిక కలిగినది. దానికి తగిన భాష, ఆవిష్కరణ శక్తి వారి ఉపాస్యదైవము వారికి అనుగ్రహించినారు.

ఆంధ్ర వాల్మీకి విరచిత శ్రీరామాయణము వాల్మీకి ప్రతి శ్లోకమునకు అనువాదము మాత్రము కాదు. రహస్యార్థప్రతిపాదకములగు శబ్దములను విడువక అనువాదము నందిచ్చిన మహత్తర గ్రంథము, దాని నర్థము చేసుకొనుట కష్టము – కాని అర్థము చేసుకొనినారు. చేసుకొని సులభము, నిర్దుష్టము, స్పష్టము, అన్వయ క్లేశరహితము నగు మధుర ప్రసన్న భాషలో వచనముగా అందించి జీవితాన్ని సార్థకము చేసికొనినారు. శ్రీరామాయణము ప్రాచేతసుల నుండి వెల్వడిన వేదము. వేదమున పూర్వభాగార్థమును వాల్మీకి వాచ్యార్థమున కవిగా ప్రతిపాదించినాడు. అంతరమగు ధ్వన్యర్థమున ఆధ్యాత్మికమైన వేదోత్తర భాగార్థమును మునిగా సూచించినాడు. ఈ రామాయణమున శ్లోకమును కాని, పాదమును కాని అధ్యయనము చేసినంతనే భగవత్సాయుజ్యము నొందెదము అని పెద్దలు చెప్పుదురు. అట్టిచో ఈమె ఏడు కాండలు చదివి అనుభవించి జీర్ణము చేసుకొని తనదిగా తెనుగు వచనమున ఆవిష్కరించి ధన్యత నందినారు. ఈమె భాగ్యమే భాగ్యము.

ఈ అనువాదము అనువాదము వలె లేదు. స్వతంత్రముగా సాగినది. భాష సహజము, మధురము, ప్రసన్నము. వాక్యము సంస్కృతమునకు అనువాదముగా ఉండక అచ్చమైన తెనుగుదనమును సంతరించుకొన్నది. బాలకాండములో అశ్వమేధయాగ సందర్భమున ఆమె చేసిన అనువాదము ఆశ్చర్యజనకముగా నున్నది. పండితులకు కూడ దురవగాహమైన యాగక్రమ వివరణము పండితులకు కూడ సంశయము తీరునట్లు, పామరులకు కూడ సులభముగ అర్థమగునట్లు వ్రాసినారు. ఇది చదువుకొనిన జ్ఞానము కాదు. భగవదుపాసనచే వచ్చిన భాష–విషయ వైశద్యము. తెనుగున ఇంతవరకు ఎన్నో – గ్రాంధికభాషలో, వ్యావహారిక భాషలో గూడ అనువాదములు వచ్చినవి. భాషలో, వాక్య నిర్మాణములో ఇంత అందము సౌలభ్యము వేరొకదానిలో చూడమనుట అతిశయోక్తి కాదు – వాస్తవము.

ఆమె అనుభవించిన శ్రీరామచరితమును లేశమాత్రమనుభవించి ధన్యత నొందిన వాడనగుటచే అనువాదమును చూచి ఆనందించి ఆమె చేసిన ప్రయత్నమును అభినందింపకుండ ఉండలేకనే యీ మాటలు వ్రాయుచున్నాను. కాని ఆమె ద్వంద్వాతీతురాలు. ఆమెకు వెనుక బలము ఆమె ఉపాస్యదైవము. ఆ దైవబలము పలికించగా వాల్మీకి నోటినుండి శ్రీరామాయణ మంతయు బ్రహ్మానుగ్రహముచే వెల్వడినట్లు ఈ వచన శ్రీరామాయణము ఈమె నోటి నుండి వెల్వడినది. ఆంధ్ర పాఠకలోకము అన్యూనాతిరిక్తముగ వాల్మీకి రామాయణమును గ్రహించుటకు ఈ గ్రంథము సాయపడును.

ఆమె తరించుటయే కాక అందరిని తరింపచేసిన ధన్యచరిత మా సీతమ్మగారికి శ్రీ సీతారామచంద్రులు తమ విశేష కటాక్ష ప్రసాదముచే ఇతోధికముగ లోకానికి తమకున్న దైవీసంపదను పంచిపెట్టు శక్తిని, భక్తిని ప్రసాదింతురు గాక అని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

**(సం) శ్రీ భాష్యం అప్పలాచార్యులు**

**26-12-1989**



**శ్రీ హయ వదన పరబ్రహ్మణే నమః**

**శ్రీమతే రామానుజాయ నమః**

# ఆశీస్సు



**సుఖాయ కర్మాణి కరోతి లోకః నతైస్సుఖంవా న్యదుపారమం వా।**
**విందేత భూయాస్తత ఏనదుఃఖం యదత్ర యుక్తం భగవన్వదేన్నః॥**

అని నటుల ఈ ప్రపంచమున ప్రకృతి బద్ధులగు చేతనులందరును సుఖాపేక్షచే కొన్ని కార్యములందు ప్రవర్తించుచున్నారు. అందువలన వీరికి సుఖప్రాప్తి గాని దుఃఖ నివృత్తి గాని సంభవించకపోవుటయే గాక అధికముగా దుఃఖములు సంభవించుచున్నవి. ఇటుల ప్రకృతి పిశాచికావిష్టులై ప్రకృతి సామ్యము ననుభవించుచు స్వభావ సహజమగు జ్ఞానానందమలత్వాదికమును, పరమపురుషశేషత్వమును విస్మరించి నానావిధ సాంసారిక దుఃఖముల ననుభవించుచున్నను క్షణకాలము కూడ ప్రకృతి సంబంధము లేక యుండ జాలరు. ఇది యొక విచిత్ర సంఘటన. ప్రకృతి సంబంధ విచ్ఛేద మెటుల సంభవించును? ఇందుల కుపాయమెద్ది? దీనిని తెలుసుకొనుటకు సాధనము లేవి? యని విచారింపగా ప్రత్యక్షము అతీంద్రియార్థములను గోచరింప చేయనందునను, అనుమానము ప్రత్యక్షాప్రేక్ష మగుట చేతనున్నూ – ఇవి సాధనము లన వీలులేదు. ఇక శబ్దమును సాధనముగా గ్రహించవలెను. అదియు పౌరుషేయమైనచో సజాతీయ పురుషులయందు విశ్వాస ముండదు గాన వారు చెప్పినదాని ననుసరించుట అసంభావితము. దీనిని విచారించి నిరుపాధిక వత్సలుడును దయాసముద్రుడును సర్వశక్తుడు నగు భగవానుడు

అపౌరుషేయము నిత్యనిర్దోషము సకల పురుషార్థబోధకము నగు వేదమును తన నాభికమలమున జన్మించిన చతుర్ముఖుని కుపదేశించెను. ఆ వేదమింత వరకు అవిచ్ఛిన్నముగా పాఠక్రమమున వచ్చుచున్నది. దీని కర్థము దుర్బోధక మగుట వలన వివరణ మపేక్షిత మగుటచేత సర్వేశ్వరుడు మహాత్ముల కొందరి నవతరింపజేసి వారిలో తా నంతఃప్రవిష్టుడై వారి ముఖమున వాటిని వివరించుటకు ప్రవర్తించిన వాడాయెను.

ఆ వివరణములు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ఆగమములు – అని వ్యవహరింపబడుచున్నవి. ఇందు స్మృతులు మానవ పారాశర్యాదులు. ఇవి భగవదారాధన రూపమును ఫలాపేక్షి జనానుగ్రాహకము నగు కర్మ కాండమునకు వ్యాఖ్యారూపములు. ఇతిహాసములు – రామాయణ భారతాదులు. ఇవి మహాపురుష చరిత్ర బోధకములగుచు వేదాంత భాగ వ్యాఖ్యారూపములు. పురాణములు – విష్ణుపురాణ, భాగవతాదులు. ఇవి సర్గాదిలక్షణపంచక సమేతములై వేదాంతార్థ ప్రకాశకములు. ఆగమములు పాంచ రాత్రాదులు. ఇవి దేవతారాధన బోధకములు. ఇందు ఇతిహాసము సాక్షాదుపనిషద్వ్యాఖ్యాన మగుటచే స్మృత్యాదికమున కంటె ప్రశస్తము. ఇందు రామాయణము సీతారామ రూప మానుష వేషధారులగు శ్రీ శ్రియఃపతుల యొక్క చరితమును బోధించు నదియు, చతుర్ముఖ ప్రేరితుడగు వాల్మీకి మహర్షిచే రచింపబడినదియు మోక్షసాధనమగు భగవచ్ఛరణాగతిని సీతా రూపమును ధరించిన శ్రీదేవి యొక్క పురుషకార వైభవమును ప్రతిపాదించునదియునై యున్నది. కనుకనే –

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।**
**వేదః ప్రాచేత సాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా ॥**

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథ కుమారుడుగా నవతరించగా – ప్రమాణము ప్రమేయానుసారి కనుక – ప్రమాణమగు వేదము వాల్మీకి మహర్షి వలన రామాయణ రూపమున నవతరించినదని ప్రశంసించబడి యున్నది.

శ్రీమద్రామాయణము సీతారాముల చరిత్రమైనను ఇందు ప్రధానముగా

సీతాచరిత్రమే చెప్పబడినదనియు, ఇది గొప్పదనియు, "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్" అని వాల్మీకి మహర్షి చెప్పియుండెను. సీతాచరిత్ర దేనికంటె గొప్పది? అనిన రామచరిత్రకంటె – గొప్పదని యభిప్రాయము. పూర్వాచార్య గృహీతమగు నీ క్రింది శ్లోక మీ విషయమును స్పష్టపరచుచున్నది.

**"మాతర్మైథిలి రాక్షసీస్త్వయి తదైవార్ద్రా పరాధాస్త్వయా**
**రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా ।**
**కాకంతం చ విభీషణం శరణ మిత్యుక్తి క్షమౌ రక్షతః**
**సానస్సాంద్ర మహాగస స్సుఖతు క్షాంతిస్తవా కస్మికీ ॥**

రావణ సంహారానంతరమున హనుమంతుడు సీతా సమీపమునకు వెళ్ళి రాక్షస స్త్రీలు నీ విషయమున అపరాధము చేసి యున్నవారు గాన వీరిని సంహరించుటకై అనుజ్ఞ నీయవలసినదనగా రాజాశ్రితులు రాజాజ్ఞచేతనే గదా ఏపనినైన చేయుట. అట్టి వారి విషయమున కోపించుట యుక్తము కాదని రాక్షసస్త్రీలు తమ రక్షణను ప్రార్థించక పోయినను వారిని రక్షించెను. శ్రీరామచంద్రుడు శరణ ప్రార్థన చేసిన కాకాసుర విభీషణుల రక్షించెను. ఇందువలన రామచరితము కంటె సీతాచరితము గొప్పదను ఆశయము చేతనే "సీతాయా శ్చరితం మహత్" అని చెప్పెను.

ఇట్టి శ్రీరామాయణమును సర్వజనులకు సులభగ్రాహ్య మగునటుల వచన రూపమున వ్రాసి లోకోపకారము గావించినదీ సీతామతల్లిక. సీతమ్మకు సీతాచరితమే మనోహరము ఆనందావహము కదా! కనుకనే భగవచ్చరితము లనేకము లున్నను ప్రథమమున శ్రీరామాయణము వ్రాయబడినది. ఇటుల భగవచ్చరిత బోధకములగు యితర గ్రంథములను కూడ సుగ్రాహ్యములగు నటుల వచన రూపమున వ్రాయుట కీమెకు భగవాను డాయురారోగ్యోత్సాహాదుల నొసంగుగాక!

(సం) **మొలుగు రామానుజాచార్యులు**
**ముగ్గుళ్ళ**

# విషయసూచిక

**శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత**

**శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః**

**శ్రీ శారదాయై నమః**

**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణ వచన కావ్యము**

# అరణ్య కాండము

**శ్రీ నారాయణ! కరుణా ధీనా! దీనార్తిహరణ! ధీమజ్జనర**
**క్షానియమా! యసవర్గవి ధానక్షమ! యొంటి మిట్ట దశరథరామా!**

## మొదటి సర్గము

### శ్రీరాముడు దండకారణ్యము ప్రవేశించుట

ధీరుడును అపరిమిత పరాక్రమశాలియు నయిన రామభూమీశుడు ఘోరమృగసంఘములు గల దండకారణ్యము నందు ప్రవేశించి యందు అందమైన చెట్లతో నిండి యింపుగా నున్నవియు, మృగములచే సేవింప బడుచున్నవియును అయిన మనోహరములగు తాపసాశ్రమ సమూహమును చూచెను. ఆ యాశ్రమ సమూహము నారచీరలతోను, దర్భలతోడను నిండి

వేదమంత్ర పవిత్రితమైన ఆకాశమందు గొప్పకాంతిచే చూడనలవి కాని సూర్యమండలము వలె నొప్పుచుండెను. అనేక విధముల మృగములతోడను, క్రొత్త క్రొత్త పక్షుల తోడను నొప్పుచున్నదై అప్సరసల యొక్క ఆట పాటల తోడను అర్చనల తోడను సంతోషమును గలిగించుచున్నదై విశాలముగా నున్న అగ్ని వేదికల తోడను, యజ్ఞ పాత్రల తోడను, కృష్ణాజినముల తోడను, దర్భసమూహముల తోడను, సమిధల తోడను, నీళ్ళ కడవల తోడను, ఫల మూలముల తోడను, విరాజిల్లు చున్నదై రుచి గలిగిన పండ్లు గల వృక్షములతో నిండి హెూమములు గలదై, వేద నాదములతో నిండి యున్నదై తామరలతో నిండిన కొలనులు గలిగి ప్రకాశించుచుండెను. ఫలమూలములను మాత్రము భుజించువారును, ఇంద్రియ నిగ్రహము గలవారును, నారచీరలు, మృగచర్మములు ధరించువారును, సూర్యునివలె, అగ్నివలె ప్రకాశించు తేజస్సు గలవారును అగు పురాణమునులు నిలుచుట కాస్పదమై మనోహరముగా నుండెను. ఆ యాశ్రమ సముదాయము బ్రహ్మ నివాసమగు సత్యలోకము వలె, వేదఘోషతో నిండి బ్రహ్మతత్వము నెఱిగిన బ్రాహ్మణుల తోడను, బ్రహ్మర్షుల తోడను నుండి కడు పవిత్రమై యుండెను. రాముడా యాశ్రమమును దగ్గర నుండి చూచి తన విల్లును దించి ప్రవేశింపగా దివ్యతత్వము నెఱిగిన ముని శ్రేష్ఠులు మిక్కిలి సంతోషముతో నెదురేగి రాజపుత్రుడైన రాముని, యశస్సుగలిగిన జానకిని, తమ్ముడగు లక్ష్మణుని చూచిరి.

## మునులు తమ్మురక్షింప శ్రీరాముని ప్రార్థించుట

ఆ మునులు ఉదయించుచున్న చంద్రుని వలె ప్రకాశించుచున్న రామచంద్రుని, శోభయుక్తుడైన లక్ష్మణుని, స్వచ్ఛమైన యశస్సు గలిగిన జానకీదేవిని ప్రేమతో గూడిన గౌరవముతో మంగళాశాసనములతో ప్రశస్తమైన మనస్సు గలవారై భక్తితో భజించిరి. ఆ వనవాసులు శ్రీ సీతావల్లభుని సుకుమారమైన శరీరమును తనివితీరా చూచి చాలా సేపు విస్మయ సముద్రమున

మునిగిరి. జనకసుతను, లక్ష్మణుని, శ్రీ రాముని నచ్చటి ఋషులందఱు చూచిన వారై తీరని తృప్తితో ఆశ్చర్యముతో అనిమేషత్వము గాంచిరి (రెప్పపాటులేని వారైరి). కొంత సేపటికి తేరుకొని మహాత్ముడైన తమ అతిథిని సమస్త భూతసంఘములను రక్షించు తలపుగలవానిని ఆ ధర్మనిరతులు తమ పర్ణశాలలకు తోడ్కొని పోయి ఆసనములందు కూర్చుండజేసి దుంపలు, ఫలములు, పువ్వులు, కాయలు, మున్నగునవి యొసగి చేతులను జోడించి రామచంద్రా! ఈ మునిసంఘమున కంతటికి నీవే శరణ్యుడవు. ధర్మములను రక్షింపగలవాడవు. ఓ సన్నుత కీర్తిశాలీ! నీవు వనములందున్నను, పురము నందున్నను నీవే మాకు గురుడవు, పూజనీయుడవు, దైవమువు, మన్నింపదగినవాడవు, శాసించువాడవు, రాజువు. నీవే మా స్వామివి కూడాను. ఓ రాజపుత్రా! ఇంద్రుని నాల్గవ పాలును రాజు స్వీకరించి ప్రజలను రక్షించి దురాశారహితుడై లోకులచే నమస్కృతుడై యెన్నరాని సుఖములను పొందును. కాన మేమెల్లరము నీ రాజ్యమునందుండుటచే ఓ రాజపుత్రా! నీచే రక్షించబడుట కర్హులమగు మమ్ము గొప్పనైన దయతో రక్షింపుము. ఓ తేజోనిధీ! మునులమైన మాకు దండోపాయము ననుసరించుట తగనిపని. ఇంద్రియములను జయించుటచే ఆగ్రహమును పొందలేము. ఓ మహాత్మా! నీ గర్భవాసమందు పుట్టిన వారిని వలె నీవు మమ్మెప్పుడు రక్షించుట తగియున్నది. ఓ పద్మాక్షా! ఉదయించిన దయాతిరేకముతో తపోధనాఢ్యులమగు మమ్ము రక్షింపుము. అని ఈ విధముగా సీతాలక్ష్మణసమేతుడైన శ్రీరాముని నా మునులందఱును పూజించిరి. సిద్ధసాధనులు, అగ్ని సములు, న్యాయమైన నడవడి గలవారునయిన అచటి మునులందఱు వనములందు దొరకు మంచి ఫలపుష్ప సంతతుల చేతను, మృదువైన దుంపల చేతను ప్రేమతో సంతోషముతో సర్వేశ్వరుడగు రామునర్చించిరి.

# రెండవ సర్గము

## విరాధుడు సీత నెత్తుకొని పోవుట

రామచంద్రుడా యాతిథ్యము నంగీకరించి తెల్లవారగనే ఉచిత విధులను దీర్చి ఋషీశ్వరుల చేత వీడ్కోలు పొంది, నానామృగములచేతను, వివిధ వృక్షముల చేతను నిండినదియు, పెద్దపులులు, పందులు, కారెనుపోతులు భల్లూకములు మొదలైన జంతువుల యొక్కయు, ఈలపురుగుల యొక్కయు ధ్వనులతో నిండినదియు, కోకిలలు, చిలుకలు, కాకులు మొదలైన పక్షులు కలకలారావములు గలదియు, విరిగిన తరువులు తీగలతో ప్రవేశింపరానిదియు, నీరు లేని సరస్సులుగలదియు నయిన అరణ్య మధ్య స్థలమును, సీతయు, లక్ష్మణుడును తన్ననుసరించుచుండగా ప్రవేశించెను. అచ్చట పర్వత శిఖరము వలె ఎత్తైనవాడును, గొప్పగా శబ్దించుచున్న వాడును, మనుష్యులను భక్షించువాడును, లోతైన పెద్ద కన్నులు గలవాడును, వికటముగా నున్న నోరుగల వాడును పెద్ద పొట్టగలవాడును, పెద్దదై వికృతమైన భయంకరమైన ఆకృతి గలవాడును, క్రొవ్వుతోను నెత్తురుతోను తడిసి యున్న పులితోలు ధరించి మూడులోకములను మ్రింగివేయునో యనునట్లుగా నోరు తెరచి యమునివలె భూతజాలములకు భయము గలుగుజేయుచు నాల్గుపులులను, రెండు తోడేళ్లను, మూడు సింహములను, పది దుప్పులను, ఏనుగుతలను శూలాగ్రమందు గుదిగా గ్రుచ్చి పెద్దగా బొబ్బలు పెట్టుచున్నవాడును అగు నొక క్రూరుని సీతాలక్ష్మణ సహితుడై రాముడు చూచెను. అతడును రామలక్ష్మణులను, జానకిని జూచి క్రోధము నొందిన వాడై భూమియంతయు నెక్కువగా అదరుచుండగా

లయకాలుని వలె భయంకరముగా ధ్వనిచేయుచూ హఠాత్తుగా మీదకు వచ్చి జానకీదేవిని తీసికొని వెళ్ళి వేగముగా తొడపై నిడికొని వారలతో నిట్లనెను. మీరెవ్వరు ? ఈ యడవిలో నిట్లు జడలు ధరించి చర్మములు గట్టి కడు క్రొవ్వెక్కి బాణములు, ధనుస్సులు, ఖడ్గములు ధరించి భార్యతో గలసి యేల చరించు చున్నారు? మౌనులకు యువతి యేల? దుష్టచరిత్రులారా? చూడగా మీ స్వభావములు వేరుగా తోచుచున్నవి. పాపులారా ! ముని వృత్తికి దోషము నాపాదించుచున్న మీరు చావగలరు సుమా! నేను విరాధుడను పేరుగలవాడను. వీరుడను, శస్త్రములను చేతుల ధరించి మునుల యొక్క మాంసమును దినుచు నీ వనమునందు సంతోషముతో సంచరించుచుందును. ముందుగా పాపశీలురైన మిమ్ము జంపి మీ నెత్తురు ద్రావి ఈ స్త్రీని తప్పక నా భార్యగా చేసికొందును. ఇది నిజమని నమ్ముడు. అని విరాధుడు క్రొవ్వి పల్కిన మాటలను విని ఎక్కువైన భయముతో సీత హోరు గాలికి స్థైర్యము గోల్పోయి కంపించు అరటిచెట్టు వలె గడగడ వణకెను. ఈ విధముగా సీతాసాధ్వి భయము నంది రాక్షసుని తొడపై వణుకుచుండగా, సహజమైన ముఖ కాంతి గోల్పోయి సీతాపతి దుఃఖముతో తన తమ్మునితో నిట్లనెను. చూచితివా లక్ష్మణా! జనకుని యొక్క గారాబు కూతురు, నా భార్య, సోగకన్నులు కలది, ఎప్పుడును సౌఖ్యమును పొందునది, రాజపుత్రిక, శుభప్రదమైన శీలము గలది, మనస్సు నందు భయము గలదై క్రూరుడైన రాక్షసుని యొక్క అంకతలము నందుండి వణుకుచున్నది. భూదేవి పుత్రిక కెటువంటి కష్టము వచ్చినది తమ్ముడా! తల్లులలో మధ్యమురాలగు కైకేయి యేది కోరి నన్నడవులకు వెళ్లమన్నదో అది ఇప్పుడు వేగముగా ఫలించినది. తన పుత్రుడు రాజ్యము చేయుట మాత్రమే కోరిక. శిష్టులైన వారి కిష్టుడనైన నన్ను దురాలోచన గలదై అడవులకు పంపుమని తన ప్రాణనాధుని గోరుట యిందుకొఱకే కదా. జనకుని మృతి కంటెను, రాజ్య సంపద నపహరించుట కంటెను, సీతాదేవిని పరపురుషుడు ముట్టుకొనుట గొప్పనైన

దుఃఖమునకు గారణమయ్యెను సుమా. అని దుఃఖముతో కన్నుల నీరు నించుచు విచారించుచున్న రామచంద్రుని ముఖమును జూచి లక్ష్మణుడు క్రోధముతో సర్పము వలె రోజుచు నిట్లనెను. దేవాధీశుడైన ఇంద్రునితో సమానమైన తేజస్సు గలవాడా! భూతజాలములచే నుతింప దగిన ప్రభువై యుండియు, గర్వము గోల్పోయి, చేతకాని వానివలె కడు దుఃఖమును పొందెదవేలా? అన్నా! నీ సేవకుడనైన నేను లేనా? నా యొక్క భయంకరమైన అస్త్రధారలతో అడ్డగించుట కలవికాని నా బాహు విలాసముతో ఈ విరాధునిప్పుడే నేల గూలునట్లు చేసెదను. భరతుని యందు నాకు భరించరానంతగా కలిగిన కోపము నేడు వీనిపై జూపెదను. ఇంద్రుడు వజ్రాయుధమును పర్వతము పై నిడునట్లు నేడు వీనిపై నా కోపమును ప్రయోగించెదను. ఓ కాకుత్థ్సవంశశ్రేష్ఠుడా! ప్రకటమైన నా భుజబలము వలని వేగముతో ప్రకాశించు బాణసమూహము వీని గుండె బద్దలగునట్లుగా నాటుటచే అతివేగముగా వీనిని విగత జీవునిగా జేయును.



# మూడవ సర్గము

**అ**ని పల్కుచు బలవంతుడైన సుమిత్రానందనుడు రాక్షసుని జూచి మందహాసముతో ఓరీ నీవెవ్వడవు? ఈ వనము నందేల సుఖముగా తిరుగు చుంటివి? అని యడుగగా నా విరాధుడిట్లనెను. ఎవడవని నన్నే అడుగజాలిన మీరెవ్వరు? ఎక్కడకు పోయెదరు? అనగా రామచంద్రుడిట్లనెను. తెలిసి కొనముురా మేము మంచిదైన ఇక్ష్వాకు వంశమున బుట్టినవారము. క్షత్రియులము. నిర్మలమైన నడవడి గలవారము. నీవెవ్వడవు. కానలలో తిరుగుటకు కారణమేమి? అనగా విరాధుడు 'వినుము నా తండ్రి వీరుడైన జయుడను వాడు. తల్లి శతహ్రద యను పేరు గలది. అఖిల లోకములలో నున్న రాక్షసులందరు నన్ను విరాధుడని పిలుతురు. ఓ సూర్యవంశీయుడా! నేను తపస్సు చేసి శస్త్రములచేత చావు నొందకుండునట్లుగా బ్రహ్మ చే వరములపొందితిని. నరకుట చేతగాని భేదించుట చేతగాని చావకుండా వరము పొందితిని. మీకీ భూమియందు బ్రతికి యుండుట కిష్టము గలదేని ఈ కాంతను విడిచి పారిపొండు.

## రామలక్ష్మణులు విరాధుని వధించుట

అనగా విని కోపముచే యెఱ్ఱబడిన కనులు గలవాడై రఘురాముడిట్లనెను. ఓరీ! రాక్షసాధమా! దుష్ట గుణములు గలవాడా! ఈ విధముగా నీవు మృత్యువును కోరుచున్నావు. నన్ను యుద్ధముఖమున నెదిరించి శరీరముతో నుండెదవా అనుచు అల్లెత్రాటి నెక్కించిన ధనువునందు తీక్ష్ణములైన బాణముల సమూహము నెక్కుపెట్టి సురవిరోధిపై వేయుచు, మరల బంగారపు పుంఖము గలవియు, వాయువేగము, గరుడుని వేగము గలిగినవియు నైన ఏడు వాడి బాణములతో

విరాధుని హృదయమందు దూరునట్లుగా వేయగానే అవి పర్వతమువంటి యాదానవుని దేహమును ఛేదించుకుని రక్తదిగ్ధములై వెడలి అగ్నితుల్యమై భూమిలోకి జొచ్చెను. ఆ బాణముల వలనగలిగిన బాధతో జానకీదేవిని భూమిపై దించి కడు వేగముగా చేతితో శూలమును పట్టుకొని ఆ యిరువురు రఘువీరుల పైకురికి కాలయముడోయనునట్లు గట్టిగా అరచుచు నోరు విప్పగా ఆ అన్నదమ్ములా రాక్షసునిపై క్రూరమైన శరముల వర్షమును గురియించిరి. ఆ శరవృష్టికి నవ్వి భయంకరమైన శరీరము గలవాడై శరీరమును పెంచగా వారి బాణములన్నియు భూమిపై రాలెను. మరల రాముడు నిశిత శరముల నేసెను. వారు వేయుచున్న శర వర్షమును జూచి రాక్షసుడు నవ్వెను. వారును ఉగ్రమైన శరములను గురియించిరి. వాని వలన నొచ్చినవాడై బ్రహ్మ వరము వలన ప్రాణములు పోకుండా బగబట్టి ఆ శూరులమీద ఆకాశమున వెలుగులు జిమ్మునట్లు వజ్రసమానమైన శూలమును వేసెను. మండుచు వచ్చుచున్న ఆ శూలమును నడుమనే రెండు శరములతో కోదండగురుడైన రాముడు ఖండింపగా అది వజ్రాయుధముచే గొట్టబడి నేలబడు మేరువు గుండోయనునట్లు నెలగూలేను. శూలమును పడగొట్టి కృష్ణ సర్పములవంటి ఖడ్గములను చేతులందు పట్టుకొని భుజ విక్రమముతో తన మీదకు వచ్చుచున్న వారిరువురను కాలాంతకసముడైన రాక్షసుడు చేతితో పట్టుకొని యెత్తుకొని ఆకాశమున వెళ్ళుచుండగా వాని ఆలోచనను తెలిసికొని రఘురాముడు తమ్మునితో నిట్లనెను. ఇతని యిష్టము వచ్చినట్లుగా వెళ్లనిమ్ము. ఈ రాక్షసుడు వెళ్ళినదే మనకు మార్గమగును.



# నాలుగవ సర్గము

భుజముల మీద ఆ బాలకులను ముచ్చటగా నెత్తికొని ఆ వనమార్గమును బట్టి రాక్షసుడు పోవుచుండగా ఆ ఆగడమునుజూచి సీత భయభ్రాంతయై దుఃఖమును భరింపలేక గట్టిగానేడ్చెను. అయ్యా! సత్యవంతుని, ఆచారవంతుని రాముని తమ్ముని నిట్లు బాధపెట్టుటకై రాక్షసుడు దయలేని వాడై తీసుకొని వెళ్ళుచున్నాడు గదే! పులులును, తోడేళ్ళును, చిఱుతపులులును ఇచ్చట నన్ను తినివేయును. అందుచే వారిని విడచిపెట్టి నన్ను తీసికొని పొమ్ము. ఓ రాక్షసోత్తమా! నీకు మ్రొక్కెదను. నాయందు దయ యుంచుము. భూసుత యొక్క ఈ ఆర్త వాక్యములను విని దాశరథులిద్దఱును దానవుని జంపుటకు తొందరపడిరి. అందు లక్ష్మణుడు ఎడమ చేతిని రాముడు కుడి చేతిని నరికి వేయగా నల్లని మేఘము వలె నున్న ఆ రాక్షసుడు భయంకరమైన వజ్రాయుధపు టంచుచే తెగిన పర్వతము వలె నేల గూలెను. ఆగ్రహముతో మోచేతులతోను, మోకాళ్ళతోను, పాదములతోను, పిడికిళ్ళతోను, క్రుమ్ముచు, గ్రుద్దుచు పైకెత్తి యెత్తి నేలపై విడుచుచు ఖడ్గములతో నరకుచు, వాడిబాణములతో గ్రుచ్చుచు, నేలపై బడవైచుచు, ఏమి చేసినను చావని ఆ కఠినుడగు రాక్షసుని జూచి, భీతజనుల కభయప్రదాత యయిన సీతానాధుడు తమ్మునితో నిట్లనెను. ఇతడు వరబలము చేత వాడియైన బాణముల చేతను చావడు. గొయ్యి త్రవ్వి పాతిపెట్టినచో చచ్చిపోవును. అనగా ఆ విరాధుడు రాముని మాటలను విని రామునితో నిట్లనెను. ఓ ఇంద్రసమానమైన తేజముగలవాడా! నేను నీ చేత చచ్చితిని. ఓ పురుషసింహుడా! నా అజ్ఞానముచే నిన్ను ముందుగా తెలిసికొనలేక పోయితిని.

**విరాధుడు శ్రీరామునకు తన శాపవిధంబు నెఱింగించుట.**

ఓ కౌసల్యానందనా! కరుణాత్మా! శ్రీరామా! తండ్రీ! మిమ్ముల నిప్పుడే నేను తెలిసికొంటిని. ఈ మహాభాగయైన సీతామహాదేవిని లలితయశుడైన లక్ష్మణుని నెరింగితిని. రామా! నేను తొలుత తుంబురుడను గంధర్వుడను. రంభను గూడి నియమము తప్పి చరింపగా జూచి కుబేరుడు రాక్షసాకృతిని బొందుమని శపించెను. దానికి భయపడి నేను శాపవిమోచనము తెల్పుమని వేడగా దశరథసుతుడైన రాముడు శౌర్యముతో యుద్ధమున నిన్నెప్పుడు వధించునో అప్పుడు నీవు పూర్వరూపమును పొందెదవని మందలించెను. శ్రీరఘురామా! నీదయ వలన క్రూరశాపవిమోచనమైనది. ధన్యుడనైతిని. ప్రేమతో నాకు సెలవిచ్చినచో స్వర్గమునకు వెళ్ళెదను. మీకు శుభము కలుగుగాక. ఇటుగా నొకటిన్నర యోజనముల దూరము వెళ్ళుము. అందు తన కాంతిచే సూర్యుని సైతమపహసించు శరభంగుని చూడుము. నీకు శ్రేయము కలుగును. నన్నీ మహాగర్తమునందు పూడ్చిపెట్టి వెడలుము. చచ్చిన రాక్షస సమూహము నిట్లు పూడ్చిపెట్టుట ధర్మమని పూర్వము పెద్దలు పలికిరి. ఎవ్వాడు గుంతయందుంచ బడునో వాడు సనాతనమైన లోకములందే యుండును. ఈ బాధను భరింప లేకున్నాను. ప్రాణమొసగిపోవుచున్నది. అనగా లక్ష్మణా! ఏనుగునకు వలె నీ రాక్షసునకు గొయ్యినొకదానిని త్రవ్వుమని పల్కుచు రాజశ్రేష్ఠుడు తాను దానవుని కంఠసీమపై ప్రయత్నముతో పాదమునుంచెను. సౌమిత్రీ త్రవ్వుగోలను బూని ఆ దానవుని ప్రక్క నొక్క గోతిని అతి త్వరగా త్రవ్వగా వారిద్దరు తమ బలమునంతయు నుపయోగించి వానిని గోతిలోనికి గట్టిగా త్రోయగా వాడు భంకరధ్వనితో కూలెను. శ్రీరాఘవులు అతడు శస్త్రసమూహముచే మృతి బొందడని వానినాబిలాంతరమందే దెబ్బలతో చంపివేసిరి. రామలక్ష్మణులీ ప్రకారముగా విరాధుని జంపి సంతుష్టినొందినవారై గొప్ప గండశిలలచే ఆ గోతిని పూడ్చి బంగారపు విండ్లు ధరించి జానకిదేవిని సమీపించి ఆకాశమునందు చంద్రసూర్యులవలె కాంతిమంతులగు వారివురు ఆ కాననమునందు ప్రకాశించిరి.

# ఐదవ సర్గము

## సీతారామలక్ష్మణులు శరభంగాశ్రమమునకు బోవుట

జానకీదేవి నూరడించి రాముడు తమ్ముని జూచి లక్ష్మణా! ఈ అడవి భయంకరమైనది మనకు ప్రవేశింప నలవిగాదు. కష్టము సుమా. శరభంగ మహర్షిని దర్శించుదము పదమని తొందరగా బయలుదేరి ఆ ఆశ్రమ సమీపమున దివ్యుడును, సూర్యాగ్నిసమతేజుడును, ఆకాశయానముగల రథమందున్నవాడను, దేవతల సమూహముచే కొలువబడువాడును నేలకు తాకక ఆకాశమున నున్నవాడును, మంచి ప్రకాశముతో నున్న భూషణములు ధరించినవాడును, శుచియైన వస్త్రములు ధరించినవాడును, పచ్చని గుఱ్ఱములు గలవాడును తనను తన వంటి వారి సమూహముచే కొలవబడుచున్నవాడును, తెల్లని మేఘమును, చంద్రబింబమును బోలిన ఛత్రముగలవాడును, అందమైన రూపము, సుకుమారమైన శరీరము గల స్త్రీల చేతులలో ధరింపబడిన బంగరు దండములు గల వీవనలు చామరముల కదలికచే వచ్చిన మంద మారుతములచే గదలింపబడిన ముంగురులు గలవాడును, దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు గుంపులు గూడి వైదికస్తుతులతో పొగడుచు ప్రక్కనుండగా వెలుగుచున్నవాడును అగు ఇంద్రుని చక్కగా చూచెను. గొప్పకాంతితో వెలు గొందుచున్న శరభంగునితో ముచ్చటించుచున్న ఆ ఇంద్రుని జూచి రాముడు తమ్మునితో లక్ష్మణా! వింతగా ప్రకాశించుచున్న వాడును, సూర్యునివలె వెలుగొందుచు, ఆకాశసంచార సమర్థమైన రథము నందు ప్రకాశించుచున్న వాడును అగు నితనిని జూచితివా? ఇంద్రున కెటువంటి గుఱ్ఱములుండునని

మనము వినియుంటిమో అట్టివి ఆకుపచ్చనివైన గుఱ్ఱములు ఆకాశము నందుండుటను జూచితివా? రథము చుట్టును గొలిచియున్న వారు శూరులు, గొప్ప ఖడ్గములు చేతులందు ధరించినవారు, దిట్టలు, ఎఱ్ఱని వస్త్రములు ధరించినవారు, పొడవైన చేతులు గలవారు, యౌవనవంతులు, కుండలములను ధరించినవారు, హారములురములందిటునటు చలింప, మనోహరములై విశాలములైన వక్షములు గలవారు, వారింపనలవి గాని శౌర్యదర్పము గలవారు, పెద్దపులుల వలె నున్నవారు, వయస్సుచే నిరువదియైదు వత్సరముల వారునై యున్న వీరిని చూడుము. దేవతలకెల్లప్పుడు నిదియే ప్రాయమగుటచే వీరు నిక్కముగా దేవతలు. ఓ వీరుడా! నీవును సీతయు నిచ్చటనే నిలిచి యుండుడు. నేను వెళ్ళి వారి విషయమును తెలిసికొని వచ్చెదను. అని చెప్పుచు మునీంద్రుని యాశ్రమమును రాముడు చేరరాగా ఆయన రాకను జూచి ఇంద్రుడా మౌనితో చాటుగా నిట్లనెను. నరేంద్రుడగు రాముడు నన్ను జూచుటకై ఇచ్చటికి వచ్చు చున్నాడు. నేనిప్పుడతనినిజూచుట తగదు. ఈయన చేయదగిన యెంతయో దుష్కరమైన కార్యమును పూర్తిచేయనిమ్ము. కృతార్థుడు, జయశీలుడునై పొగడబడిన తరువాత నేనితనిని సమీపించి మాటలాడెదనని పల్కి ఇంద్రుడు రథముతో ఆకాశమున వెడలిపోయెను. ఇట్లాయింద్రుడు వెళ్ళిన తరువాత రాజ శ్రేష్ఠుడగు రాముడు చంచలములై విశాలములగు కన్నులు గలదియగు సీతతోడను, తమ్ముడుతోడను పరివారముతో గూడినవాడును అగ్నికార్య నిరతుడునగు మునీంద్రుని యొద్దకు భక్తితో చేరనరిగెను. అరిగి ఆ మునీంద్రు పాదములకు శిరస్సు సోకునట్లు నమస్కరింపగా, ఆ మౌని వారల నుచితాసనముల నుండ బంచెను. అంతట సీతానాథుడు ఇచ్చటికింద్రుడు వచ్చుటకు గారణమేమనగా మునీశ్వరుడు ఇంద్రునిరాకకు కారణమైన విషయమునంతయు నిట్లు తెల్పెను.

## శరభంగుడు శ్రీరామునితో నింద్రుని రాకకు కారణము చెప్పుట

ఓ దశరథనందనా! నేను క్షుద్రులుచేరరాని ఆ బ్రహ్మలోకమును తపస్సుచే సంపాదించితిని. నన్ను తీసుకొని పోవుటకై వాసవుడిచ్చటికి వచ్చినాడు. నాకు మిక్కిలి ప్రియకరుడవగు నతిథివి నీవు దగ్గరకు వచ్చుటను మనస్సునందు తెలిసికొని నిన్ను దర్శింపగా నేను బ్రహ్మలోకమునకు వెళ్ళుటకు మనసొప్పక వెళ్ళక నిలిచితిని. నీ దర్శనము కలిగినది. ఇక దేవతలచేత సేవింపబడు స్వర్గపదవిని చేరుటకై వెళ్లువాడను. నాకు నేను సంపాదించిన అక్షయమైన శుభలోకములు గలవు, లోకవంద్యుడవైన ఓ రామా! స్వర్గలోక భవమును, బ్రహ్మలోకభవమును నైన నా పుణ్యము నెల్లను మాననీయుడవగు నీకొసంగెదను తీసికొనుమనగా సర్వశాస్త్రవేత్తయైన రామచంద్రుడిట్లనెను. నేను నీ యొక్క పుణ్యకోట్లనెల్లను తీసికొనెదను కాని మేము నివసించుటకు దగిన వాసయోగ్యమైన చోటు ఈ వనమునందెచ్చట నున్నదో చెప్పుమనగా ఆ ప్రాజ్ఞుడిట్లనెను. ఈ వనమునందు సుతీక్ష్ణుడను పేరుగల మహాత్ముడుగలడు. అతడు మీకు తెలియజేయును. అతనిని జూచుటకు వెళ్ళుడు. అతడు మీకు శ్రేయస్సును గలుగ జేయును. ఇక్కడనుండి పాఱుచున్న ఆ గంగానది కెదురేగుడు. అచ్చటచ్చట మీకు పూలతెప్పలు గనబడును. అదియే మీరువెళ్లదగిన మార్గము. ఒక్క నిమిషము నిలిచియుండుడు. ఈ శరీరమును ఫణీంద్రుడు కుబుసమును విడుచునట్లు విడచిపెట్టెదను. దానిని నీవు చూచి తరలి వెళ్ళుము అని ప్రార్థించి మంత్రపూతమైన అగ్నిని నేతిధారలతో వేగముగా ప్రజ్వలింపజేసి ఆయగ్నియందు మాంసము, రక్తము, ఎముకలు మున్నగువానితో గూడ భస్మమై అగ్నిసమానమైన కుమారరూపమును దాల్చి తరువాత ఆ అగ్నినుండి బయటకు వచ్చి ఆ మహర్షి దేవతల లోకమును దాటి వేగముగా వెళ్ళి బ్రహ్మలోకమునందు సహచరులతో నున్న బ్రహ్మను చూచెను. అతడు మౌనికి ప్రేమతో స్వాగతము పల్కెను. ఆ మునిశక్తికి సీతారామలక్ష్మణులు విస్మయము నొందిన మనస్సు గలవారై కీర్తించిరి.

# ఆఱవ సర్గము

## మునీంద్రులు శ్రీరామునితో తమకష్టములు దెల్పి శరణువేడుట

అట్లు ముని దివంబునకేగగా మానవాతీతశక్తి గలిగిన రామచంద్రుని వైఖానసులును, వాలఖిల్యులును, తమ శరీరము మీదనే తలనువాల్చి నిద్రించువారును, శయనింపని వారును, నీరు, గాలి, ఆకులు వీనిలో నేదో యొక్కటి మాత్రమే ఆహారముగా గొనువారును, ఆకాశమునందే నివశించు వారును, భూమిపై శయనించువారును, రాళ్ళతో గొట్టుకోనువారును, అగ్నితేజస్కులును, కంఠమువరకు నీటిలో నెప్పుడు మునిగియుండువారును, యోగము నాచరించువారును, వ్రతములననుసరించువారును, నీటితో దేహమును కడుగుకొనువారును, ఎల్లప్పుడు తడిసిన వస్త్రములను ధరించు వారును, సూర్యచంద్ర కిరణములను మాత్రమే పానముచేయువారును, జితేంద్రియులును, దంతములనే రోళ్లుగా నుపయోగించువారలను నయిన మౌనీశ్వరులు, ధర్మము నెఱిగినవారు, చలింపని చిత్తము గలవారు, ధర్మ రక్షకులలో నగ్రేసరుడును, పరమధర్మజ్ఞుడును అగు శ్రీరాముని దగ్గరకు వచ్చి రఘురామా! మానవశ్రేష్ఠుడా! దేవతలలో ఇంద్రుని వలె శ్రీరఘువంశ రాజ సమూహములలో శ్రేష్ఠుడవు ఈ భువికి నీవే నాథుడవు. నీ యొక్క గొప్పదైన యశస్సును, పరాక్రమమును భూమియందు పొగడబడినవి. నీ యొక్క పితృభక్తియు, సత్యమునందనురక్తియు, ధర్మనిష్ఠయును, నెల్లప్పుడు ప్రకాశించును. ధర్మవత్సలుని, మహాత్ముని ధర్మమును తెలిసిన వానిని నిన్ను శరణుజొచ్చితిమి. ఓ జానకీ ప్రాణేశ్వరా! వినుము. ఒక్క విషయమును నిన్ను కోరుచున్నాము ప్రభూ! మేమొక మనవి చేయదలంచితిమి. ఇందులకు క్షమింపుము. ఏరాజు ఆఱవపాలు కరము (పన్ను) పుచ్చుకొని పుత్రులవలె నా మనుష్యులను కాపాడడో వాడు మహత్తరమైన పాపమును బొందును. ఓ రామా! కావున రాజునకు

భూజనుల రక్షణమే కార్యము. తన యొక్క కార్యముల వలెను, తన ప్రాణముల కంటెను ఇష్టులైన పుత్రులవలెను జనులను కాపాడిన రాజు చాలాకాలము నిలుచు కీర్తిని పొంది బ్రహ్మచే పూజింపబడును. ఫలములను, దుంపలను దినుచు గొప్ప తపస్సు లొనరించు నా మహర్షులు తమ తపస్సునందలి నాల్గవ భాగమును ప్రజలను రక్షించుటకై రాజునకిచ్చెదరుగదా! దీనులను ఆర్తులను రక్షించువాడా! ఉన్న నిజమును వినుము. బ్రహ్మ సమానులైన ఈ వానప్రస్థుల సమూహము గొప్ప మహిమ గలవారై యొప్పియున్నను, నీవు నాథుడుగా గలిగియున్నను, రామా! దుష్టులైన రాక్షసుల సమూహము తపింప జేయుచుండ మిక్కిలి బాధల నొందుచున్నది. ప్రేమతో నీవు మాకిప్పుడభయ దానము నిమ్ము. రామా! అవిగో చూడుము వనమునందు రాక్షస కోటులచే నాశము పొందిన ముని సంఘముల యొక్క శరీరముల యముకలు అంతటను చూడనగును. మందాకిని తీరమందును, పంపానదీ యొద్దను చిత్రకూట పర్వతమున నివసించు ఋషుల నెందరనో రాక్షస సమూహము బాధించెను. చంపెను. రామా! అమోఘమైన బలము గలవాడా, మునులకు జరుగుచున్న యపకారము లను భరింపలేక పోవుటచే నిన్ను శరణు జొచ్చితిమి. నీవే శరణ్యుడవు. దయతో రాక్షసులచే భూతలమున మునులనందరను నశింప నీయకుము. మాకు నీవు తప్ప వేఱొక గతి లేదు. జానకీనాథా! మా వెతలను తొలంగజేయవే.

**శ్రీరాముడు మునుల కభయంబిచ్చుట**

అనగానే రఘునాథుడిట్లనెను. మహాత్ములైన మీరలిట్లు నన్ను అనుట ధర్మమా? ఓ మౌనులారా! మీయొక్క ఆజ్ఞ ప్రకారము నడచెదము. నేనీ యరణ్యమునకు పనిగట్టుకొని పాపులను సంహరించి మీకు శుభమును గల్గచేయుటయే నా యొక్క సొంతపనిగా నా తండ్రి యొక్క ఆజ్ఞను సాకుగా గొనివచ్చితిని. కావున ఈ వనవాసము మాకు గొప్ప ఫలము నొసంగును. ఇక మునిజన శత్రువులైన రాక్షసుల యొక్క పొగరును యుద్ధము లందణంచెదను. తమ్మునితో గూడిన నా యొక్క భుజబలమును చూడుడు.

# యేడవ సర్గము

**ఈ** ప్రకారముగా మునుల కభయమిచ్చి సత్య నిరతుడగు రాముడు సీతాలక్ష్మణసమేతుడై బ్రాహ్మణులందఱు తన్ననుసరించుచుండ సుతీక్ష్ణాశ్రమము దారి బట్టి వెడలెను. కొంత దూరము వెళ్ళి అధికమైన నీరుగల నదిని దాటి నల్లని కాటుక వలెను, గొప్ప మేఘము వలెను ఉన్న పర్వతమును గాంచి ఆ యడవిలోని యెల్లప్పుడు నక్షయములగు ఫల, ఆకులు, పుష్పములు ఆశ్చర్యము గలుగజేయుచుండగా ఆ దేవేంద్ర వంధ్యుడగు రామచంద్రుడు నారచీరలే మాల్యములుగా గల శుభప్రదమైన ఆశ్రమమును జూచెను.

## శ్రీరాముడు సుతీక్ష్ణాశ్రమము చేరుట

దగ్గరకు వెళ్ళి యచ్చట ధూళితో నిండియున్న జడలు గలవాడును, పాపములు లేనివాడును, సుఖాసనమున నాసీనుడైనవాడును నయిన తపస్విని జూచి సీతానాథుడు ప్రీతితో నిట్లు పల్కెను. అనఘుడవైన ఓ తపస్వివరా! నేను రాముడనువాడను. నీ యొక్క దర్శనము చేసికొనవలయునను కోరికతో వచ్చితిని. ఆదరముతో నన్ను జూడుము అని వేడగా ఆ మునివల్లభుడు రఘురాముని గ్రుచ్చి కవుగలించి సీతానాథా! మీకు సంతసము–క్షేమము కదా యని మరియు నిట్లనెను. ఓ మహాతేజస్వీ! నీవు వచ్చిన కారణము చేత ఈ ఆశ్రమము ఎక్కువగా పవిత్రమై, అర్హుడైన నాథుని పొందినదై ఇప్పుడెంతో ప్రకాశించుచున్నది. ఓ వీరుడా! శరీరమును విడచి దేవలోకమునకు వెళ్ళుట కిష్టపడక నీవు వచ్చుట యెఱిగి నీ కొఱకై యిందే వేచియున్నాడనుసుమా. తండ్రీ! నీ విటకు వచ్చితివి. గొప్పశౌర్యము గల ఓ రామా! నీవు రాజ్యమును

వీడుటయు, ముని వేషమును ధరించుటయును, చిత్రకూటమునందు భార్యయు, తమ్ముడను నీవు నుండుటయును వింటిని. కాకుత్థ్స వంశవర్యా ! సురరాజు నన్ను రమ్మను పిలుచుటకు వచ్చెను. చేసిన పుణ్యములచే నేను దేవలోకములను గెల్చినాడనట. కరుణగలవాడా! నీవు నా యనుగ్రహముచే భార్యతోను, అనుగుదమ్మునితోనూ వానియందు విహరింపుము అని పల్కగా బ్రహ్మదేవునితో కశ్యమహర్షి వలె రామచంద్రుడా మహర్షితో నిట్లనెను. నేను స్వయముగా నీ సుకృత కోట్లను తీసికొనెదను. మేమీ వనమందుండుటకు వాసయోగ్యమైన చోటేది? నీ యొక్క మంచి తనమును బుద్ధి శక్తిని గౌతమవంశ్యుడు ప్రసిద్ధుడునైన శరభంగుడు వినిపించెను. అనగా ఆ ముని సంతోషమున మునిగి తెలుచున్నవాడై మధురమైన మాటలతో రామునితో నిట్లనెను. రామా! ఈ ఆశ్రమభూమియే అందమైనది. గుణవంతమైనది. ఋషి సమూహమిందు తపము చేయు చుండును. ఎల్లప్పుడు ఫలములు మొదలైనవి యెక్కువగా నుండును. సూర్యతేజా! దేనివలనను భయములేని ఈ యాశ్రమ భూమియందు మృగముల సమూహము ఇష్టము వచ్చినట్లు సంచరించును. అవి సంచరించుట వలన తపోవిఘ్నము కలుగుచుండును గాని మరేవిధమయిన భయమును లేదు. ఇచ్చట నిలిచి యుండుమనగా రాముడు నిర్మలమైన తేజముగల మునీంద్రా! ఈ మృగ సమూహములను క్రూరపక్షి సంఘమును చంపుట చేత నీకు మనోవ్యథ గలుగును. కాన చాలా రోజులిచ్చట నిలువరాదు. అని చెప్పి సాయంత్రము సంధ్య మొదలైన విధులను దీర్చి మునియిచ్చిన యాహారమును భుజించి ఆ రాత్రిని లక్ష్మణ సీతాసహితుడై గడపెను.



# ఎనిమిదవ సర్గము

**తె**ల్లవారగనే లక్ష్మణుడును, సీతయు, తానును కమ్మని కలువపువ్వుల వాసనలు గల్గు జలంబులందు స్నానము చేసి అగ్ని, దైవ పూజలను పూర్తిచేసి తూర్పు కొండపైకి వచ్చు ఛాయావిభునకు మ్రొక్కి చేతులు జోడించి మునికిట్లు చెప్పెను. మునీంద్రా! నీచే సత్కారముల నందుటచే రాత్రి సుఖముగా గడచినది. ఇక మాకు సెలవిచ్చెదరా? దండకావనములో నున్న మునిశ్రేష్ఠులు నన్ను తమ యాశ్రమములకు రమ్మని తొందరపెట్టి ప్రార్థించుచున్నారు. ఈ మునీశ్వరులతో నేను వెళ్ళదలంచితిని. తపస్సు చేత పరిశుద్ధమైన హృదయము గలవాడా! మమ్మనుగ్రహింపుము. తగని మార్గములతో నడుమంత్రపు సంపద నొందిన దుష్కుల సంజాతునివలె, సూర్యుడు చేతులలో కొరవులు పట్టుకొని వచ్చి దహింపకముందే వెళ్ళుదుమా యని పాదములంటి నమస్కరింపగా ప్రియముతో కౌగిలించుకొని మౌని నాయనా! వెళ్లిరండు. జానకి ఛాయవలె వెంటరాగా, స్వచ్ఛమైన పుణ్యము గల ఈ ఋషులు సంతోషముతో వెంట నడువగా శుభకరమైన మార్గమున వెళ్ళుము. విచ్చియున్న తామరపూవులతో నిండియున్న సరస్సులును, కొండలును, ఎల్లప్పుడును పూయుచెట్లును, నెమిళ్ల కేకలను, సెలయేళ్లను మీకెక్కువగా సంతోషమును కలుగజేయును. లక్ష్మణా వెళ్లిరమ్ము. ఓ అనఘా! మీరు తరువాత నా ఆశ్రమమునకు మరల రండయ్యా! యని సెలవీయగా, భువనములను మోహింపజేయు సుందరియైన జానకి, విండ్లను, వాడియైన ఖడ్గములను, అమ్ములపొదులను శూరగ్రేసరులైన ఆ యన్నదమ్ముల కందీయగా వానిని గైకొని అల్లెత్రాటికెక్కించిన విండ్లు దాల్చిన వారై.

# తొమ్మిదవ సర్గము

## సీతాదేవి శ్రీరామునకు హితోపదేశము చేయుట

అందరు నీ ప్రకారము వెళ్లుచుండగా సీతా దేవి రఘురాముని ముఖమును జూచి ప్రేమతో నిండిన హృదయము గలదై మృదువు, మధురము నయిన మెల్లని మాటలతో నిట్లనెను. ఓ శూరవరేణ్యా! నీవనుష్ఠించెడు ఈ నిష్ఠప్రకారము కామము వలన బుట్టు వ్యసనములను తొలగించుకొని సూక్ష్మ మార్గమున పొందవచ్చును గదా. కామజవ్యసనములు మూడు కలవు. అందు మొదటిది అసత్యమాడుట, రెండవది పరభార్యాభి గమనము. మూడవది పగ లేకయే హింస కలుగ జేయుట యనునవి. నీవింతవఱకు నసత్యమాడినది లేదు. ఇంక నెప్పుడు నాడబోవు. ఓ ధర్మనిరతుడా! అసత్యమును తలుచుట కూడ లేదు పలుకటెక్కడిది. ఇక పరాయి స్త్రీల యందు వలపు ఇప్పుడు లేదు. ఇకముందు కలుగబోదు. ఓ రాజా! నీ భార్య యానందము నొందింప నానందించెదవు. ఓ లక్ష్మణాగ్రజా! ఎల్లప్పుడును సత్యధర్మనిరతి గల నిశ్చలమైన బుద్ధిగలవాడవు. తండ్రి మాట తప్పని వాడవు. కుంటువడని సత్యము, ధర్మము అంతయును నీయందే స్థిరముగా నిలిచియున్నది. నాథా ఇవి యన్నియు జితేంద్రియులైనవారికి మాత్రమే సమకూరును. నీ యొక్క జితేంద్రియత్వమును నేనెరుగుదును సుమా. మూడవదైన మూఢులు విరోధము లేకుండగనే ఇతరులను హింస చేయు క్రూరకర్మమును రామభద్రా! ఈ మౌనుల కారణముగా నీవు పూనుకొంటివి. దండకారణ్యమునందుండు రాక్షసులను చంపెదనని నీవు ప్రతిజ్ఞ చేసితివి. ఇది కారణముగా నీవింద వచ్చితివి. నీవును, తమ్ముడును బాణకోదండములను దాల్చి అందు తరలుచుండగా నీ యొక్క శుభమును, హితమును కోరుదానను గనుక నా యొక్క మనస్సు తల్లడిల్లుచున్నది. నాథా నా విన్నపమును కరుణతో నాలింపుము. మీ యొక్క పోకడ నాకు హితవుగా లేదు. ఎందుచేత నందురేమో, నేను కారణములు చెప్పెదను. వింటిని బాణములను, ఖడ్గములను హస్తము

లందు ధరించి మీరలు వెళ్లుచు అడవులందుండు వారలను జూచి ఏదో యొక బాణమును విడువగలరు. నాథా! అదే పగకు కారణమగును. అగ్నికి సమిధలవలె రాజ సమూహమునకు విడువని శస్త్రసంబంధమే బల తేజములను వృద్ధి చేయును.

## సీత శ్రీరామునకు శస్త్ర సాంగత్యము దోషమని తెల్పుట

ఓ ప్రాణేశ్వరా! మునుపొక అడవియందు సత్యాత్ముడు ధర్మరతుడునైన ఋషి గలడు. అడవులలో నుండు మృగములు పక్షుల యందు అతిదయయు, ఎక్కువ ప్రేమయు గలవాడు. అతని తపస్సున కంతరాయమును చేయదలపెట్టి కుటిలమైన బుద్ధితో ఇంద్రుడొక భటుని వేషము ధరించి యొకనాడు వచ్చి ప్రకాశమానమైన ఖడ్గమును ఆ మునియొద్ద ఇల్లడపెట్టి తాను దివికేగెను. తన యొద్ద న్యాసముగా నుంచిన ఆ ఖడ్గమును జాగ్రత్తగా కాపాడువాడై – ఆ ముని దానిని చేత పట్టుకొనియే వనములందు తిరుగుచుండెను. ఆ పిచ్చి తాపసి ఫలములను, దుంపలను తెచ్చుటకు వెళ్లునప్పుడు కూడ దానిని విడిచి వెళ్లకుండెను. ప్రతిదినమీవిధముగా కత్తిని పట్టుకొని పోవు వాడుకచే దానియందతనికి రక్తి జనించినది. ఆ మీద దానివలననే రౌద్రము జనించెను. స్వాభావికమగు బుద్ధి చెడి క్రూరకార్యపరుడై మదించి ధర్మమైన పనులను విడచి యాతడు దుర్గతికి వెళ్ళెను. శస్త్ర సాంగత్యము వలన నెంత యపకారమో చూచితివా? శస్త్ర సంయోగ ఫలమును దెలియచేసెడు పూర్వము జరిగిన కథ యిది. మంచి బుద్ధితో జూచినచో శస్త్ర సంయోగమును అగ్ని సంయోగము వంటిదే యందురు. ఓ పద్మాక్షా! నీయందలి చనువు చేతను, స్నేహ భావము చేతను నీవు నన్నెల్లప్పుడు చూచుచున్న గౌరవ దృష్టి చేతను ఇది కాని పని యని నీకు జ్ఞాపకము చేసితిని సుమా. మనసునందు నీవెఋగని మంచి మార్గమును నేర్పుట గాదు సుమా. ఓ సజ్జన శ్రేష్ఠుడా! ఇచ్చట నీవు పూనిన పూనిక అది యెన్ని విధముల చూచినను నాకిష్టమగుట లేదు. దర్పముతో ధనస్సు ధరించి పోవుటయు, పగ యేమియు లేకుండగనే దండకాటవి యందలి

రాక్షసుల నెదుర్కొని చంపుట ఏవిధముగా ఎంత ఆలోచించినను కానిపనియే. జనులచేత పొగడబడిన శీలము గలవాడా! తప్పులేని వారిని చంపబూనుట నా మనసుకించుకయైనను సంతసము కలుగ జేయదు సుమా. వీరులు, అడవులందు సంచరించువారు నగు రాజులకు ఆర్తితో నున్న వారిని రక్షించుటకు వింటిని ధరించుట తగును గాని ఊరకే దండించుట తగునా? ఓ ప్రాణేశా! ఎక్కడి శస్త్రము? ఎక్కడి అరణ్యము? క్షాత్రమెక్కడ? ఏటి తపము? ఈ కార్యము పరస్పరము మిక్కిలి విరుద్ధముగానున్నది. చూడుము. ఏదేశమందున్న ధర్మము నాదేశమునందాచరించుట ధర్మము గాదా! వనమునందు మునివృత్తితో సంచరించు నీకు ముని మార్గమున నడుచుటర్హము కాదా! శస్త్రములను ధరించుటచే బుద్ధి కలుషితమగును. కనుక అడవులలో శస్త్రములను ధరించు టను వీడుము. తిరిగి నీవయోధ్యలో సంచరించు సమయమున క్షాత్ర ధర్మమును పూనుట కార్యమగును. సంపదను, రాజ్యమును విడిచి పెట్టి అడవులలో సంచరించు నీవిప్పుడు మునివలె తపోనియతితో తిరిగినచో, దేవా! అత్తకును మామగారికిని అది సంతసమును కలుగజేయును. ధర్మము చేతనే సిరి కలుగును. ధర్మము చేతనే సుఖము కల్గును. ధర్మము చేతనే సత్కర్మలు ఫలించును. శుభంకరా! ధర్మసారమే కదా ప్రపంచము. సుఖము చేత సుఖము లభింపదు. కఠినములైన వ్రతములను, నియమపద్ధతులను పూనుకొని యాత్మను జయించినచో అఖిలోత్తమమైన ధర్మము సిద్ధించును. నాథా! మన్నింప దగిన సౌమ్యతగల వాడవును, నిర్మలమైన బుద్ధి కలవాడవును, నియమ వంతుడవును. అయిన నీకు ముల్లోకములందు తెలియనిదున్నదా? ప్రాణేశా! నీకు నీతులు చెప్పుటకు నేనెంత దానను. అడవులలో దిరుగు సమయమున హింస చేయకుండ సంచరింప రాదా? స్త్రీ సహజమైన చపలత్వము చేత నాకు దోచినది పల్కితిని. ఓ సజ్జన వందితా! భూమియందు నీకు ధర్మములుపదేశింప గల నేర్పరి యెవ్వడు? ఓ రాజశ్రేష్ఠుడా! తమ్ముడు నీవును ఆలోచించి మీ కిష్టమగు ప్రకారముగా సంచరింపుడు.

# పదవ సర్గము

## శ్రీరాముడు సీతకు ఆర్తరక్షణము పరమధర్మమని చెప్పుట

సాటిలేని పతిభక్తితో సీత యాడిన మాటలను విని ధర్మము స్థిరముగా నున్న బుద్ధి గల రాముడిట్లనెను. దేవీ! కుతూహలముతో నీ యొక్క సత్కులమున కుచితమైన పద్ధతితో అనురాగమునకు తగినట్లుగా చెప్పితివి. ధర్మ బుద్ధితో ఈ విషయమునందు నామనస్సునకు దోచినది చెప్పెదను. వినుము. నీకంతయు స్పష్టముగా తెలియును. ఓ దేవీ! క్షత్రియులకు దీనులను ఆర్తులను రక్షించుటకై విల్లు పట్టుట ధర్మమని నీవే చెప్పితివి కదా. దండకారణ్యవాసులైన మౌనులు, మహానుభావులు భయముతో గొప్పనైన ఆర్తితో వారే కదా వచ్చి నీవే దిక్కని నా మరుగు జొచ్చిరి. వారిని పోపొండనుట ఇష్టమగునా? అడవులలో కాయలతోనూ, కూరలతోను కడుపులను నింపుకొని జీవయాత్రను ధర్మపద్ధతిగా నడపుచు ఎల్లపుడును నియమపరులైన మౌనులను విడువని విరోధమును పూని కడు క్రూరవృత్తితో చంపుచున్న ఆ దుష్టులైన రాక్షసులను చంపబూనుట యధర్మమా? చెప్పుము. దండకారణ్యమున నివసించు ముని సంఘములు మాయొద్దకు వచ్చి తమ దుఃఖములను కొండలుగా జెప్పికొని రక్షింపుమని వేడుకొనగా, ఓ పూబోణీ! నేను వారి చరణములంటి శుశ్రూషలు చేసి మౌనులారా! మీరే నా యొద్దకు వచ్చుట చేత నాకెంతయో సిగ్గుగా నున్నది. దయతో మీరలు కోరునదేదియో. నేనేమి చేయవలెనో చెప్పుడని యంటిని. ఓ మానినీ! వారందఱును ఒక్క మాటగా దండకలో జరించు ఆ నరభక్షకులు ఎల్లప్పుడును శత్రువుల వలె హెూమవేళలందు విడివక బాధపెట్టుచు చంపు

చున్నారు. మాకేది దిక్కు? అని మేము భయము నొందిన వారమై యుండగా మేము చేసిన పుణ్యము వలన ఓ రాజోత్తమా నీవు వచ్చితివి. ఇక నీవే మాకు దిక్కు. రాజవరా! మా తపస్సుల చేత ఆ రాక్షసాధములు చచ్చి పడునట్లు శపింప శక్తి గల వారమై యుండియు, పూర్వార్జితమైన మా తపస్సులను వ్యయింప నిష్టము లేని వారమై శాంతి వహించి బాధలను సహించి వారి చేతిలో చచ్చుచున్నారము. తపస్సు చేయుట చాలా కష్టము. దానికెప్పుడును విఘ్నములు కలిగించుండును. కావున రాక్షసులు మమ్ము మ్రింగినను వారిని మరల మేము దిట్ట నిష్టపడము. మా యొక్క స్థితినాలోచింపుము. దీనికి ప్రతీకారము చేయుము. మా తపస్సు పూర్తి యగునట్లు నీవు నీ తమ్ముడు నాలోచింపుడు. నిర్మల కీర్తిగల రామా! నీవే మాకిట దిక్కు సుమా. అని చెప్పగా విని ఓ విరిబోణీ! సర్వము తీర్చెదనని ప్రతిన చేసితిని సుమీ. నాకు సత్యము మిక్కిలి యిష్టమగుట చేత నా శరీరమునందు ప్రాణములుండువరకు ఆడి తప్పజాలను. నాన్నాశ్రయించి చెడ్డ మార్గమున నెన్నడు నడవని దీనులగు ఋషులను రాక్షసులు చంపిరి. ఓ బుద్ధిమంతురాలా! నీవే ఇంతకు విరోధ హేతువు నాలోచింపుము. నేను ప్రాణములైనను విడిచెదను. తమ్ముడినైన విడిచెదను కాని ప్రతిజ్ఞను విడిచెదనా? ఓ ముద్దరాలా! అందును బ్రాహ్మణులతో పల్కిన మాట తప్పుదునా? ఓ లలనా! నేను ముని జనుల కార్యమును వారడుగ కున్నను నెరవేర్ప వలయును. జానకీ! అట్టియెడ ప్రతిన చేసి విడువ దగునా? ఓ కాంతారత్నమా! స్నేహముచేతను, ప్రేమచేతను, మైత్రిచేతను బోధచేసితివి. నీ బుద్ధికి మెచ్చితిని. స్నేహము లేని వారలకితరులు బుద్ధులు చెప్పదురా సుదతీ! ఓ పంకజపాశీ! పవిత్రమైన నీ వంశమునకును, నీ నడవడికిని అర్హమగునట్లు చెప్పితిని. ఓ సీతా! నాకెప్పుడును సహధర్మచారిణివి. ప్రాణములకంటె నధికురాలవు అని పల్కి లక్ష్మణుడును జానకియు అనుసరింపగా ధనుర్ధారియై..

# పదునొకండవ సర్గము

రాముడు ముందుగా వెళ్ళుచుండెను. తను మధ్యయైన సీత మధ్యవర్తినియై వెళ్ళుచుండెను. గొప్ప విల్లును చేబూని ప్రేమతో లక్ష్మణుడు వెన్నంటి వెళ్ళు చుండెను. నీళ్ళతో నిండినవై పద్మముల, కాలువల సుగంధములతో ప్రకాశించెడు కాసారములను నదీ తటములందలి యిసుక తిన్నెలపై సంచరించుచున్న చక్రవాకపక్షుల సమూహములను, పర్వతముల చరియల నుండి వేగముగా ప్రవహించుచున్న సెలయెళ్ల ప్రవాహములను, పూవులతో మనోహరము లైన పొదరిండ్ల పై వ్రాలిన తుమ్మెదల గుంపులను, భయంకరమైన అడవి పందులను, పెద్ద సర్పములను, అడవి దున్నలను, మదించిన యేన్గులను, సింహములకు నివాసములైన గుహలను, చూచుచు, అట్లు వెళ్ళి వెళ్ళి ఆకాశమున సూర్యుడు వ్రాలి పోవుచుండగా (సాయంకాలమున) ఒక యోజనము చదరము గలిగి ఇంపైన తటాకమును జూచెను. అది శుభకరమై తుమ్మెదలచే నల్లనై తామరాకులతోను, పద్మముల చేతను పరివ్యాప్తమై ఆడపక్షుల కలనాదములతో నిండినదై మదించిన యేన్గుల చేత బాధింపబడిన తటముల గలదై యొప్పు చుండెను. దానిని జూచి, మనుష్య హీనమై యుండియు, గొప్ప సంగీత ధ్వనులతో హృదయమున కానందము గలిగించుచుండగా తానును లక్ష్మణుడును ఆలకించి

## మాండకర్ణి వృత్తాంతము ధర్మభృతుడు శ్రీరామునకు దెల్పుట

తమతో గూడ వచ్చుచున్న ధర్మభృతుండను మునిశ్రేష్ఠుని జూచి, అనఘా ఇది యేమి? వింతగా నున్నది. దీని చరిత్రము తెలిసి కొనుటకై మా మనస్సు కుతూహల పడుచున్నది. చెప్పుటకు తగినదేని, రహస్యము కాదేని ఈ

చిత్రమేమియో చెప్పుమనగా జానకీనాథుని సంభాషణమును విని ఆ సరస్సు యొక్క వృత్తాంతమును పూర్తిగా ఆ తాపసి చెప్పదొడగెను. ధర్మమూర్తి! వినవయ్యా! మాండకర్ణియనెడు గొప్ప తపస్వి తనతపోబలముచే మిగుల సుందర మైనవియు, సర్వకాలములందు నెండిపోనిదియునగు ఈ సరస్సును సృజించెను. ఇది పంచాప్సరమన బడును. దీని జలములందాతడు పంచేంద్రియములను జయించిన వాడై స్థిర చిత్తముతో అహెూ! పది వేలయేండ్లు తపస్సు చేసెను. నీళ్లను గాలిని ఆహారముగా గొని కష్టమైన తపస్సును చేయుచున్న ఆ ధీరుని చూచి అగ్ని మొదలుగాగల దేవతలందఱును భయపడినవారై తామందఱు నొకచోట చేరి ఇతడే పదవిగోరునో యని చింతించి దీనికి విఘ్నముచేయుట కేయుపాయమని యాలోచించి వంచనతో మెరుగు దీవల ప్రకాశముగల అచ్చరల సమూహమును వేగముగా బంపగా కన్నులు మిఱుమిట్లు గొల్పు తేజస్సుతో నేవురు అచ్చరలాతపస్వి ధైర్యమును కొల్లగొట్టిరి. పరమాత్మ సాక్షాత్కారము బడిసినట్టి ఆ తాపసశ్రేష్ఠుడు దేవతల కార్యము నెఱవేరునట్లు అల్లెత్రాటిని తెగలాగిన మన్మథుని బాణ వర్షమునకు ఆ యప్సరసల చూపులకు మిక్కిలి వణకెను. అట్లు వచ్చిన వారలను గారవముతో భార్యలుగా జేసుకొని యీ సరస్సు నందు తన యోగ బలముచే నొక గృహమును గల్పించి యందాస్త్రీలతో రమించుచున్నాడు. తపశ్శక్తితో పొందిన యౌవనముతో ముని యాస్త్రీలతో గలిసి క్రీడించుచు తృప్తిగా నుండును. మహాత్మా! ఆ పాటలగంధులయొక్క యింపయిన నాట్యములయొక్కయు, కదలుచున్న భూషణములయొక్కయు పాటలయొక్కయు నాదములే అవి. ఓ సూర్యసమతేజా! ఈ విధముగా ఆ ధ్వనులు వినబడుచుండును. అని చెప్పగా పద్మాక్షుడగు రాముడు ఆశ్చర్యము జెందుచూ, తమ్ముడును, సీతయును వెంటరాగా నారచీరలతో దర్భలతో గూడినదియు, ఎక్కువ బ్రాహ్మణులతో నిండినదియు నగు ఆశ్రమమును జూచి ఆ ఋషి సమూహముచే నర్చింప బడిన వాడై అట్లే మరల వెళ్లిన చోటులకే

వెళ్లుచు ధనుర్ధారియై దినములు గడుపుచుండెను. ఒక యాశ్రమమునందు పదమూడు మాసములు, మఱియొక యాశ్రమమున పన్నెండు, వేఱొకచోట నాలుగు ఇంకొక్కయెడ నైదు, మరొకచోట నారును, ఒక్కచో నారునొక్కటియును ఒకటింబాతిక నెల యొక మునివాటికయందు, ముప్పాతిక మాసమొక్కట, మూడు, యెనిమిది నెలలు ఒక్కొక్క చోట నిట్లు సుఖముగా రాముడాయా యాశ్రమములందు గడపెను. ఆ విధముగా నాధనుర్ధరుడు పదియేండ్లు గడపెను. తిరిగి యా సుతీక్ష్ణుని యాశ్రమమునకు వచ్చి ఆ ముని ప్రార్థింపగా అచ్చట కొంతకాలము గడపెను. అంతనొకనాడు రఘురాముడా మౌనితో నిట్లనెను.

## శ్రీరాముడగస్త్యాశ్రమమునకు బోవ సుతీక్ష్ణునిచే ననుజ్ఞ గొనుట

ఈ వనమందగస్త్య మునీంద్రుని యాశ్రమమున్నదట గదా. నేను నిత్యమును వినుచున్నాడను. మునీంద్రా ! ఆచోటును నేనెఱుగను. సద్భావుడైన ఆ మునీశ్వరుని పాదములను సీతాలక్ష్మణ సహితుడనై సేవింప కోరిక కలిగినది. ఆ యాశ్రమ మార్గమును తెలియజెప్పుము. అనగా సుతీక్ష్ణుడిట్లనెను. ఓ భూవరా! ఆ విషయమును నేనే చెప్ప దలంచు నంతలో నీవే ప్రశ్నించితివి. సంతోషమైనది. అచ్చటికి వెళ్లుము. ఇచ్చటినుండి దక్షిణముగా నాల్గు యోజనముల దూరము వెళ్ళినచో అచ్చట నొక రావితోపు గలదు. అందు తుమ్మెదలతో సుందరమైన తామరలతో గూడిన విశుద్ధ జలములు గల సరోవరములును, పండ్లతో నిండిన కొమ్మలుగల పెద్ద వృక్షములును, జలపక్షుల సమూహములును గలవు. అదియే సుమా రఘురామా! అగస్త్యుని సహోదరుని ఆశ్రమము. నీవీ రాత్రి యచ్చట నిలిచి తెల్లవారగనే యట నుండి బయలుదేరి ఆ వనము ప్రక్కనుండి దక్షిణముగా నొక్క యామడ దూరము వెళ్ళగా అక్కడ కన్నుల పండవౌ నట్లగస్త్యుని యాశ్రమమును జూచెదవు. చాలా చెట్లచే నావరింపబడి యెంతయో పెద్దదియయి ఆ వనప్రదేశము ఒప్పుచుండెను. భూపుత్రి తోడను లక్ష్మణుని

తోడను నీ వచ్చుట సౌఖ్యముగా నివసింపదగును. నీ కాతని దర్శింప మనసు గలిగెనేని ఇప్పుడే మంచిది ప్రయాణ ప్రయత్నం చేయుమనగా రాజపుత్రుడైన రాముడా ముని యొద్ద సెలవు తీసికొని, ఆ ముని చెప్పిన మార్గము వెంట బయలుదేరెను. ముగ్వురు నా యడవి వెంట వెళ్లుచూ త్రోవల ప్రక్కల యందు పెను మేఘముల యాకృతితో నొప్పు పర్వతముల సమూహములను, పుష్పములతో నిండిన వనములను, అందమైన సెలయేళ్లను, ఆనందము గలిగించు కొలనులను జూచిరి. వానిని జూచి రామచంద్రుడు మనస్సు సంతోషముతో పొంగిపోవుచుండగా తన తమ్మునితో నిట్లనెను. తమ్ముడా! ఇది యగస్త్యుని తమ్ముని యాశ్రమము వలె దోచుచున్నది. ఇది యథార్థము. సుందరమై యానందకరమైన ఈ వనమునందు మౌని చెప్పిన చిహ్నములన్నియు ఒప్పియున్నవి. ఫలముల, పువ్వుల, మొగ్గల యొక్క భారముచే వంగినవై చెట్లు నేలకు తాకుచుండుట చూచితివా? పండిన పిప్పలి పండ్ల యొక్క వగరైన సుగంధమును వాయువు తీసుకొని వచ్చుచున్నది. అచ్చటచ్చట కొట్టిన కట్టెల ప్రోవులు పడియుండున్నవి చూచితివా? వైఢూర్యపు కాంతితో కోసి నేల బడవైచిన దర్భల ప్రోవులను చూడుము. నల్లని మేఘములను బోలి యగ్నుల నుండి వెడలి వచ్చుచున్న పొగల గుంపులను గంటివా? అదిగో ఇతర జనులు లేని నదుల రేవులయందు బ్రాహ్మణులు తాము తెచ్చిన పుష్పములతో పూజ చేయు చున్నారు. మనము విన్న అగస్త్యుని తమ్ముని యాశ్రమమిదియే. లోకములు మేలు పొందునట్లుగా రాక్షసులను చంపి యెవడు దక్షిణ దిశకు ప్రజలను చేర్చెనో ఆ యగస్త్యునికి ఇతను తమ్ముడు.

### శ్రీరాముడు లక్ష్మణునకు వాతాపీల్వలుల కథ చెప్పుట

తమ్ముడా! లక్ష్మణా! మున్నొకప్పుడు వాతాపి, ఇల్వలుడు అను అన్నదమ్ములు, బ్రాహ్మణ హంతలు నయిన రాక్షసులు శిష్టులయిన బ్రాహ్మణ వేషములతో ప్రకాశించుచు నిచ్చట ప్రవేశించిరి. ఈ దినము మాయింట శ్రార్ధము

బ్రాహ్మణోత్తములారా! రండు అని యెంతయో శ్రద్ధ నటించుచు, సంస్కృత భాషతో పిలుచుచు, సర్వము సిద్ధమైనదనుచు ఆహ్వానించి ఇల్వలుడు తన తమ్ముడగు వాతాపిని మేకగాచేసి చంపి దాని మాంసము నా బ్రాహ్మణులకు సాపడ బెట్టుచుండెను. భుజించి కూర్చుని కడుపులను తడువు కొనుచుండు ఆ బ్రాహ్మణులను జూచి, వాతాపి! రారమ్మని పిలుచుచుండెను. అట్లు పిలువగానే ఆ వాతాపి వారల యొక్క పొట్టలను బ్రద్దలు కొట్టుకొని తాను వెలుపలికి వచ్చుచుండెను. ఈ ప్రకారముగా తద్దినములని చెప్పి వేలకొలది ద్విజులు వారిచే మృతి జెందుచుండగా అగస్త్యుడు దేవతలచే ప్రార్థింపబడి తన మహిమచే వారిని సంహరించెను. ఒక నాడా రాక్షసులు కలశసంభవుని శ్రార్ధమునకు నిమంత్రణము చేయగా ఆ మునీంద్రుడట్లే కానిండని వెళ్ళి వారు పెట్టిన సర్వ పదార్థములను భుజించి సర్వము సంపన్నమని హస్తోదకమునీయగా పుచ్చుకొనెను. అంత నిల్వలుడు సంతోషముతో ఓ తమ్ముడా! రమ్మనగా మౌని రాక్షసాధమా! ఇంకను తమ్మునిపై భ్రాంతి యెందులకు? నా కడుపులో పడిన తరువాత తిరిగి వచ్చుట సాధ్యమా? నీ తమ్ముడు మేక రూపమున నా కడుపులో పడి జీర్ణమైపోయి యమపురంబును జేరెను. ఇది నీకు తెలియదా? అని చిఱునవ్వుతో చెప్పగా, వాడు సోదరుడు వధింపబడుటెరింగి హుంకరించుచు క్రోధాతిశయముతో ఆ మునిశ్రేష్ఠుని హింసింపబోగా ఆ ముని అగ్నిసమానమైన చూడ్కులతో ఆ రాక్షసుని భస్మమొనరించెను. లక్ష్మణా! ఇది ఆ ముని యొక్క తమ్ముని యాశ్రమము సుమా అని చెప్పుచుండగా ప్రొద్దుగుంకు సమయ మయ్యెను. స్నాన, సంధ్యలను పూర్తిచేసి వారా మునిని చూచి నమస్కరించి ఆ మౌని యిచ్చు ఫలములను, దుంపలను పుచ్చుచుకొని ఆ రాత్రి యచ్చట గడపిరి. సూర్యోదయము కాగానే రఘురాముడు మునితో నిట్లనెను. మహాత్మా! నీ దయ చేత మేమిచ్చట హాయిగా రాత్రిని గడపితిమి. మీ యన్న గారిని దర్శించుటకై వెళ్ళెదము. ఆజ్ఞాయిచ్చెదరా! అనగా మౌని యట్లేచేయుడని ఆజ్ఞనీయగా, వారలు

మునుపు విన్న మార్గము వెంట వెళ్ళుచు అందముగా నున్న ప్రబ్బలి గుంపులను, పూలగురివెందపొదలను, మారేడుచెట్ల గుంపులను, మద్దిచెట్లను, ఎత్తైన తాటిచెట్లను, నీవారములను, కానుగుచెట్లును, అందమైన తుమికి చెట్లను, తుమ్మెదలతో నిండిన ఇప్పచెట్లును, మొల్లతీగలను, మనోహరములైన పుష్పములతో నొప్పెడు వివిధములగు వృక్షములను, పున్నాగములను, తిమిశ వృక్షములను, పనసచెట్లను, వివిధములగు పక్షుల కలరవములతో గూడిన చెట్లను, ఏనుగుతొండములచే లాగబడుచున్న వానిని, క్రోతులచే గదలింప బడుచున్న వానిని కన్నుల పండుగగా చూచిరి. తన వెనుక మిక్కిలి దగ్గరగా వచ్చుచున్న లక్ష్మణునితో రామచంద్రుడిట్లనెను. చూచితివా సోదరా! నిగనిగలాడుచున్న ఆకులు గల వృక్షములను, శాంత స్వభావములైన మృగ, పక్షులను జూచితివా? ఈ కారణమున ఇచ్చటికి సమీపముననే మునీంధ్రునాశ్రమ ముండును.

## శ్రీరాముడగస్త్యుని యాశ్రమమును గనుట

దానియందు తన మహిమచేత అగస్త్యుడని భూమియందు ప్రఖ్యాతి గాంచిన మౌనీశ్వరుడుండును. ఈ వనము పవిత్రమైన హోమధూమములతో నిండినదియు, అలసిన లోకులకు సుఖమునిచ్చునదియు, నారచీరలు మాలికలుగా నుండి యందమైనదియు, శాంతస్వభావముగల మృగముల గుంపులు గలదియు, మిగుల మనోహరములైన పక్షుల రొదలచే నిండి యున్నదియునై వెలయుచున్నది. చూచితివా! తమ్ముడా! ఈ పుణ్యాత్ముడీ దిక్కున ప్రవేశించినది మొదలుగా రాక్షసులు యేమియు చేయలేక నెమ్మది గలవారై మనస్సులందు దడదడ మనగా భయముతో చూచుచుందురు గాని, పగ చూపరు సుమా. ఈ మునీశ్వరుని పేరుననే దక్షిణ దిక్కు వ్యవహరింపబడును. సూర్యుని నిరోధింప బూనిన వింధ్య పర్వతము ఈ మునీశ్వరుని యాజ్ఞచేతనే ఇప్పటికినీ నేలనంటియే యున్నది. చిరంజీవియై గొప్ప తేజస్సుతో ప్రకాశించుచున్న ఇతని

యాశ్రమము వినయవంతులగు జనులతో నిండియుండును. జగత్తు చేత పూజింపబడు ఈతని భక్తితో సేవించిన మనకు శుభములు కలుగగలవు. వనవాసమున శేషించిన దినములు నీతనిని సేవించుచు మహానందముతో నిందేయుండుదము. నియమముతో ఆహారమును భుజించు ఈతనిని గంధర్వులు మొదలైన వారు భక్తితో నుపాసించుదురు. మోసగాడు, అసత్యవాది, దుష్టుడు, క్రూరుడు, స్వేచ్ఛాచారుడు ఇచట బ్రదుకజాలరు. దేవతలు, యక్షులు, పక్షులు, నాగులు మొదలగు వారిచట ధర్మపరులై, నియతములైన యాహార విహారములతో నుందురు. ఇచ్చట తపస్సిద్ధులు తమశరీరములను విడిచి, సూర్యతేజస్సుతో క్రొత్త శరీరములను దాల్చి, విమానముల నెక్కి స్వర్గముల కేగినారయ్యా! ఇచ్చటి ప్రాణులచే నమస్కరింపబడిన దేవతలు దేవత్వమును, యక్షత్వమును, రాజ్య భోగములను, ఐశ్వర్యములను తప్పక నిచ్చెదరు. ఆశ్రమ సమీపమునకు వచ్చితిమి. కాన లక్ష్మణా! నీవు ముందువెళ్లి జానకీసహితుడనై నేను వచ్చుటను విన్నవింపుము. వేగము పొమ్ము అనగా అతడట్లే చేయుచు.



# పం(డెండవ సర్గము

## శ్రీరాముడగస్త్యునకు తనరాక దెల్ప లక్ష్మణుని బంపుట

ఆ(శమసమీపముగా వెళ్ళి లోన (బవేశించి యచ్చట నున్న కలశసంభవుని శిష్యుని జూచి యిట్లుచెప్పెను. దశరథుని పెద్దకుమారుడు, సీతానాథుడు రామచం(దుడు భార్యతోగూడి మునిని దర్శించుటకు వచ్చెను. నేను రాముని తమ్ముడను. లక్ష్మణుడను. మునీం(ద్రా! వినుము. అతని (శేయస్సు గోరువాడను. భక్తుడను. అతని చెప్పుచేతలలో నడుచువాడను. ఎల్లప్పుడు నతనినే సేవించువాడను. తం(డియాజ్ఞచేత అడవులందు (పవేశించితిమి. పవి(త చరి(తు డగు మౌనిని చూడగోరెదము. అనఘా! మారాకను విన్నవింపుము అని చెప్పగా ఆ శిష్యుడట్లేయని అగ్నిహో(త్రగృహమును (బవేశించి ఆ తపోధనుని జూచి నమస్కరించి దశరథరాజపు(తులు రామలక్ష్మణులు సీతతోగూడి నిన్ను సేవించుటకై వచ్చిరి. మనవి చేయుమనిరి. మౌనీం(ద్రా! ఏమి యాజ్ఞ అనగా

## శ్రీసీతారామలక్ష్మణులగస్త్యా(శమము లోనికి బోవుట

మునీం(దుడు, నాభాగ్యముచేత ఇన్ని దినముల కైనను రామచం(దుడిచ్చటికి వచ్చెనే? యోగ్యమైన చరి(త్రగల ఆ రాముని రాకకై మనస్సునందు వేచియుంటిని. మంచి భక్తితో యోగ్యవిధిగా సత్కృతి సల్పుటకై వేగముగా వెళ్ళి వారలను ముప్వురను తీసుకొని రమ్ము. శిష్యుడా! వారలను వెంటనే లోపలకు తీసుకొనిరాక తగనివిధముగా ఆలస్యము చేసితివేల ? అనగా ఆ శిష్యుడు వెంటనే నమస్కరించి సం(భమముతో సమీపించి ఓ సుమి(త్రానందనా! రఘురాముడెక్కడనున్నాడో మీరు రండు అనగా ఆ (బ్రాహ్మణకుమారునితో గూడ లక్ష్మణుడు వెలుపలికి

వచ్చి అచ్చట జానకితోగూడిన రఘురాముని జూపించెను. శిష్యుడును గౌరవపురస్సరముగా మునీశ్వరుని వాక్యములను చెప్పి సమ్మానింపగ వారలు పెంపుడు లేళ్ళను, నాల్గుదిక్కులను జూచూచు లోపలకు వెళ్ళి అచ్చట బ్రహ్మయొక్క స్థానమును, అగ్నిస్థానమును, విష్ణుస్థానమును, ఇంద్రసూర్యుల స్థానములను, చంద్రుని స్థానమును, భగునిస్థానమును, కుబేరునిస్థానమును, ధాతృవిధాత్రుల స్థానమును, వాయుస్థానమును, అనంతునిస్థానమును, గాయత్రిస్థానమును గడచి వెళ్ళగా, వసువుల నివాసమును, వరుణుని చోటును, కుమారస్వామిస్థానమును, యమునిస్థానమును అనెడి పూజాప్రదేశములను చూచుచు వెళ్ళగా శిష్యులచే సేవింపబడుచున్న మునిశ్రేష్ఠుడు తనకెదురుగా వచ్చుచుండగా తమ్ముని జూచి రామచంద్రుడు చూచితివా తమ్ముడా ఆ వచ్చునతడే అగస్త్యమౌని కాబోలును. అతని తేజస్సుచేతనే తెలుయుచున్నది

## సీతారామలక్ష్మణు లగస్త్యుని దర్శించుట

అని చెప్పుచు సూర్యనిభతేజుని సమీపించి తాను పాదముల వ్రాలెను మఱియు సీతాలక్ష్మణులును నమస్కరించి నిలుచుండిరి. అప్పుడా మునిశ్రేష్ఠుడు సంతసముతో రామునినతిథిగా గ్రహించి ప్రేమతో అర్ఘ్యపాద్యములనిచ్చి పూజించి క్షేమమడిగి కూర్చుండుడని చెప్పి తరువాత ప్రఖ్యాతచరిత్రుడగు నా అగస్త్యుడు వైశ్వదేవమును చేసి, అర్ఘ్యమిచ్చి, చక్కగా అతిథిపూజ గావించి ధర్మజ్ఞుడు కనుక వానప్రస్థ ధర్మమునకు తగిన భోజనము పెట్టి వారిని పూర్ణతుష్టి నొందునట్లు చేసెను. తరువాత తత్వము తెలిసిన ఆ మౌని తాను ముందు కూర్చొని, దోసిలొగ్గి కూర్చున్న ధర్మజ్ఞుడగు రాముని జూచి ప్రేమతో ధర్మము తెలియునట్లుగా నిట్లు పలికెను. సిరులతో గూడిన మహాత్మా! హోమముచేసి అతిథికి అర్ఘ్యమిచ్చి పూజింపవలెను. ఆ ప్రకారముగా చేయని తపస్వి కూట సాక్ష్యమును జెప్పిన వానివలె తనమాంసమును తానే తినును సుమా. సర్వలోక సమూహములకు నీవు రాజువు. మహారథుడవు. ప్రకాశించెడు ధర్మమార్గమున వర్తించువాడవు.

ప్రకాశించెడు కీర్తిగలవాడవు. గౌరవింపదగినవాడవు. పూజించుటకు పూర్ణముగా యోగ్యుడవు. రాజా మాకు ప్రేమాస్పదమైన అతిథిగావచ్చితివి. మాకింత కన్నా సుకృత మింకొకటి కల్గునా? అని పల్కి, పువ్వులు, పండ్లు, దుంపలు తృప్తి చెందునట్లుగా వారలకిచ్చి తరువాత ఆ జానకీ భర్తకు ముని గొప్ప వింటిని అక్షయ తూనీరములను చూపించి యిట్లనెను.

## అగస్త్యుడు శ్రీరామునకు వైష్ణవాయుధంబులు సమర్పించుట

ఈ దివ్య మహనీయ హేమమణిభూషితమైన విష్ణుమూర్తి యొక్క విల్లు ఆ విశ్వకర్మచే నిర్మింపబడినది. సూర్యుని వలె ప్రకాశించు నీ శరము అమోఘ మైనది. బ్రహ్మదేవునిచే నొసగబడినది. అక్షయ బాణములైన వీ తూణీరములు. అనఘా! ఈ బంగారపు ఖడ్గము, ఒరయు ఇంద్రునిచే నీయబడినవి. సూర్యసమానతేజా! విష్ణుమూర్తి యీ వింటి చేతనే ఇంద్ర విరోధులగు రాక్షసులను జంపి జయమును పొందెను సుమా. ఈ బాణములను, ఈ ఖడ్గమును, ఈ తూణీరములను అవియే సుమా! రామా! నీకు జయము కలుగునట్లు ఇంద్రుడు వజ్రాయుధమును తీసికొనినట్లు నీవు వీనిని తీసికొనుము అని ఆ శ్రేష్ఠములగు నాయుధములను దశరథసుత శ్రేష్ఠునకొసగి మఱియు నిట్లనెను.



# పదమూడవ సర్గము

## అగస్త్యుడు శ్రీరామునితో సల్లాపంబు లాడుట

రామా! లక్ష్మణా! భూపుత్రితో గూడ మిమ్ములను ప్రీతి, సంతోషము కల్గునట్లుగా చూచితిని. ప్రేమతో మీరలు నన్నుచూచుటకు వచ్చి దారియందు కష్టపడితిరి. రామా రత్నమగు ఈ సీతను చూడగా మనసున విశ్రాంతిని కోరుచున్నట్లు తెలియుచున్నది. ఈ భూపుత్రి సుకుమారి. కష్టముల నెప్పుడు నెఱుగదు. అటువంటి సుకుమారి భర్తయందలి నిశ్చలమైన భక్తిచే కష్టములకు నిలయమైన ఈ అడవులకిట్లు వచ్చి భరింపరాని కష్టములను పడుచున్నది. అందుచే ఓ రాఘవా! ఆమె కేవిధముగా సుఖముగా నుండునో అట్లీ వనమందు సొంపుగా చరింపుము. సృష్టి ప్రారంభము నుండియును స్పష్టముగా స్త్రీలు జగమున భర్తయొక్క సౌఖ్యదశయందు తమ కిష్టుడని సంతోషపెట్టెదరు. కష్టములు కలిగెనేని దగ్గరకు రానీయరు సుమా. మెరుపుల వంటి చాంచల్యమును, వాడియైన కత్తులయొక్క కఱుకుదనమును, గరుడునితో వాయువుతో సమానమైన వేగము స్త్రీలకు సహజ సిద్ధ గుణములు. ఈ నీ యిల్లాలియందు దోషకణమైనను గనరాదు. రామా! ఈ పతివ్రత పతివ్రతలచే పూజింపబడదగినది. తలంచి చూడగా అరుంధతితో సమానురాలుగా దోచుచున్నది. ఈ వైదేహియును, నీవును, లక్ష్మణుడును నివసించినచో నీ ప్రదేశము వివిధాలంకారములతో పవిత్రమగును అని ముని యనగా రామభద్రుడిట్లనెను. భార్యాసోదరసహితుడనై భయంకరమైన యడవులయందు తిరుగుచున్న నా గుణములు ఓ ఉదారగుణము గల మునీశ్వరా! నీకు సంతసము గలిగించెను గాన నేను నీకృపచే ధన్యుడనయితిని. నీటి వసతి గలిగి, నిండుగా

అడవులు గల ఒక యాశ్రమమును కరుణతో సెలవిండు. అచ్చట గడవు తీరువఱకును కాలము గడపెదను అని రాముడడుగగా ముని యొక్క నిమిష మాలోచించి స్పష్టగంభీరములైన మాటలతో నిట్లనెను. గుణభద్రా! రామభద్రా! వినుము. ఎక్కువైన ఫలములు, దుంపలు, ఉదకములు గలదై అనేక మృగ పక్షులతో నిండియుండి పంచవటియను పేరుతో మహితమైన స్థలము, సౌఖ్యకరము ఇచ్చటకు రెండామడల దూరమున నున్నది. అచ్చటికి వెళ్ళి యాశ్రమమును నిర్మించుకొని ఈ సుమిత్రాసుతుడును మీరును మీ జనకుని యొక్క యాజ్ఞను దీర్పుడు. నీ వనవాసవత్సరములలో చాలకాలము గడచి పోయినది గదా? రామభద్రా! ప్రతిజ్ఞను తీర్చి భూమికి రాజువై మరల సుఖమును పొందెదవు గాక. దశరథ మహారాజు యయాతివలె ప్రథమ పుత్రుడవగు నీ చేత తరించి స్వర్గమును బొందెను. దశరథుని యందలి ప్రేమచేత నా తపో బలముతో నీ వృత్తాంతము నంతయును తెలిసికొంటిని మరియు నీలోనున్న యాలోచనమును తెలిసికొంటిని. కావున మీరలు నాతో గూడ నిచ్చట నివసింపుడని అనుమతి నిచ్చియు, పంచవటికి వెళ్లుడని నేనే చెప్పవలసి వచ్చెను. తామరల వంటి నేత్రములు గలవాడా! రామా! ఆ పంచవటి మెచ్చదగినది. కడు సుందరమైనది. శ్రీకరమైన గోదావరీనది దగ్గరగా నున్నది. పండ్లును, పువ్వులును కొల్లలుగా నున్నవి. పక్షుల గుంపులు, మృగములు ఎల్లపుడు వింతను కలుగజేయుచుండును. ఏకాంతముగా నుండుటచే సీతకెంతో మోదమును కలుగజేయును. ఇచ్చట కెంతో దూరమును గాదు. మీరు జానకీదేవితో ఆ స్థలమున నివసించి తాపసులను రక్షించి కూరిమితో విహరింపుడు. అచ్చటికి వెళ్ళుమార్గమును నీ కెఱిగించెదను. రామా! అదిగో! ఆ యిప్పతోపును జూడుము. దానికుత్తర దిశగా వెళ్ళితివేని మఱ్ఱిచెట్టు మీకు గనిపించును. ఆ తరువాత చెట్లులేని ఎత్తైన స్థలము కన్పట్టును. ఆ ప్రదేశమును దాటగా నచ్చట నొక పర్వతముండును. దానికి సమీపముననే పంచవటి యున్నది సుమా అని చెప్పగా మౌని కభివాద మొనర్చి సెలవు తీసికొని యుద్ధవీరులగు రామలక్ష్మణులు సీతతో గూడి ఆయుధములను ధరించి ముని చెప్పిన మార్గమున పంచవటికి వెళ్లిరి.

# పదునాల్గవ సర్గము

## శ్రీరాముడు జటాయువును జూచుట

అట్లు వెళ్ళుచు వారలు గొప్ప శరీరము గలవాడును, గొప్ప పరాక్రమము గలవాడును నగు జటాయువును వటవృక్షముపైనున్న వానిని జూచి రాక్షసుడని భావించి విక్రమముతో నీవెవ్వడవని రామలక్ష్మణు లడుగగా అతడు శాంతమైన విధముగా మధురమైన మాటతో పరమసంతోషముతో వత్సా! మీ జనకునకు కూరిమి మిత్రుడను అని చెప్పగా విని వారానందముతో తమ తండ్రి యొక్క మిత్రుని గౌరవించి మీ పేరేమి ? యని యడుగగా ఆతడు సంతోషముతో తన పూర్వవంశ చరిత్రను సంపూర్ణముగా సర్వప్రాణి జన్మ వృత్తాంత సహితముగా శ్రీరామునితో నిట్లు చెప్ప దొడగెను.

తొలుత భూతసృష్టికి కారణభూతులై మహాయశులగు ప్రజాపతులనువారు పుట్టిరి. వారిలో మొదటి వాడు కర్దముడు. అతని తరువాత విక్రీతుడనువాడును అతని వెనుక శేషుడు, సంశ్రయుడును, పిమ్మట స్థాణుడును, మరీచియు, అత్రియు, క్రతువును, పులస్త్యుడును గలిగిరి. తరువాత అంగిరుడు, ప్రచేతుడు, పులహుడు, దక్షుడు, వివస్వంతుడు అక్షయమైన బుద్ధిగల కశ్యపుడు నను వారు చివరగా కలిగిరి. అందు దక్షునకు అరువదిమంది పుత్రికలుదయించిరి. వారిలో ఎనిమిది మందిని కశ్యపుడు పెండ్లి చేసికొనెను. వారి పేర్లను వినుము. అదితి, దితి, దనువు, కాళి, క్రోధవశ, తామ్రమనువు, అనల యను పేర్లు గలవారు. అభిమాన వతులగు ఆ భార్యలను జూచి కశ్యపుడిట్లనెను. మీరలు త్రిలోకములను రక్షింప సామర్థ్యముగలవారును నాతో సమానులును అగు పుత్రులను గనుడు అనగా వారిలో మొదటి నలువురును ఒప్పుకొనిరి. తక్కిన భార్యలు ఒప్పుకోనరైరి. అంత కశ్యపుడు అదితి యందు ముప్పది ముప్వురు పుత్రులను కనెను. వారలు రుద్రులు, వసువులు, ఆశ్వినేయులు, ఆదిత్యులు అని ప్రసిద్ధి నొందిన దేవశ్రేష్ఠులయిరి. దితికి దైత్యులు పుట్టిరి. సముద్రములు వనములతో కూడ ఈ భూమి యంతయు పూర్వము వారిదే. దనువునకు అశ్వగ్రీవుడనువాడు పుట్టెను. కాళికయనుదానికి నరకుడు, కాలకుడు నను

వారలను, తామ్రకు క్రౌంచి, భాసి, శ్యేని, ధృతరాష్ట్రి, శుకి అను కన్యలు ఐదుగురు పుట్టిరి. క్రౌంచి గ్రుడ్లగూబలను, భాసి భాసపక్షులను, శ్యేని గ్రద్దలను, డేగలను, ధృతరాష్ట్రి హంసలను, కలహంసలను, చక్రవాకములను ప్రసవించిరి. శుకి నత ను గనెను. నత యందు వినత జన్మించెను క్రోధచస యనుదానికి పదిమంది కూతుండ్రు గలిగిరి. వారు వరుసగా సురస, మృగమంద, హరి, శ్వేత, సురభి, భద్రమద, మాతంగి, శార్దూలి, క్రదుక, మృగి యనువారు. అందు మృగికి మృగములు పుట్టెను, మృగమందకు ఎలుగుబంట్లు, సవర మృగములు, చమర మృగములు జన్మించెను. హరికి సింహములు పుట్టెను. రామభద్రా! భద్రమదకు యిరావతి జన్మించెను. దాని కైరావతమను గజము పుట్టెను. మాతంగికి ఏనుగులును, శార్దూలికి పెద్దపులులు, కొండముచ్చులును గలిగెను. శ్వేతకు దిగ్గజములు, సురభికి సుందరియగు రోహిణియు, కీర్తిమంతురాలగు గంధర్వియు నను కూతుండ్రు గలిగిరి. రోహిణికి గోవులును, గంధర్వికి అశ్వములును జన్మించెను. సురస పెక్కుపడగలుగల సర్పములను గనెను. కద్రువకు పాములు జన్మించెను. మనువని దానికి మనుజులు పుట్టిరి. వారు బ్రాహ్మణ,క్షత్రియ, వైశ్య,శూద్రులను నాల్గుతెగలవారు. అనలయను నామె సర్వపుణ్యఫల వృక్షములను గనెను. వినత యనెడు శుకి దౌహిత్రికి అరుణుడు, గరుడుడనను నిర్వురు పుత్రులు గలిగిరి. సురస తోడబుట్టినదైన కద్రవకు భూభారమును వహించు వేయిపడగలు గలిగిన శేషుడు పుట్టెను. అందు – నేను అరుణుని పుత్రుడను. సంపాతికి తమ్ముడను. అనఘా నన్ను జటాయువందురు. శ్యేనియొక్క పుత్రుడను. మీకిష్టమైనచో సాయము చేయుదును. రామా! ఈ అడవి భయంకరమైనది చొరరానిది. రాక్షసులతో నిండినది. మీరు వేటకై వెళ్లినప్పుడు ఒంటరిగా నున్న సీతను జాగ్రత్తగా కాపాడెదను అని జటాయువు చెప్పు మాటలను విని ఆ తండ్రి స్నేహితుని సంతోషముతో కౌగిట జేర్చుకొని స్నేహపు మాటలను, గాథలను వినుచు జనకరాజసుత నాతనికప్పగించి, ఆ యనఘుడు వెంట వచ్చుచుండగా అందఱు వెడలి పంచవటిని జూచిరి. వేగముగా మండెడు అగ్ని మిడుతలను కాల్చునట్లు శత్రుజనులందఱిని వినాశ మొనర్చుటకు శ్రీరాముడు తమ్మునితో గూడ పంచవటిని బ్రవేశించెను.

# పదునైదవ సర్గము

## సీతారామ లక్ష్మణులు పంచవటిని ప్రవేశించుట

అనేకములైన దుష్ట సర్పములు, మృగములు గల ఆ పంచవటిని చూచి అంబుజ నేత్రుడగు రాముడు ఆనందముతో నున్న సౌమిత్రిని జూచి మధురమైన మాటలతో సంతోషముగా ఇట్లనెను. లక్ష్మణా! అందమైన పంచవటియను ప్రదేశమిదే. పూచియున్న మంచిపువ్వులతో గూడిన, లతలు, వృక్షములతో కన్నుల పండువుగా నున్నది. ఓయీ నేర్పరీ! బాగుగా ఆలోచించి భూపుత్రికిని, నీకును, నాకును ఎక్కువుగా సంతోషము కలుగునట్లుగా ఆశ్రమ మెచ్చట నిర్మింపదగునో చెప్పుము. నీళ్లకు దగ్గరగా నుండి అందమైన వనములు మనస్సునకు సంతోషము కల్గించు చోటులుగలిగి, మిఱ్ఱు, పల్లములు లేక సమ ప్రదేశమైయుండి ఎక్కువగా పువ్వులు, కట్టెలు, దర్భలు సమీపముగా నుండి యిసుక తిన్నెలు గలిగియున్న యొక నిర్మలప్రదేశమును జూడుము అని చెప్పగా లక్ష్మణుడు చేతులు జోడించి జానకీదేవి సమక్షమున నిట్లు విన్నవించెను. భూమిని రంజింపజేయువాడా! ఇచ్చట మీరు స్థిరముగా నూఱేండ్లు సంతోషముతో నివసింప మీకు నేను సేవకుడినై యుండు వాడను గాన మీరే మీకిష్టమగు ప్రదేశమును చనవుతో నా కాజ్ఞాపించుడు అని చెప్పుచున్న మహాత్ముడగు లక్ష్మణుని మాటల కెంతో తృప్తి నొంది సంతోషమును పొంది రాఘవుడు తానే తగిన ప్రదేశమును చూచి తమ్ముని చేతిని తన చేతితో పట్టుకొని విలాసముగా నిట్లనెను. సోదరా! ఈ స్థలము సమముగానున్నది. పుష్పించిన చెట్లతో నిండియున్నది. ఆశ్రమము నిచ్చట నిర్మింపుము. సుమిత్రాత్మజా! అదిగో సూర్యసమానమైన తేజముతో నొప్పుచున్నవియు, సుగంధముగలవియు నగు

పద్మములతో ప్రకాశించున్న పద్మసరోవరము సమీపముననే యున్నది. అందముగా పుష్పించిన చెట్లు గలదియు, బెగ్గురు పక్షులు, హంసలు, చక్రవాకములు గలదియై అగస్త్యమహర్షిచే చెప్పబడిన గోదావరి నది యిదియే. మిక్కిలి మనోహరమై యొప్పుచున్నది చూడుము. సుందరములైన గుహలు గలిగి, నెమళ్ల యొక్క సమూహము సంతోషముతో కూయుచుండగా నాల్గుదిక్కులను పువ్వులతో, కాయలతో వృక్షములు ప్రకాశించుచుండ పర్వతములవిగో చూడుము. దూరముగాక దగ్గరగాక యున్నవి. చాల చోట్ల బంగారము, వెండి, రాగి మొదలైన ధాతువులచే నింపు గొల్పుచున్న భూ ప్రదేశములు అనేక వర్ణములతో నలంకరింపబడిన యేనుగులవలె నున్న విధమును జూచితివా సోదరా! మద్ది, తాడి, చీకటి చెట్లును, ఎత్తైన మామిడి చెట్లును, ఇప్పచెట్లును, ఎఱ్ఱకాంచనపు చెట్లును, అశోక వృక్షములును, కానుగ చెట్లును, వావిలి చెట్లను, చందన వృక్షములును, విరిగి చెట్లును, సంపెంగ చెట్లును, పారిజాత వృక్షములును, కడిమి చెట్లును, వేప చెట్లును, వెలగ మ్రానులను, తక్కోలపు చెట్లును, పొగడ చెట్లును, టేకు చెట్లును, మోదుగ చెట్లును, కొండ కలిగొట్టు చెట్లును గలిగి ఈ కొండలు వెలయుచున్నవి. ఈ ప్రదేశము కొనియాడబడినది. మృగములతో పక్షులతో నిండి సుందరమై పవిత్రమైయున్నది. తమ్ముడా! పక్షిరాజు సహాయుడై యుండగా మనమిచ్చట నివసించెదము అనగా సూర్యవంశ వర్ధనుడగు లక్ష్మణుడు వేగముగా అన్న గారికై విశాలమైన యొక ఆకుటింటిని నిర్మించెను.

**లక్ష్మణుడు పంచవటియందు పర్ణశాల నిర్మించుట**

నేలయందు పునాదులను త్రవ్వి బాగుగా గోడలను బెట్టి వెదురు బొంగులను స్తంభములుగా నిలబెట్టి వానిపై వెదుళ్లను పరచి, వాసములను పొందించి నారతో చక్కగా బిగించి కట్టి బోదరెల్లుగడ్డిని చక్కగా పైనగప్పి నేల చదునగునట్లు దిమ్మెసగొట్టి, భూమిని చదునుచేసి తొందరగా గోదావరీ నదికి వెళ్లి స్నానము

చేసి, పండ్లును, పువ్వులును దెచ్చి బలులు సమర్పించి శాంతికార్యములను శాంతముగాజేసి లక్ష్మణుడన్న దగ్గరకు వెళ్లి తోడ్కొనివచ్చి దానిని జూపించెను. సీతాసమేతుడై రామచంద్రుడాపర్ణశాలను జూచి సంతోషభరితుడై తమ్ముని దగ్గరకు తీసుకొని కౌగిట జేర్చి ప్రేమ యుప్పొంగుచుండగా నిట్లనెను. గొప్పమనస్సుగల ఓ తమ్ముడా! నీవు చేసిన ఈ గొప్పపనికి ప్రతిగా పారితోషిక మేమియు నీయలేను గాన నిను మెచ్చుకొనుచు కౌగిలించు కొంటిని. నాయనా! నీ శక్తికేమన గలవాడను. అనఘా! నీ మనస్సు నాకు తెలియును. ఇట్టి కృతజ్ఞుడవైన నిన్ను పుత్రునిగా గన్న తండ్రి అతి పవిత్రుడు సుమా. నిన్నునాతో గూడ పంపించుట చేత నింతకాలము నిలిచి యున్నవాడును అని చెప్పి దేవతలు స్వర్గమునందు వలె పవిత్రుడైన రాముడట కొంత కాలము నివసించెను.



# పదునాఱవ సర్గము

## లక్ష్మణుడన్నకు హేమంత ఋతువును వర్ణించి చెప్పుట

సీతాలక్ష్మణ సహితుడై ఏకాంతముగా సుఖముగా నుండగా శరదృతువు వెళ్లిపోగా అందములను కనిపింప జేయుచు ప్రియకరమగు హేమంతఋతువు ప్రవేశించినది. ఆ తరువాత నొకదినమున తెల్లవారుజామున సీతాసమేతుడై రాముడు స్నానము చేయుటకై గోదావరికి వెళ్లుచుండగా లక్ష్మణుడు చేతియందు పాత్రను పట్టుకొని వెళ్ళుచూ అన్నతో నిట్లనెను. దేనిచేత సంవత్సరము ప్రకాశించునో యేది నీకు మిక్కిలి యిష్టమో ఆ శీతకాలమిప్పుడు ప్రవేశించెను. ప్రజలందఱకును శరీరము బిరుసెక్కెను. నీరు స్నానము చేయుటకు వీలులేనంతగా కరుకెక్కెను. నేలయంతటను పైరు పచ్చలు మెరుగెక్కెను. వారు వీరని లేక యందఱకును అగ్ని హోత్రుడు ఆప్తుడయ్యెను. పవిత్రమైన చరిత్రగల ఓ రామ! పూర్వపాపములు పోవునట్లుగా విజ్ఞానులు క్రొత్తధాన్యములతో దేవతలకు, పితృదేవతలకు పెట్టుటకై ముందుగా పొంగళ్లను పొంగింతురు. అన్నయ్యా! ఈ మంచుకాలమందు రాజులు దండయాత్రలు చేయుటయం దాశక్తిగలవారగు చుందురు. పల్లెప్రజలు గోవులు సమృద్ధిగా పాలినిచ్చుటచే కోరికలు తీరినవారై యుండెదరు. లోకనేత్రుడైన సూర్యుడు దక్షిణదిక్కునందు ప్రకాశించుచుండుటచేత ఉత్తరదిశ శోభాలక్షణమైన తిలకము నొసటలేని స్త్రీవలె నున్నది చూచితివా. సహజముగనే మంచుగడ్డలకు స్థానమైన వాడగు హిమవంతుడు వేడినిచ్చు సూర్యుడు చాలాదూరమందుండుటచేత కాలమహిమ చేత సార్థకనామడయ్యెను. జనులు మధ్యాహ్నసమయమందు సుఖముగా

తిరుగుటకు ఎండ వెచ్చగా గాయుచున్నది. సూర్యుని వేడిమి సోకకపోవుటచే నీడల యందలి నీరు జిల్లనుచు ముట్టుకొనుటకు దుస్సహమైయున్నది. ఎక్కువ వేడిమిలేని సూర్యరశ్మిగలవియు, మంచుచేత ఆవరింపబడినవియు నగు వనములు చలిగాలి వీచుచుండగా జనసంచార రహితములై యున్నవి. మనుష్యులు ముద్దకట్టు కట్టినట్లుగా మునుగదీసుకొని యుండునట్లు పగళ్లు సాగుచున్నవి. పుష్యమాసప్రభావముచే మంచుచేత బూజుపట్టినట్లుండి ఈదురుగాలులు గలిగి ఆరుబయట పడకలు కనిపించనివై రాత్రులు పెద్దవి యగుచున్నవి. తన సహజ సౌభాగ్యము నంతను సూర్యునకొసంగి చంద్రుడు మంచు బిందువులచే కావిబట్టి నోటి యావిరిచే గ్రుడ్డిగా కన్పించు అద్దమువలె కాంతి తగ్గినవాడయ్యెను. నిండుపున్నమి నాటి వెన్నల రాత్రియైనను మంచుచేత కప్పబడి యెండచే కావిరి బట్టిన భూమియను కన్యవలె మనోహరము గాకున్నది. ఉండియు కాంతి లేనట్లేయున్నది. సూర్యవంశశ్రేష్ఠుడా! స్వతస్సిద్ధముగనే శీతలుడయి, మంచు తోడి యోగముచేత ఇప్పుడు ఉదయ వేళలందు పడమటిగాలి రెండింతలైన శైత్యము గలిగియున్నది. యవ, గోధుమపైరులు గలిగి మంచుచే గప్పబడిన వనము సూర్యోదయవేళ క్రౌంచముల, సారసపక్షుల ధ్వనులతో శోభిల్లుచున్నది కంటివా? రాఘవా! ఖర్జూరపుష్పముల వంటి కాంతిగలిగి నిండుగానున్న వడ్లుచేత తలలను కొంచెమువంచి మేలిమి బంగారమువలె రంగులీనుచున్న వరి పైరులు మనస్సు సంతోషపడునట్లు చూచితివా? అన్నా! మంచుతుంపురులు విరివిగా వ్యాపించి యుండగా అందుండి వెడలుచున్న కిరణములు గలవాడై దూరమున నుదయించిన సూర్యుడు చందమామవలె నున్నాడు. పవిత్రశీలుడా! కనుగొనుము. రామా ఉదయవేళ ఏమియు పసలేనివై, మధ్యాహ్నవేళ హాయిగా శరీరమును సోకుచు, ఇప్పుడు కొంచెము తెలుపు, కొంత యెఱుపు గలిగియున్న యీ యెండలను జూడుము. మంచుతుంపురులు రాలుటచేత కొంచెము తడిసి యున్నట్టి పచ్చికబయళ్లయందు సూర్యుని నీరెండలు పడుచుండుటచే మంచుబొట్లు

వజ్రములవలె ప్రకాశించుచున్నవి. ఓ వంశశ్రేష్ఠుడా! అదిగో అడవియేనుగు చాల దాహముచెంది గూడ మిక్కిలి జిల్లుమనుచున్న నీటినంటియు త్రాగకయే తొండమును వెంటనే ముడుచుకొనుచున్నది చూడుము. ఓ అనఘచరితా! నీటి పక్షులు నీటిదరిని కూర్చుండి యుండియు, నీళ్లలో మునుగుటకు జంకుచున్నవి. యుద్ధమునందు పిరికివారు ప్రవేశింపలేని తీరు నది దలపించుచున్నది చూడుము. అన్నా! లోపల నంతయు మంచు, చీకటి గలవై పైనను మంచుగప్పుకొని రాగా పుష్పరహితమై వనము నిద్రించెడి విధమున కనిపించుచున్నది. ఆవిరి గ్రమ్మిన నీటిపై శబ్దములచే మాత్రమే తెలియబడుచున్న బెగ్గురు పక్షులసమూహముచే మంచు తుప్పరచే తడిసిన యిసుక తిన్నెలు గలిగియున్న యేరులను జూడుము. రామా!ఇదిగో మంచు పై పై రాలుటచేతను, సూర్యకిరణములు వేడిలేని వగుటచేతను, చలిచేతను స్వచ్ఛములైన శిలల మీదపడిన నీళ్లు పాదరసము వలెనున్నవి. మంచుచే ధ్వంసము చేయబడి దళములు వ్రాలిపోయి పుప్పొడులు రాలిపోయి, తూండ్లు మాత్రమే మిగిలిన పద్మములతో కొలను అందము కోల్పోయియున్నది. ఇట్టి పుండువంటి చలికాలములో భరతుడు అయోధ్యలో నీపై గల ప్రేమాతిశయముచేత భరింపరాని దుఃఖముచే క్రాగుచూ రాజ్యమును, భోగములను మాని తాపసియై నేలపై నిద్రించుచు, మితాహారమును పుచ్చుకొనుచూ కష్టపడుచుండును గదా. ఇదేవేళకు అతడును నిద్రమేల్కొని యేటినీట స్నానము చేయుటకై ప్రజలు గుంపులై తన్ననుసరించుచుండగా నిర్మలమనస్సు గలవాడై సరయూనది కేగుచుండును గదా. గారాబముగా బెరిగిన సుకుమారుడగు భరతుడు సుఖముల కలవాటు పడినవాడు ఏరీతిగా అపరరాత్రులందు ఆ సరయూనది యందు మునుగు చున్నాడో గదా. మిక్కిలి సుకుమారుడు, వీరుడు, అందమైన పలుచని యుదరము గలవాడు, సర్వధర్మముల నెరిగినవాడు, విజ్ఞాని, సంతోషమును గలిగించువాడు, సత్యవాది, దోషములేని పనులనే చేయువాడు, మదించిన శత్రువుల మదమణించువాడు, మధురముగా మాటలాడువాడు,

ఆజానుబాహుడు, రాగరహితుడు, సిగ్గుపడదగిన పనులను చేయనివాడు, జితేంద్రియుడు, భక్తిగలవాడు అయిన నీ సోదరుడగు భరతుడు అఖిలభోగముల యందాసక్తి వీడి, వనములందు చరించుచున్న నిన్నుబోలి తపోనిష్ఠవహించి స్వర్గమును జయించెను. మనుష్యులలో కుమారుడు తండ్రిని పోలియుండడు. తల్లినే పోలియుండునను లోకవార్త భరతునియందు వృధాయైనది. ఏమన వలెను? పొగడబడిన శీలముగలవాడగు దశరథుడు భర్తయై, గుణవంతుడగు భరతుడు పుత్రుడై యున్న కైకేయి కలుషితమైన, తీక్ష్ణమైన మనస్సు గలదగుట ఎట్లు సంభవించెనో గదా! అని పల్కగా విని, రాముడు లక్ష్మణా! కైకనేల దురుక్తులాడెదవు? రఘువంశశ్రేష్ఠుడగు ఆమె పుత్రుని చరిత్రనే యింకను జెప్పుము. సంతసమగును. నేను వనవాసమునందు నిష్ఠగా మనస్సును గట్టి చేసుకొన్నవాడనైనను మాన్యుడగు ఆ భరతుని తలంచినచో చింతచేత మనస్సు దుర్బలమగుచుండును. నాయనా! విన్నావా? ఆ భరతుని యొక్క మధుర సంభాషణములు ఆ మహనీయుని అమృతతుల్యమైన వాక్కులు ఇంపై ఎప్పుడును నా మనస్సునందు మరుపురావు సుమా. నిన్ను, భరతుని, శత్రుఘ్నుని, జానకిని గూడి యందు సంతోషము ఎప్పుడు మరల గలుగునో గదా యని విచారించుచు, రామచంద్రుడు స్నానము చేయుటకు గౌతమినదికి వెళ్లెను. వెళ్లి సీతానుజ సహితుడై సూర్యునకు, మునులకు, పితృదేవతలకు, దేవతలకు నమస్కరించి పార్వతియు, నందియు సేవించుచుండ వెలుగొందు రుద్రుని వలె నొప్పారెను.



# పదునేడవ సర్గము

## శూర్పణఖ శ్రీరాముని జూచుట

సర్వలక్షణలక్షితుడైన రామచంద్రుడు భూపుత్రి తోడను, లక్ష్మణుని తోడను, గౌతమీ నదియందు స్నానము చేసి తన పర్ణశాలను ప్రవేశించి అందు నియమముతో చేయవలసిన విధులన్నిటిని పూర్తిచేసి, పర్ణశాలలో సీతా లక్ష్మణులతో సుఖాసీనుడై ఇష్టాగోష్ఠిగా పూర్వచరిత్రను చెప్పుకొనుచుండగా, నా శ్రీరాముడు సీతాసహితుడై చిత్రానక్షత్రముతో గూడిన చంద్రునివలె ప్రకాశించెను. అట్లు కథలు చెప్పుచున్న కకుత్థ్స వంశమణియైన రామచంద్రుని దేవనిభుని నదాటుగా చూసి రాక్షసరాజైన పంక్తికంఠుని సోదరి శూర్పణఖయను పేరు గలది యాశ్రమము ప్రవేశించెను. సింహము వక్షము వంటి వక్షము గలవాడును, తామర రేకులు వంటి కన్నులు గలవాడును, ఎల్లప్పుడు నుత్సాహముగ నుండు వాడును, ఆజానుబాహుడును, సుకుమారమై ప్రకాశించు మొగముగలవాడును, సజ్జన సమూహముచే నుపాసింపదగువాడును, ఇంద్రునితో సమానమైనవాడను, మదించిన యేనుగువలె నడచువాడను, మిక్కిలి సుకుమారుడును, పెద్ద జటాభారము గలవాడును, మిక్కిలి చూడదగినవాడును, శత్రు భయంకరుడును, నల్ల కలువల వలె నల్లనివాడును, సౌందర్యముచే మన్మధుని జయించినవాడును, రాజలక్షణములతో నున్నవాడును, గొప్ప పరాక్రమము గలవాడును అగు రాముని జూచి మన్మథుని యొక్క వాడిబాణములచేత చీల్చబడిన మనసుగలదై పాపశీలురాలును, మహెూదరియు, చెడునడవడి గలదియునగు ఆ రాక్షస స్త్రీ రాముని చేరవచ్చెను. మంచి ముఖము గలవానిని, ఆ దుర్ముఖీమణి, పవిత్రమైన

శీలము గలవానిని, ఆ పాపశీలురాలు, ఉత్తమమైన శుభప్రదమైన వేషముతో నున్నవానిని – చూచుటకు వికారముగా నున్న ఆ కురూపిణి, మంచి స్వరము గలవానిని, ఆ భైరవనినాదము గలది, పెద్ద కన్నులు గలవానిని, ఆ భయంకర మైన కన్నులుగలది, ఆ నల్లని శిరోజములుగలవానిని, ఎఱ్ఱని జుట్టుగలది – చక్కగా మాటాడువానిని, పెడసరపు మాటలుగలది, యువకుని – ముదిరిన వయస్సుతో భయంకరాకారముగలది – ప్రియకరాకారుని – భయంకర వేషముగలది సమీపించి, మన్మథుని బాణములచే మాడిపోవుచున్న మనస్సుగలదై మోహపు తత్తరపాటుతో నిట్లనెను.

## శ్రీరాముడు శూర్పణఖకు తమ వృత్తాంతము చెప్పుట

నీవెవ్వడవు? మునీశ్వరుని వేషమును ధరించి భార్యతోగూడి యీ వనభూమియందు విల్లమ్ములు ధరించి క్రొవ్విన రాక్షసులు సంచరించు ఈ చోటున దిరుగుటకు కారణమేమి? మీరీవిధముగా నిందుండుటకు కారణమేమి? అనగా ఋజుబుద్ధిగల రాముడిట్లనెను. ఈ రామున కబద్ధము చెప్పుట యెంతమాత్రము నిష్టము కాదు. అందునను తపస్వి స్థితియందున్నప్పుడు స్త్రీ జన సమీపమున నిక జెప్పనేల? ఈ భూమియందు దేవతలతో సమానమైన తేజము గలవాడగు దశరథుడను పేరుగల యొక రాజేంద్రుడు గలడు. ఆ రాజు కొడుకులందు నేను జ్యేష్ఠుడను. నన్ను భూజనులు రాముడందురు. ఇతడు నా తమ్ముడు లక్ష్మణుడనువాడు. మంచి గుణములు గలవాడు, నాతో గూడ వచ్చెను. ఈ తన్వి నా భార్య. సీత యను పేరు గలది. ఓ వనితా! తల్లితండ్రుల యాజ్ఞను తప్పజాలక ధర్మకాంక్ష చేత ధర్మార్థమై యిక్కడకు వచ్చిన వారము. విన్నావా? ఇంక చెప్పుము. ఎవ్వతెవు నీవు? నీ పేరేది? నిజము చెప్పుము నీవెవ్వరి దానవు. నీ యొక్క అందమైన వేషమును జూడగా నిక్కముగా రాక్షసివని తోచుచున్నది. ఇచ్చుటకు నీవు వచ్చుటకు గారణ మేమియో చెప్పుము. అనగా ఓ రామచంద్రా సత్యము చెప్పెదను వినుము.

## శూర్పణఖ శ్రీరాముని మోహించుట

నేను శూర్పణఖ యనెడి రాక్షస స్త్రీని. ఎటువంటి రూపము నైనను ధరింపగల శక్తి గలదానను. ఈ అరణ్యము నందు సర్వులకు భయంకరమైన దాననై ఒంటరిగా సంచరింతును. విశ్రవసుని పుత్రుడును, రాక్షసరాజునునైన ఆ రావణుడను వానిని విని యుండ లేదా నీవు? అతడే మా యన్న. ఓ దేవ సమానరూపా! అతి భయంకరుడును గొప్ప నిద్రగలవాడునైన కుంభకర్ణుడును, రాక్షసుల కృత్యముల కిష్టపడనివాడును, ధర్మచిత్తుడునునైన విభీషణుడును అతని సోదరులు. ఓ అందగాడా! సాటిలేని యుద్ధ శూరులగు ఖరదూషణులను వారలును నా తోడబుట్టువులు. వారందరిని లెక్కచేయక నాయిష్టము వచ్చినట్లు తిరుగుచుందును. అందమునందు నీతో సమానమైన వానిని నేనెక్కడను చూడలేదు గాన నిన్ను నేను కనుల నిండుగా చూచిన దగ్గర నుండి మనస్సునందు నీవే మగడవు కావలెనని కోరుచున్నాను. ఓ పురుషోత్తమా! అందులకే ఎక్కువైన కోరికతో నీ దగ్గరకు వచ్చితిని. భూపతి! నన్నేమనుకొన్నావో నేను అపరిమిత ప్రభావ సంపద గలదానను. స్వైర విహారము చేయుటలో స్వతస్సిద్ధమైన బలముగలదానను. నాకు భర్తవై హాయిగా సౌఖ్యములనుభవింపుము. రోతగానున్న ఈ సీత యెందులకు? ఈ వికృతాంగి విరూపిణి ఇస్సిస్సీ! నీకు తగినదా? నేను నీకు తగిన భార్యను సుమా. నన్ను నీ యిల్లాలిగా స్వీకరించుము. నీ యీ సీతను దుష్టవనితను, అసహ్యమైన దానిని, మనుష్య స్త్రీని నీ తమ్మునితో గూడ తినివేసెదను. ఇప్పుడే నేనును నీవును సుందరములైన పర్వతగుహల యందును వన ప్రదేశములందును మగడా! వేడుకతో విహరింతుము.



# పదునెనిమిదవ సర్గము

**అ**ని పల్కగా వాక్యనిపుణుడునగు రాముడు చిరునవ్వు నవ్వుచూ మన్మథబాణములచే గొట్టబడిన హృదయము గల ఆ రాక్షసస్త్రీతో మృదువైన వాక్యములతో స్పష్టముగా అర్ధమగునట్లుగా నిట్లనెను. దీనిని పెండ్లి యాడితిని గదా. నాకు ప్రియురాలైన దీనిని నేనేప్రకారముగా విడువనేర్తును. చూడుము నీవంటి గొప్ప అందమైన దానికి సవతిపోరు విడువని దుఃఖమునకు కారణము గదా. ఇతనిని జూడుము. నా సోదరుడు శీలవంతుడు అద్భుతమైన తేజముగలవాడు, లక్ష్మణుడను పేరుగలవాడు. వీడు దగ్గర భార్య లేనివాడు. సాటిలేని వీరుడు, వయస్సులోనున్నవాడు, సుందరుడు చాలకాలమునుండి స్త్రీకి భ్రాంతిపడువాడు. ఓ పూబోడీ! నీ యొక్క సుందరమైన రూపముతో పోల్చిచూడగా నీకే భర్త కాగల యోగ్యతలున్నవాడు. ఎండ సుమేరు పర్వతమునువలె నీ వతనిని సవతిపోరులేకుండగా వరింపుము. అనుచున్న రాముని మాటలు విన్న రాక్షసాంగన కామముచే మోహింపబడిన మనస్సుగలదై లక్ష్మణుని యొద్దకు వెళ్లి వ్యర్థముగా కాలయాపనముచేయుట కోర్చుకొననిదై అతనితో నిట్లనెను. ఓ చెలువుడా! నీ యొక్క అందమునకు సరిపోయిన స్త్రీని నేనే. నీకు భార్యనయ్యేదను. నన్ను చేపట్టుము. వేగముగా వనములందును, కొండలందును విహరించుటకు వెళ్లుదమా ! అనగావిని లక్ష్మణుడు వేళా కోళముగా నిట్లనెను. నేను సేవకుడను. చెలియా! నన్ను పెండ్లియాడి అయ్యో నీవును నావలె బానిసవౌదువా? మహాత్ముడైన అన్నగారికి నేను బంటునై బ్రతుకుట నీ వెఱుగవా? ఓ వరవర్ణినీ! నీకు తెలిసియున్నచో నిట్లు మాట్లాడెదవా? అందువలన ఓసీ అసిద్ధార్థా సమృద్ధార్థుడైన రామునకే ముద్దులొలుకు చిన్నభార్యవై బ్రదుకుము. ఇది తలపవైతివి నిన్నేమందును? విరూపురాలును, కఠినరాలును,

చెడ్డదియు, పెద్దపొట్టగలదియు, ముసలిదియు నగు నీమెను నెట్టివేసి నిన్ను భార్యగా స్వీకరించును. ఇంత సుందరమైన రూపము గలదానిని విడిచి మానవస్త్రీ యందెవ్వడు వేడుక పడును? అని లక్ష్మణుడు చెప్పగా విని ఆ వెకిలిదైన శూర్పణఖ అది పరిహాసమని ఎరుంగక అచ్చట నుండి వెళ్లి పర్ణశాలలో జానకితో నున్న రాముని సమీపించి మన్మథపీడితయై యిట్లనెను. విరూపురాలును, కఠినురాలును, చెడ్డదియు, పెద్ద పొట్ట గలదియు, ముసలిదియు నగు నీమెను చేపట్టి నీవు నన్ను గౌరవింపకున్నావు. గాన ఈమెనిప్పుడేమ్రింగి సవతి పోరు లేకుండా నీతో సుఖించెదను అనుచు ఆ కొరవి వంటి చూపులుగలది, లేడిపిల్ల కనులవంటి కన్నులుగల ఆ సీత మీదకు రోహిణీనక్షత్రము మీదకు వచ్చు పెద్దనైన ఉల్కవలె హుమ్మనుచు రాగా జూచి మహాబలశాలియగు రాముడు ఆమెను నిరోధించి కోపముతో సుమిత్రానందునితో నిట్లనెను. లక్ష్మణా ఈ రక్కసిని జూచితివా? నీచులతో నెప్పుడును పరిహాసము లాడరాదు సుమా. ఇదిగో చూచితివా! చంచలమైన నేత్రములుగల జానకి మరల స్వస్థతనొంది యే విధముగా బ్రదికి యుండునో గదా!

## లక్ష్మణుడు శూర్పణఖ ముక్కుసెవులను కోయుట

లక్ష్మణా! ఈ మహోదరిని, ఈ దుష్టురాలిని, ఈ వికృతరూపిణిని, మదముచే పిచ్చిపట్టిన ఈ రాకాసిని ఇప్పుడే పట్టుకొని విరూపనుగా జేయుమ అనగా అమిత బలశాలియగు లక్ష్మణుడు కోపముతో కత్తితో దాని ముక్కు చెవులు కోసివేసెను. ఈ విధముగా ముక్కుచెవులను మొక్కవోగా మొత్తుకొనుచు విసురుగా నల్లనిమబ్బువలె, హా! యని అడవి అంతయు మారుమ్రోయుచుండగా బొబ్బపెట్టుచు రక్కసి రక్తము కారుచుండగా విరూపయై ఉక్రోషముతో నేడ్చుచు వనముల మధ్యమందు వేగముగా పరువెత్తి వెళ్లి జనస్థానమందు చుట్టు రాక్షసులు కొలుచుచుండగా కూర్చొని యున్న సోదరుడగు ఖరుని జూచి యార్తనాదముతో ఆకాశమునుండి భూమిమీద పడు పిడుగువలె నేల మీద పడి పెద్దగొంతుతో ఏడ్చుచుండెను.

# పందొమ్మిదవ సర్గము

## ఖరుడు శూర్పణఖ యొక్క వికృత వేషమును గని కోపించుట

నెత్తుటిచే శరీరము తడిసి వికృతమైన రూపముతో భూమిమీద బడి యెద్చుచున్న ఆ శూర్పణఖను జూచి ఖరుడు కోపముతో ఉడికిపోవుచు భయంకరాకారుడై యిట్లనెను. తప్పుచేయక కదలక యున్నట్టి, మహా విషముతో గూడిన కృష్ణసర్పము నెవ్వడు మదించి వ్రేలితో ముట్టుకొనెను? ఎవడు విషము త్రాగెను? తన కంఠమునకు తెలివితక్కువవాడై యెవడు కాలపాశమును చుట్టుకొన్నవాడు? నేనిప్పుడే వేగముగ నేగి వానిని నేల గూల్చెదను. వాని నెత్తురు త్రావెదను. బలము, పరాక్రమము గలదానవు. ఇష్టమొచ్చినచోట ఇష్టమొచ్చిన రూపము ధరించి తిరుగుచుందువు. ఓ కలికీ! నీకీదుర్దశను గల్గించిన ఆ అర్ధాయుష్కుడెవ్వడు? దేవతలయందుగాని, గంధర్వాదు లందుగాని, పరమర్షులయందుగాని తొందరపాటుతో ఈ గొప్ప అపకారమును జేయుటకు తెగించి యింత గొప్ప సాహసము గలవాడెవడో చెప్పుము. వానినిప్పుడే సంహరించెదను. దేవతల యందు పాకాసురిని సంహరించినవాడును, సహస్రాక్షుడును అయిన యింద్రుడైనను నా కప్రియమును చేయుటకు భయపడుననగా ఇంకా నాకనిష్టము జేయు వాడెవ్వడు? నీటిలో గలిసిన పాలను హంస త్రాగునట్లు వేగముగా నా బాణముల చేత వానిని భూమిపై బడవేసి ప్రాణములను త్రాగివేసెదను. క్రూరమైన యుద్ధరంగమందు కూల్చి నురుగుతో గూడిన ఎవని రక్తమును క్రూరమైన నా బాణములు త్రాగవలెనని కోరుచున్నావు? ఓ సహోదరీ! నా యొక్క గొప్పబాణములచేత మర్మస్థానములను గొట్టి వానిని గ్రద్దలకు కాకులకు ఆహారముగా చేసెదను. ఎవడునిన్నిట్లు హింసించెనో చెప్పుము. నా వాడిబాణములచేత వానికి నిజముగా చావుతప్పదు. వానిని కాపాడుటకు దేవతలుగాని రాక్షసులుగాని సమర్థులు కారు సుమా. నీ వేవిధముగానైన సేదతీరి వానిని గుర్తు తెలుయునట్లుగా చెప్పుమనగా సోదరుని వాక్యములను విన్నదై విపరీతముగా కన్నులనీరు ఏరులై పారుచుండగా నిట్లనెను.

## శూర్పణఖ ఖరునకు సీతారామలక్ష్మణుల వృత్తాంతము చెప్పుట

అన్నా వారు తరుణులు. మంచి అందమైన వారలు. తపసి వేషములు ధరించిన వారలు, సుకుమారులు, గొప్పబలవంతులు, తామర వంటి కన్నులగలవారు, మృగచర్మములను వస్త్రముగా ధరించిన వారలు, అడవులలో నుండు ఫలమూలములను తిను వారలు, ఇంద్రియనుగ్రహము గల వారలు, ధర్మము తెలిసిన వారలు, అన్నదమ్ములు వారు రామలక్ష్మణులను వారలు, దశరథ పుత్రులు సుమా. అన్నా! వారు రాజచిహ్నములు గలవారు, గంధర్వ నాయకులతో సమానమైన వారు. వారి యొక్క తేజస్సును చూచినచో వారు దేవతలో మానవులో చెప్పుట వీలుకాదు. వారిమధ్య ఒక స్త్రీని చూచితిని. తరుణవయస్సుగలిగినది. మంచి అందమైన ఆకారముగలిది. సమస్తాభరణము లను ధరించియున్నది. సన్నని నడుము గలది. తామరరేకుల వంటి నేత్రములు గలదియైయున్నది. ఆ స్త్రీ నిమిత్తముగా నా యిద్దఱు నొక్కటై నన్నదలించి ఈ విధముగా అనాధురాలినివలె విడువని దురవస్థలపాలు చేసిరయ్యా! ఆ కుటిలశీలము గల స్త్రీ యొక్క రక్తమును, యుద్ధనిహతులయిన ఆ యిరువురి యొక్క నురువుతో గూడిన రక్తమును ఇష్టముతో గొంతువఱకు నా నోటితో త్రాగుటకిమ్ము. నిన్నిదియే నా మొదటి కోరికగా కోరుచున్నాను.

## ఖరుడు పదునల్వురు రాక్షసులను శ్రీరామునిమీదకు బంపుట

అని చెప్పగా విని ఖరుడు కోపమును పొంది క్రూరస్వభావము గలిగిన పదునల్వురు రాక్షసశ్రేష్ఠులును, యమధర్మరాజువంటి తేజముగలవారిని చూచి నిట్లు చెప్పెను. ఓ దనుజులారా ! మన దండకాటవి యందొక స్త్రీతో గలసి ఇద్దరు మనుష్యులు ధనుర్బాణములను ధరించి, నారాచీరలను గట్టి నిలిచియున్నారు. మీరలు వారినిద్దరిని చంపివేయుడు. నా అక్కగారు వారల నెత్తుటిని త్రావుటకై వేడుకపడుచున్నది. శూరులారా ! మా అక్కగారి కోర్కెను తీర్చుటకు మీరు వెళ్ళుడు అనగా వారు శూర్పణఖ వెంటరాగా వెళ్ళిరి.

# ఇరువదవ సర్గము

**గా**లిచే నెగురగొట్టబడుచున్న మేఘములవలె వారు వెళ్లి సీతాసమేతులై ఆశ్రమ సమీపమున సుఖముగా కూర్చొనియున్న ఆ అన్నదమ్ములను ప్రతిభావంతులను, ఆ రాక్షసి చూపించగా చూచిరి. అప్పుడా సీతానాధుడును, రాక్షసులతో గలసివచ్చుచున్న శూర్పణఖను జూచి ప్రకాశమానముఖుడైన లక్ష్మణుని జూచి యిట్లనెను. లక్ష్మణా! కొంచెముసేపు నీవిచ్చట సీతను గాచుకొనియుండుము. నేనారాక్షసులను సంహరించెదను, అనగా లక్ష్మణుడట్లే యనగా, రాముడు సంధించిన వింటిని ధరించి బంగారు పుంఖములు గల బాణములను తీసికొని ఆ పద్మాక్షుడు దుష్టులు, వంచకులునైన ఆ రాక్షసాధముల వంక జూచి యిట్లు పలికెను. రామలక్ష్మణులను అన్నదమ్ములము మేము. దశరథ సుతులము. సీతతో గలిసి యీదండకాటవి యందు విహరింప వచ్చి యున్నారము. ఫలములను, మూలములను దినుతాపసులము. ధర్మము వీడనివారము. దమము గలవారము. ఈ దండకావనమున స్వేచ్ఛగా సంచరించువారము. మీరు మాపై నిట్లేల వచ్చితిరి. పాపవర్తనులగు మిమ్ము మునులయొక్క ఆజ్ఞచేత యుద్ధమున నొప్పించి, చీల్చి చంపుటకు వచ్చినారము మేము. మీరు ధైర్యము గలవారలైనచో తొలగక నిలిచి యుండుడు. జీవితముపై ఆశయున్నచో పారిపొండు అనగా, ఆ పదునల్వురును కరములయందు వాడియైన శూలాయుధములు వెలుగుచుండగా కోపముతో రామునితో నిట్లనిరి. రామా! మేము వచ్చిన వృత్తాంతమును వినుము. మొక్కవోని పరాక్రమము గల మారాజైన ఖరునకు కోపము వచ్చునట్లు చేసితివి. ఇకమీద మీరెందు బోయెదరు? ఈ పదునల్వురను నొంటరిగా నెదుర్కొన శరీరముతో నిల్వనైన

గలవా? బలముతో, పరాక్రమముతో సంగరస్థలమున మార్కొను మాట లెందులకు?

## శ్రీరాముడు పదునల్వురు రాక్షసులను జంపుట

ఇవిగో మాయొక్క బాహువుల నుండి విడువబడిన క్రూరములగు పరిఘములు మిక్కిలి ప్రకాశించెడు శూలములు తగులగా, ఓయీ బేలా! శౌర్యమును, వింటిని, ప్రాణములను విడిచెదవని పల్కుచు, అందరు నొక్కమారుగా శూలములను విసరగా, లోకములచే కీర్తింప దగినవాడగు నా రాముడు వాటిన్నంటిని సువర్ణపుంఖములగు తన బాణములచే చిన్నతునుకలై నేలబడునట్లు చేసెను. అట్లు త్రుంచి, అంతతో ఊరుకొనక, మిక్కిలివాడియైన వియు, సూర్యుని వలె వెలుగుచున్నవియు, బంగారుపుంఖములు గలవియునైన పదునాల్గు శరములను వింట సంధించి, క్రూరులైన రాక్షససంఘమును జూచి, ఇంద్రుడి వజ్రాయుధమువలె వేయగా, ఆ శరములు రాక్షసాధముల గుండెలను దూరి భూమిలోనికి ప్రవేశించెను. వారు మొదలు నఱికిన చెట్లవలె రక్తసిక్తములైన దేహములతో ప్రాణములను గోల్పోయి, భూమిమీద పడిరి. వారు పడుట చూచి భయముపొంది చుప్పనాతి తిరిగి పారిపోయెను.



# ఇరువది యొకటవ సర్గము

పెద్దపెద్దగా బొబ్బలు పెట్టుచు, భయము కలుగునట్లు నేడ్చుచు, ఆ జనస్థానమునకు వెళ్లి, ఖరాసురుని ముందు ప్రాణములేని దానివలె పడగా, అనర్థకారణముగా వచ్చిన ఆ శూర్పణఖను చూచి అతడిట్లనెను. ఎందులకేడ్చెదవే మరల? నీ యిష్టము తీర్చుటకై యెంతయో పరాక్రమవంతులైన రాక్షసేంద్రులను నీవెంట బంపితిని గదా. వారలందఱు నాయందెక్కువ భక్తి గలవారు. నా హితమును గోరువారు. ధైర్యముగలవారు. యుద్ధము లందు ప్రీతిగలవారు. అపజయము లేనివారు. నేజెప్పిన కార్యమును జేయక మానరు. సోదరీ! ఈ యేడ్పునకు కారణమెయ్యది? హా! నాథా! యని యిట్లు నేలపై దొర్లి ఆడసర్పము వలె నేడ్చెదవేమి? సందర్భమును చెప్పుము. దిక్కై నేనుండగా దిక్కులేనిదానివలె దీనతతో ఏల ఇట్లు కృంగిపోయెదవు? లేలెమ్ము. నాకక్కడి వృత్తాంతమును దెల్పుము. మనసునందు భయమును వీడుము. అనగా, కన్నులనీరు చేతితో దుడుచుకొనుచు, లేచి, అన్నను జూచి యిట్లనెను. నా కోరికదీర్చుటకై నీవు బలవంతులైన రాక్షసులను పదునల్వురను పంపించుట నిజమే.

## శూర్పణఖ ఖరుని రామునిమీదకు యుద్ధమునకు బోవ ప్రేరేపించుట

కాని, ఆ రాక్షస శూరులు రామునియొక్క కఱకు బాణముల చేత ప్రాణములు కోల్పోయి, క్షణములో నేలబడగా, భయమును పొందినదాననై, వేగముగా పరుగుపెట్టుచు వచ్చితినయ్యా! ఏమని చెప్పుదును. శరీరము కంపించుట యింతవఱకు కొంచెమైనను తగ్గలేదు చూడుము. ఖరుడా! గొప్పనైన విషాదమనెడు మొసళ్లతో నిండినదియు, అధికమైన భయమనెడు

అలలుగలదియు అయిన మహా దుఃఖమనెడు సముద్రములో పూర్తిగా మునిగియున్న నన్ను ఊరడించి రక్షింపుము. నీకయి చనిపోయిన రాక్షసముఖ్యులయందును, నామీదను నీ మనస్సునందు నిజముగా కొంచమైన దయ యున్నచో, నీకు రాముని నెదిరించి నిలువగల ధైర్యమున్నచో, ఏది చూచెదను. ఆ రాక్షస విరోధిని జంపుటకై బయలుదేరుము. నాకు పగవాడైన ఆ కాకుత్సవంశజుని నీవు జంపుటకు పూనుకొనవేని, నిజముగా నీయెదుటనే సిగ్గులేనిదాననై ప్రాణములను పోగొట్టుకొనెదను. నీవు నీ సైన్యముతో గూడ, ఆ వీరుడైన రామునిముందు యుద్ధరంగమున నిలువలేవని నామనసునకు తోచుచున్నది. బలమందును, ధైర్యమందును నీవెక్కడ? అతడెక్కడ? శూరుడునని అనుకొనుచున్నావు గాని శూరుడవు కావు. బలమున్నదని భ్రాంతిపడుచున్నావు. నీవు రాక్షసుడవైయుండియు మానవులైన ఆ రామలక్ష్మణులను చంప ప్రయత్నించలేకున్నావు. ఆ రామునితో యుద్ధమందు తలపడు శక్తి నీకున్నచో, వేగముగా భీమబలముతో వెళ్లి ఢీకొనుము. బలము, ధైర్యము లేని నీకు ఈ గొప్ప అడవి రాజ్యమెందులకురా! కులపాంసనా! వెంటనే మఱియొక చోటునకు పొమ్ము. ఆలస్యముచేసినచో రాముడు నిన్నిచట పాతిపెట్టును. ఏమనుకొన్నావో రఘుకులేశ్వరుడైన రాముని గురించియు, నా ముక్కుచెవులు గోసి నన్నిట్లు చేసిన వీరుని, రాముని తమ్ముని గుఱించియు, అని పల్కుచు మహోదరియైన చండిక వలె కడుపు బాదుకొనుచు దుఃఖముగా తపించుచుండగా రాక్షసాధిపుడగు ఖరుడామెతో నిట్లనెను.



# ఇరువది రెండవ సర్గము

## ఖరుడు సేనతో శ్రీరాముని మీదకు యుద్ధమునకు బోవుట

నీయొక్క యవమానముచే పుట్టిన నా ఆగ్రహమును, పొంగిన లవణ సముద్రమువలె అణచుట కెవ్వరికిని తరము గాదు సుమా. సోదరీ! హీనుడైన ఒక మనుష్యుని, ఒక అల్పజీవిని యగు రాముని లెక్కచేయుదునా? తనయొక్క దుష్టచేష్టల వలననే యతడు భూమియందు నామమాత్రావశేషుడగును గదా? ఏడవకుము. ఏల ఏడ్చెదవు. ఇదే నేను వెళ్లి తమ్మునితో గూడ రాముని, నా క్రూరమైన, కఠినమైన కుఠారధారచే యముని కలిసికొనుటకు బంపెదను. నీకు కీడు చేసిన వారిరువురి వేడి నెత్తురులను చేతికొలది నీపగ చల్లారునట్లు జుఱ్ఱుకొనుము అని ఖరుడు చెప్పగా విని, శూర్పణఖ మిక్కిలి సంతుష్టచిత్తయై, తిరిగి ఖరుని మూర్ఖతతో పొగడుచుండగా, అతడు క్రోధముతో ఉగిపోవుచు, ఉద్దండుడును, గొప్ప బలముగలవాడును అగు తన సేనాపతియైన దూషణుని జూచి వేగముగా నిట్లనెను. భయంకరమైన బలవేగములు గలవారును, యుద్ధమున వెనుకంజ వేయనివారును, సాహసము గలవారును, నల్లని మేఘములవంటి దేహములు గలవారును, క్రూరులును, హింస చేయుటయందు నిపుణులును, ఉత్సాహవంతులును, గొప్ప బలముగలవారును అయిన పదునాల్గువేల మందిని వేగముగా సమకూర్పుము. ధనుర్బాణములు, ఖడ్గములు మొదలైన వివిధ ఆయుధములతో నన్ను, నాయొక్క రథమును తీసికొనిరమ్ము. ఓ మహిత తేజా! ముందు వెళ్లెదను. పౌలస్త్యసంతతికి, చావు గూర్చి రామచంద్రునకు, జయము కలిగించి జగములందు పేరుపొందెదను అని చెప్పగా విని, దూషణుడు ప్రళయకాలమందలి సూర్యునివలె వెలుగుచున్న

రథమును, పలు రంగుల గుఱ్ఱములతో పూన్చబడినదానిని వేగముగా తెచ్చి ఖరుని ముందు నిలుపగా, అతడు పుటము పెట్టబడిన బంగారముతో చేయబడినదియు, బంగారు చక్రములు గలదియు, మత్స్యములు, పుష్పములు, వృక్షములు, కొండలు మొదలైనవి చెక్కబడినదియు, పక్షులు, సూర్యచంద్రులు మొదలగు నాకృతులు చెక్కబడినదియు, జెండాలు, ఖడ్గములు, చిఱుగంటలు మొదలగువానితో నొప్పుచున్నదియు నయిన ఆ రథమును క్రోధచిత్తుడై వేగముగా నెక్కెను. అంత దూషణుడు గొప్ప సైన్యముతో గూడినవాడై, ఖరేంద్రుని సమీపమునకు వచ్చి నిల్వగా, ఖరుడు వెళ్లుటకు ఆజ్ఞాపించెను. అంత నాసైన్యమంతయు అధికమైన వేగముతో కదలి వెళ్లసాగెను. ఆ ధ్వని దిక్కులను పిక్కటిల్లజెసి, సర్వ జంతువులు దిగ్భ్రాంతిని పొంది సొమ్మసిల్ల జేసెను. ప్రకాశించు శూలములను, ముద్గరములు, ఖడ్గములు, గండ్ర గొడ్డళ్లను, విండ్లును, వజ్రాయుధములవంటి కత్తులును, పట్టిసములును, పరిఘములును మొదలైన ఆయుధములను బూని, భయము గొల్పునట్లుగా, భూమి వణకునట్లుగా, రోషముతో ఆ రాక్షసులు పదునాల్గువేలమంది వెల్వడిరి. ఖరుని మనసు దెలిసిన సారథి ఆసైన్యము వెంట సరభసముగా రథమును తోలెను. దాని చక్రధ్వనులు భూమిని, అష్టదిక్కులను భేదించినవి. విపరీతమైన కోపముగలవాడై, క్రూరచరిత్రుడగు రాక్షసుడు, భయంకరమైన కంఠధ్వనితో గొప్పగాలిచే ప్రేరేపింపబడి, రాళ్లవర్షము గురియింపబోవు మేఘము మరియొక మేఘమును పొడిచినట్లు, సారథిని వేగముగా తోలుముతోలుమనుచు పొడిచెను.



# ఇరువది మూడవ సర్గము

## ఖరునకు దుశ్శకునములగుట

ఈ విధముగా రాక్షససంఘములు యుద్ధము చేయవలెనను నుత్సాహముతో జనస్థానమును వీడి చనుచుండగా, గాడిద రంగుగల మేఘము రక్తపునీరుగల వానను ఎక్కువుగా కురిసెను. వాహన సమూహము పువ్వులు చల్లిన సమ ప్రదేశమున ఆకస్మికముగా దబ్బున జారిపడెను. నల్లనిదియు, చివర నెఱ్ఱనికాంతి గలిగినదియు, కొఱవి త్రిప్పిన నేర్పడు చక్రము వంటిదియునగు భయంకరమైన పరివేషము వేగముగా సూర్యుని చుట్టు నేర్పడెను. బంగారపు టెక్కెముపైన గ్రద్ద నెమ్మదిగా నెక్కియుండెను. మాంసాహారులగు పశువులు, పక్షులు భయంకరముగా వికృత స్వరముతో తిరుగసాగెను. సూర్యుని వంకకు దిరిగి నక్కలు విపరీతముగా కూయదొడగెను. పర్వతములను, ఖండములను బోలిన పెద్ద మేఘములు రక్తవర్షములను గురియచుండెను. ఒక్కసారిగా భూమియు, దిక్కులును తెలియకుండ చిమ్మచీకటులు నిండిపోయెను. వేళకాకున్నను రక్తముతో తడిసిన వస్త్రమువంటి సంధ్యారాగ మేర్పడెను. ఖరునకభిముఖములై రాపులుగులు, తోడేళ్ళు మొదలగునవి కఠోరములైన అరపులను వినిపించెను. నక్కలు మంటలు గ్రక్కుచు భయంకరమైన శబ్దములతో అరవజొచ్చెను. అమావాస్య కాకున్నను సూర్యుని, రాహువు పట్టెను. సూర్యుని పక్క ఒక వికటమైన పరిఘాయుధాకారమేర్పడెను. రివ్వున పెనుగాలి ఎదురుగా వీచెను. సూర్యుని కాంతి తగ్గెను. రాత్రి కాకున్నను నక్షత్రములు, గ్రహములు ఆకాశమునందు

మిణుగురువలె గన్పించెను. దాగిన చేపలుగలవియు, వాడిన తామరలు గలవియునై కొలకులు కళావిహీనములయ్యెను. చెట్లన్నియు పుష్పములు, ఫలములు రాలిపోయి పాడుపడి యుండెను. గాలిలేకుండగనే అభిముఖముగా యెఱ్ఱని ధూళి రేగెను. గోర్వంకలు చిన్న చిన్న స్వరములతో వికృతముగా పలుక జొచ్చెను. భయంకరాకారముతో పిడుగులు, ఉల్కలు రాలుచుండెను. అడవులు, పర్వతములతో గూడ భూమి వణకదొడగెను. ఖరునకెడమ భుజ మదిరెను. ఎంతయో పెద్దగా అరవబోయినను గొంతు పెగలదయ్యెను. రాక్షస రాజునకు గన్నులవెంట నీరు వెడలెను. నొసట నొప్పి జనించెను. వీనిని జూచికూడ జడబుద్ధి యగు ఖరుడు యుద్ధయాత్ర మానడయ్యెను. భీతిని గలుగజేయునట్టి మహోత్పాతములను అన్నిదిక్కులందు జూచియు, రాక్షసరాజు బలగర్వముతో నవ్వుచు, సైనికులను జూచి యిట్లనెను. ఓ సైనికులారా! స్పష్టముగా కనిపించు నీయపశకునములకు నేను జంకను. పిరికివాడైనచో వీనికి భయపడును గాని గొప్ప భుజబలము గలవాడు, మనస్సునందు లెక్కపెట్టునా? చుక్కలనైనను నా బాణాధారలతో నేలరాల గొట్టెదను. యమునినే దండించెదను సుమా. క్రూరాయుధము నందా రాఘవులను చంపక వెనుకకు మరలుదునా? కోరిక తీరునట్లుగా నా సహోదరి వారల రక్తములను క్రోలుగాక. ఘోరయుద్ధములందు నాకు మునుపెన్నడు అపజయములు కలుగలేదు. ఇందులకు మీరులే సాక్ష్యులు సుమా. నేనసత్యమును చెప్పుటలేదు. ఇంద్రునినే యుద్ధములో జయించినవాడునట నేను అల్పులగు మనుష్యులచే చచ్చెదనా? అని గర్జన చేయగా, ఆ ధ్వనికి రాక్షసులందరును కాలపాశములచే బంధింప బడినవారై, ఆనందసముద్రమున దేలియాడిరి. యుద్ధము చూడవలెనను కాంక్షతో వచ్చిన దేవతలు, ఋషిరాజులు, సిద్ధులు, గంధర్వులు మున్నగు వారందఱును

వేగముగా గో[బ్రాహ్మణ సంగత జనేభ్యస్స్వస్తి యనుచును, నయగుణ సహితుడగు విష్ణువు వలె, రాక్షసులను రాముడు సంగరమందు సర్వరాక్షసులను "జయించుగాక జయించుగాక" అనుచు ఆకాశమందు రాగా, రామలక్ష్మణు లంతట రాక్షసులయొక్క క్రూరమైన సైన్యములను సంభ్రమోత్సాహముతో జూచిరి. ఖరుడు రథవేగముతో సైన్యమును దాటి వెళ్లుచుండగా, అతని మంత్రులు శ్వేనగామి, పృథుగ్రీవుడు, కాలకర్ముకుడు, యజ్ఞశత్రువు, సర్పాస్యుడు, దుర్జయుడు, మేఘమాలి, మహామాలీ, విహంగముడు, రుధిరాశనుడు, మహావీరుడగు కరవీరాక్షుడు పరుషుడు అనువారు పండ్రెండుగురు ఖరుని వెంటనే వెళ్లిరి. అంత దూషణునివెంట స్థూలాక్షుడు, ప్రమాథి, మహాకపాలుడు, త్రిశిరుడు ననువారు నల్వురు యుద్ధకాంక్షతో బయల్వెడలిరి. వారి పాదధూళి అధికముగా రేగి రాత్రిని తలపించుచుండెను. సూర్యచంద్రులపై వెళ్లు గ్రహముల సమూహమువలె రాక్షససైన్యము సూర్యవంశోద్భవుల మీదకు కలహమందు ప్రీతిగలదియై వేగముగా వెళ్లెను.



# ఇరువది నాల్గవ సర్గము

## రాముడు లక్ష్మణునకు యుద్ధశకునములను జూపుట

ఆ సమయమందు రఘువంశ శ్రేష్ఠుడగు రాముడెల్లయెడల తోచుచున్న యుత్పాతములనెల్ల చూపి చిన్న తమ్మునితో నిట్లనెను. లక్ష్మణా చూచితివా? భూతజాలము భయముచెందునట్లుగా రాక్షసులయొక్క గొప్ప వినాశమును సూచించునట్టి యుత్పాతములెల్లయెడలను గనిపించుచున్నవి. తప్పక ముప్పు సంభవించునని తోచుచున్నది. యుద్ధసమయమున చావ సిద్ధముగానున్న వారి ముఖములు విన్నదనము పొందియుండును. నీయొక్క ముఖము ప్రకాశమానమై, శ్రీకరమై, నిర్మలమై యొప్పుచున్నది సుమా. గాడిదల రంగులతో, గార్దభామల ధ్వనులతో, రక్తధారలతో ఆకశమున మేఘములు సంచరించుచున్నవి. చూచితివా? నావిండ్లు కదలుచున్నవి. బాణములు ప్రోగలుగ్రక్కుచు మండు చున్నవి. వనములందు పక్షుల అరుపుల చందము చూడగా, ప్రాణాంతకమైన భయముకలుగుననియు, శత్రువుల మరణింతురనియు, మనకు జయము తధ్యమనియు తోచుచున్నది. అతి భయంకరమైన యుద్ధము జరగబోవుచున్నది. మఱియు నా కుడిహస్తమిప్పుడు యదురుచున్నది. రాక్షసులయొక్క భయంకరమైన అరపులును, భేరులు మొదలయిన వానియొక్క మ్రోతలును అవిగో వినిపించుచున్నవి. ఆపద వచ్చునని మనస్సునందు తోచగనే, తెలివిగలవాడు చలింపక, ఆ యాపదను తొలగించు నుపాయమును వేగముగా ముందే తన స్వచ్ఛమైన బుద్ధిశక్తితో ఏర్పరచుకొనును.

## శ్రీరాముడు సీతాలక్ష్మణులను గుహ యుద్ధ సన్నద్ధుడగుట

కాన నీవు వింటిని, బాణములను ధరించి, అధికమైన చెట్లతో నిండిన కొండగుహలోనికి సీతను దీసికొని కదలుము. లెమ్ము. దీనికి బదులుచెప్పితివేమి, నా పాదములపై ఒట్టు సుమా. యుద్ధమునందు ప్రీతిగలవాడా! నీవు ,బలవంతుడవనియు, శూరుడవనియు నేను మనస్సునందు ఎఱుగుదును. వీరందరిని వధింపగలవు. అందులకు నామనస్సునందోకింతయు సందేహము లేదు. కాని, నేను స్వయముగా రాక్షస బృందమును చంప దలంచుచున్నాను. కాన, నీవు ముందుగా జానకీ సహితుడవై వేగముగా వెళ్లుము అనగా, సుమిత్రానందనుడు ధనుర్బాణములను ధరించి జానకీదేవితో కలసివెళ్లగా, సరి వారు వెళ్లిరిగదా యని మిక్కిలి సంతోషముతో రామభద్రుడు అగ్నివలె ప్రకాశించు గొప్ప కవచమును ధరించి, చిమ్మచీకటియందు పొగలేని యగ్నివలె ప్రకాశించుచు, ఉగ్రమైన వాడియైన బాణములను, ధనస్సును చేతబట్టుకొని, వింటినారి లాగి, వదులుటచే పుట్టిన శబ్దము దిక్కులను బ్రద్దలుకొట్టుచుండగా, రాజపుత్రుడు కోపముతో నిలిచియుండెను. అప్పుడు యుద్ధమునుజూచు కోరికగలవారై, గంధర్వులు మొదలుగాగల దేవతలు, చారణులు గుంపులై ఆకాశమందు నిలిచియుండిరి. ఋషులందరు తమతో తామిట్లనుకొనుచుండిరి. " గోవులకు, బ్రాహ్మణులకు స్వస్తియగు గాక. త్రిభువన శ్రేయమును గోరువారికి స్వస్తిగాక. పౌలస్త్యాదులగు భయంకరులైన రాక్షసులను యుద్ధమందు రామచంద్రుడు జయించుగాక జయించుగాక", యని పలుకుచు మరియు ధర్మబుద్ధియు, వీరుడును నగు రాజొక్కడు, దుష్టులగు రాక్షసుల పదునాల్గు వేలమంది సంహరింప యెట్లు జరుగునో చూతుమనుచు కుతూహలముతో నుండిరి. అధికమైన ఆగ్రహము కలుగుటచే, రుద్రునితో సమమయిన ఆకృతిగలదియు, సమస్తప్రాణులకు అధికమైన భీతిని పొందజేయునదియు నయిన సీతానాధుని రూపమును జూచి జగములు భీతిల్లెను.

**ఖర సైన్యము రాముని జూచుట**

అంతట గొప్ప ధ్వనిచేయుచున్నదియు, క్రూరములైన కవచములు, ఆయుధములు, ధ్వజములు గలదియునయిన రాక్షసుల సైన్యము విపరీతములగు హుంకారములను, చాపములయొక్క టంకారములను, భేరుల భాంకారములను, భయంకరులైన రథికులయొక్క ధిక్కారములను, పాదముల నేలకుగొట్టు దభక్కారములను చేయుచు వచ్చుచుండగా, తుములమయిన ఆ శబ్దమునకు అడవియందున్న మృగసంతతులన్నియు భీతిని జెంది, అన్ని దిక్కులకును పరుగెత్తి, నిశ్శబ్దముగా నున్న చోటునకు వెళ్లి వెనుదిరిగి చూచుచుండెను. అట్లు రాక్షససేన వచ్చుచుండుటను రణపండితుడైన రామచంద్రుడు నాల్గుదిక్కుల కలయజూచి, వింటియందు బాణమును సంధించి, వింటినారి తెగలాగి, రాక్షసవీరుల ప్రాణవాయువుల నెగురగొట్టునట్లుగా, కోపమును దెచ్చికొనుచు, చలించుచున్న కన్నులగలవాడై, గల్పాంతమందు మంటలు గ్రక్కు అగ్నివలెను, దక్షాధ్వంసము చేయబోవు ముక్కంటినివలెను, చూచువారలకు భీతినిగొల్పునట్టి యాకారముతో నొప్పుచుండగా, భయంకరమైన రోషమునందిన రఘురాముని వేషము జూచి భూతజాలమంతయు సంతోషమును విడచినవై, అధికమైన భయముతో త్రొక్కటపడుచు, గొప్ప ధ్వనిచేయుచు పారిపోయెను. ధ్వజములు, కోదండములు, ఆభరణములు, మండుచున్న అగ్నివంటి కవచములుగల రాక్షససైన్యము సూర్యోదయవేళ మేఘసమూహమువలె నుండెను.



# ఇరువది యైదవ సర్గము

## ఖరుడు సేనతో శ్రీరాముని దాకుట

క్రోధముగలవాడు, శత్రుసంహారుడు, యుద్ధమునకు సిద్ధమైనవాడు, విల్లు ధరించినవాడు, అంగుళిత్రములను ధరించినవాడు నయిన రాజపుత్రుని జూచి, ఖరుడు ఓ సుతా! రథమున్నక్కడకు తొందరగా తోలుమనెను. అతని జుట్టూజేరి రాక్షసులు గట్టిగా నరచిరి. అతడు చుక్కలు చుట్టునున్న కుజగ్రహమువలె వెలుగొందుచు భయంకరములై వాడియైన బాణపరంపరలను వేగముగా రాజపుత్రునిపై వైచెను. తక్కిన రాక్షసులందఱును పట్టిశములు, శూలములు, ముద్గరములు, పరశువులు, ఖడ్గములు మొదలగువానిని నివారింపరానట్లుగా రామునిపై వేసిరి. బాణములతోనూ, గజములతోను, గొప్ప రథములతోను రాక్షసులొక్కుమ్మడిగా రాముపై చంపుటకై చుట్టుముట్టిరి. మేఘముల సమూహాము జలధారలచే పర్వతమును బోరున ముంచునట్లుగా, రామునిమీద వారు బాణవర్షములను గురియించిరి. సముద్రము, నదీజలములను పీల్చునట్లుగా పురుషశ్రేష్ఠుడగు రాముడు ఆ ఘోరమైన శరసమూహములను, ఇతర యుద్ధసాధనములను క్షణములో నణచివేసెను. ధీరత్వముతో, వజ్రాయుధపు దెబ్బతో వ్యథచెందని గొప్ప పర్వతమో యనునట్లు రఘువీరుడు ఘోరముగా నాటిన యుద్ధసాధనములచే కొంచెమైనను బాధను పొందడయ్యెను. శరీరమునుండి రక్తముకారుచుండగా, సాయంత్రమందు పడమటి దిక్కునున్న మేఘములచే ఆవరింపబడిన సూర్యుడో యనునట్లు నవీన విలాసముతో

నొప్పెను. అయ్యో సుగుణ సముద్రుడైన రామచంద్రునిని ఒక్కుని చుట్టుముట్టి ఈ రాక్షసుల యొక్క గుంపులిట్లు మోదుచున్నవేయని దేవతలును, ఋషులును, ఎక్కువగా బాధ చెందసాగిరి. అంతట రఘురాముడు అపరిమితమైన కోపముతో మండలాకారముగా వంగిన ధనస్సుతో బాణసమూహములను...

## శ్రీరాముడు ఖరుసేనను దునుమాడుట

నూరులు, వేలు, భరింపశక్యముగాని యమదండములను బోలిన వానిని తేరిచూడరానంత వేగముగా రాక్షసుల శరీరములందు దూరి యమపాశములవలె వారల శరీరముల జీల్చి నెత్తుటి ప్రవాహములలో దడిసి, మండుచున్న అగ్నిజ్వాలలో యననట్లాకాశమునకు ఎగిసెను. లెక్కపెట్టలేనన్ని బాణములచే కొట్టియు, కోసియు, నొప్పించియు, క్రుచ్చియు ఆ విధముగా శత్రుసంఘముల చేతులను, కాళ్ళను, తలలను, తొడలను, క్రొత్తనగలను, ధ్వజాగ్రములను గుప్పల కుప్పలుగా పడునట్లు చేయుచు, క్రోధముతో నిండిన మనస్సు గలవాడై రాముడు శత్రువులు తత్తరమందునట్లుగా, బంగారు ఆభరణములతో అలంకరింపబడిన గుఱ్ఱములను రౌతులతో గూడ చంపి చంపి, మావటివాండ్రతో గూడ ఏనుగులను అంతంతలుగా ద్రుంచి త్రుంచి, రథికులు సారథులతో గూడ రథములను కఱకు బాణములతో నఱకినఱకి, గొప్ప గర్వముతోనున్న భటసంఘమును కూరముక్కలవలె కోసి కోసి, గుండ్రముగా వంగిన ధనువునుండి అన్నివైపుల నుండి వెలువడుచున్న బాణతతులనెడు తీక్ష్ణకిరణములుగల సూర్యునివలె రాముడు ప్రాకాశించుచుండగా రాక్షస సంఘములు భయముతో అరచుచు గోలపెట్టెను. ఎండిపోయి అడవులు అగ్నిచే తగులబెట్ట బడినట్లుగా ఆ పద్మాక్షునిచే ముష్కర శత్రుసమూహము ఊచముట్టుగ నేలగూలెను. వారలలో కొందఱు నివారింపరాని పరాక్రమము గలవారలు, శూరులు, ఖడ్గభిండివాల శూల పరశ్వాదులగు ఆయుధములను, హస్తములు ధరించి బలవంతుడగు రాముని

మీద వేయగా, నిశితమైన బాణములతో రాముడు వారు వేసిన సాధనములతో పాటు, వారి శిరములను ఒక్కమారుగా త్రుంచివైచెను. బాణములను, చేతులను, శిరములను, విండ్లును పడిపోయి రాక్షసులు మరణింపగా చూచి, మిగిలిన రాక్షసులు భయపడి ఖరుని చాటునకు పరువెత్త సాగిరి. రామరాజేంద్రునియొక్క వింటినుండి విడువబడిన కఱకుబాణముచేత నొప్పింపబడి, గరుత్మంతుని యొక్క రెక్కలగాలిచే కొట్టబడిన చెట్లవలె భీతిచెందిన రాక్షసకోటి, యోడిపోయి, దీనులై, రాక్షసరాజు చెంతకు పరువెత్తసాగిరి. వారికందరికి ధైర్యము చెప్పి, భయంకరమైన రోషముతో దూషణుడు, కాకుస్థవంశతిలకునిపైకి వెళ్లి తలపడెను. వెంటనే మునుపటివారును తిరిగి చెట్లు, రాళ్లు మొదలగు సాధనములతో మీదపడుచుండగా, రాముడు ఘోరముగా వారిపై శరవర్షమును కురిపించెను. రాక్షసులు కూడ వెనుకకు తగ్గక యుద్ధము చేయుచుండిరి. అప్పుడాయుద్ధము చూపఱులకు శరీరములు గగుర్పొడుచునట్లొనర్చెను. అంతటితో విడువక, రోషముతో దిక్కుల చీకట్లు క్రమ్మునట్లుగా ఒక్కమారుగా అసురులు రాముని చుట్టుముట్టి పైబడిరి. భయంకరమైన ప్రాసము, ఖడ్గము మొదలైన తీవ్రమైన ఆయుధములను కుప్పలుగా వారు రామునిమీద గుప్పింపగా, రాముడు ధనుష్టాకారముతో శత్రువుల గుండెలు పగులుజేయుచు, గట్టిగా గర్జించుచు, శత్రువులను సంహరించుటకై దట్టముగా దిక్కులన్నియు వాడి బాణములతో నిండునట్లుగా భయంకరమైన గాంధర్వాస్త్రములనేసెను. ఆ గాంధర్వాస్త్రము నుండి బయల్వెడలిన వివిధాకారములు గల క్రూరమైన అస్త్రముల సంతతులచే నిండి, ఆకాశము చిమ్మచీకటి యయ్యెను. సూర్యుని మబ్బు గప్పినట్లయ్యెను. సేనయంతయును తూలి, నేలబడి నాశనమై, చిన్నచిన్న తునకలై, ప్రేవులు తెగి, భీభత్సముగా నయ్యెను. బాణములను తీసికొనుటయు, సంధించుటయు, వేయుటయును అవి వచ్చుటయు రాక్షసులకు తెలియకుండెను. తమసేనయందు

కాళ్లను, చేతులను తెగుట మాత్రమే తెలియుచుండెను. ఆ సూర్యుడు కనిపించనట్లుగా, దిక్కులందు చీకట్లునిండగా, రాముడు వేయుచున్న బాణములు వేయుచుండెను. బాణములు తగులుట, నొప్పిపొందుట, చచ్చుట, గుట్టలుగా పడుట అనునవన్నియు నొక్కమారే జరుగుచున్నట్లు తోచుటచే, ఆకాశమునుండి చూచుచున్న దేవతలు, ఋషులు నివ్వెరపడిరి. తలపాగాలతోనున్న తలలు నేలపైపడి దొరలుచుండగా, భుజకీర్తులు, కంకణములతో గూడిన భుజములు కట్టలుకట్టలుగా కనిపించుచుండగా, కొట్టివేసిన చెట్లస్కందములవలె, భూమినిండ తెగిన తొడలు పరుచుకునియుండగా,అనేక విధములైన భూషణములతో గూడిన మోకాళ్ల సమూహములు ముక్కలు ముక్కలై పడియుండగా, గొప్పయేనుగులును, రథములును, గుఱ్ఱములును, గొడుగులును, చామరములును, జెండాలు, వీవనలు ఖండఖండములై భూమి నిండియుండగా, ఈ యుద్ధరంగము సర్వప్రాణులకు చూచుటకు భయంకరమైన భీతిలి కలిగించెను. విఱిగిన రథములను, నేలగూలిన శూరులను, తెగిపడిన జెండాలను, గొడుగులను, తెఱచియున్న నోళ్లను, పరువెట్టుచున్న వీరులును, తెగిపడిన ఏనుగులను, నేలమీదపడి దొరలుచున్న గుఱ్ఱములను, నరుకబడిన చేతులను, తెగిన మూతులును, త్రొక్కిసలాడుచున్న భయపడినవారును గలిగి, వికారమై రాక్షససైన్యమంతయు నశించుచుండగా జూచి దూషణుడు



# ఇరువది యాఱవ సర్గము

## దూషణుడు శ్రీరాముడితో యుద్ధముచేసి చచ్చుట

ఐదువేలమంది కఠినులైన రాక్షసులను రాముని సంహరించుటకు బంపగా, వారలు వజ్రాయుధమువంటి శూలములు, ఖడ్గములు, బాణములు మొదలగు సాధనముల వర్షము గురియించుచు, తన్నుచేరుటను చూసి, రాముడు నెక్కువ పరాక్రమముతో బాణవర్షముతో విరోధులయొక్క సాధనములను త్రుంచివేసి, వర్షము మీద గురిసిన యెద్దువలె ప్రకాశించుచు, రఘునాథుడు కోపముతో తన శరవర్షముతో దూషణునితో గూడ ఆ రాక్షససైన్యమును దైన్యము నొందిం చుచు, యుద్ధరంగమందు విజృంభించి వర్షాకాల మేఘమువలె ముంచి వేసెను. అంత రోషముతో శత్రుభయదూషణుడగు దూషణుడు గొప్ప పరాక్రమముతో భయంకరుడై, వజ్రసమములగు శరములను వేయగా, రాముడలుకతో వాడియైన బాణముతో వాని ధనువును విరిగజేసి, క్రూరములైన నాల్గు వాడి బాణములతో నాలుగు గుఱ్ఱములను జంపి, తరువాత అర్ధచంద్ర బాణముచే సూతుని శరము నఱికి, మూడు బాణములను దూషణుని గుండెలోనికి పోవునట్లుగా వేయగా, రాక్షసుడును బంగారు రేకులచే చుట్టబడినదియు, కొండ, కొమ్మ వలెనున్నదియు, దేవతలసమూహములందరిని మర్ధింపగలదియు, ముండ్లతో నిండినదియు, శత్రువుల వసాపంకముతో నిండినదియు, నూరంచుల వజ్రాయుధమును పోలినదియు, విరోధులయొక్క పట్టణముల, గోపురములను పడగొట్టునదియునైన పరిఘాయుధమును ధరించి, ధైర్యముతో మీదపడుటకు రాగా చూచి రాముడు వేగముగా రెండు బాణములను సంధించి రాక్షసుని చేతులను నఱికెను. ఆ చేతులతోపాటు ఆ ఇనుప పరిఘాయుధము గూడ ఇంద్రధ్వజమువలె నేలబడెను. చేతులు నఱుకబడుటచేత దూషణుడు దంతములు తెగిన ఏనుగువలె నేలగూలెను. చనిపోయిన రాక్షసుని చూచి, సర్వభూతజాలములును "రామా! మేలు మేలు" యని పొగడుచుండ, అంతలో రాక్షసవీరులు దూషణుని జంపిన రామునిపైకి వచ్చిరి. స్థూలాక్షుడు పట్టిశమును, మహాకపాలాసురుడు శూలము లను, భయంకరమైన పరశువును ప్రమాధియు చేతులతో త్రిప్పుచు వేగముగా

మీదకు రాగా, సీతానాథుడు నిశిత బాణములచే మహాకపాలుని తలను భూమిపై బడవేసెను. మఱియొక్క గొప్పబాణముచే ప్రమాథిని వధించి, స్థూలాక్షుని కన్నులలోనికి బాణములు కూరి, ఐదువేలమంది రాక్షసుల నైదువేల బాణములతో చంపివేయగా, దూషణుడు సైన్యముతో గూడ వధింపబడుటను ఖరుడు జూచి, కోపించినవాడై, నీచుడైన మనుష్యుని చేతిలో సైన్యముతో గూడ దూషణుడు చచ్చెను. యోధులారా! మీరువెళ్లి యతనిని చంపుడని వారిని పంపి, తానుకూడ రామునిపైకి వెళ్లెను.

## కాలకర్మకాది సేనాపతులు పన్నిద్దఱు శ్రీరాముచే చచ్చుట

కాలకర్మకుడు, మేఘమాలి, మహామాలీ, దుర్జయుడు, యజ్ఞశత్రుడు, విహంగముడు, రుధిరాశనుడు, సర్పాస్యుడు, స్థిరపృథుగ్రీవుడు, శ్యేనగామి, విఖ్యాతబలుడైన కరవీరాక్షుడు, పరుషుడు అనువారు పంద్రెండుమంది సేనానాయకులొక్కపెట్టుగా దాశరథిని తలపడి బాణవర్షము గురిపించగా, రాముడు వారి బాణములను ఖండించి, వజ్రసమానమైన బాణములచే చెట్లను నరికినట్లుగా, నిమిషములో రాక్షససేనాదులను నఱికి భూమికి బలివెట్టెను. చెవివఱకు లాగి నూఱుబాణములచే నూర్వురు దుష్టులను, వెయ్యిబాణములతో వేగముగా వెయ్యిమందిని మహాబలుడగు రాముడు తెగవేసెను. పడిపోయియున్న విండ్లును, బాణములను, గుప్పలుగా రాలిన భూషణములును, నేలవ్రాలిన టెక్కెములును, పగిలిపోయిన రథములును, ధారలుగా కారుచున్న రక్తములును, ఇకచాలునన్నట్లుగా యమధర్మరాజు వంటయిళ్లనున్నట్లుగా, రక్తసిక్తమై యుద్ధరంగముండెను. రక్తముతో తడిసి, విడిపోయిన వెంద్రుకలతో భూమిమీద పడిపోయిన దుష్టులైన రాక్షసుల సమూహముయొక్క వెంద్రుకలచే వ్యాపింపబడిన భూమి, దర్భలతో గూడిన వేదికవలె నుండెను. దుర్మార్గులును, క్రూరకర్ములును నయిన పదునాల్గువేల మంది రాక్షసులను పాదచారియు, ఒంటరివాడును, నరుడును అయిన సద్బుద్ధిగల రాముడు పరాక్రమముతో చంపెను. యుద్ధమునకు వచ్చి ఆ రెండుపక్షముల సైన్యమునందు నప్పుడు ప్రాణముతో ఖరుడు, త్రిశిరుడు, శత్రుసంహారుడగు రాముడు మాత్రమే యుండిరి. తక్కినవారందఱు నశించిరి.

# ఇరువది యేడవ సర్గము

## త్రిశిరుడు శ్రీరామునితో పోరి చచ్చుట

ఖరుడు వారందఱట్లు చచ్చిపోవుటను చూచి, రామచంద్రుని నెదిరించుటకు వెళ్లబోగా, సేనాపతియగు త్రిశిరుడు అడ్డమువచ్చి, ఇంద్రుని మర్దించిన వాడా! నేనుండగా పగవానిపైకి నీవు వెళ్ళుట న్యాయమా? ఆ రాముని గీముని పట్టుకొని నిమిషములో నా బాణములతో చంపివైచెదను. నా వింటిపై శపథము చేసెదను. నీవు నిలుచుండి చూచుచుండుము. అతనికి నేనో, నాకతండో యముడయ్యెడు గాక. రామునినేను చంపినచో చూచి నీవు సంతోషముతో ఇంటికేగుము. ఒకవేళ నేను మృతిచెందినచో, నీవు అతనిని యుద్ధరంగమున బట్టుకొని యతని ఔద్ధత్యమును నణగింపుము. అనగా, ఖరుడట్లే కానిమ్ము. పొమ్మనగా, మూడు శిఖరములు గల్గిన పర్వతమువలె రథమునెక్కి వెళ్లి, త్రిశిరుడు రామునిపై కఱకుబాణములను భోరున వర్షముగురిసినట్లు వేసి, రోషముతో నీటిచే తడిసిన దుందుభివలె గర్జించుచు నిలవగా, రాముడు వింటినూపుచు, కఠినమైన బాణములను త్రిశిరునిపై వేసెను. అంత నతడును తీవ్రమైన కోపముతో చెలరేగగా, అప్పుడా దశరథనందనునకును, సురవిరోధికిని అద్భుతమైన యుద్ధము మహా తీవ్రముగా సింహగజేంద్రుల యుద్ధమువలె సాగెను. ఆ త్రిశిరుడు నివారింపరానివిధముగా మూడుబాణములను రాముని ఫాల భాగమునందు గ్రుచ్చగా కోపించి, రఘురాముడిట్లనెను.

రాక్షసాధమా! నిన్ను మెచ్చితిని. శూరుడవు నీవు. నా నొసటియందు మెత్తని పువ్వులవలె బాణములను గ్రుచ్చితివి. ఇదిగో నా శరములను గూడ నీవు పుచ్చుకొనుము అనుచు, వాని హృదయమందచ్చుపడునట్లుగా పదునాల్గు బాణములను నాటి నాల్గుబాణములచే గుఱ్ఱములను, ఎనిమిది బాణములచే సూతుని, ఒక్కబాణమున టెక్కెమును త్రుంచి, నేలపై కురికిన రాక్షసుని గుండె వ్రయ్యలగునట్లు తీవ్రమైన బాణజాలములను వేయగా, అతడు చేష్టలుడిగి, చేతులు తెగి, తలతెగి నేలబడి చచ్చెను. అతడు పడిపోవుటను జూచి, ఖరుని సేవించియున్న రాక్షసులతిభయముతో పెద్దపులిని జూచిన లేళ్ళవలె అన్ని దిక్కులకు పారిపోయిరి. ఆ భయపడి పారిపోవువారినందరిని తిరిగి రప్పించుకొని, ఖరుడు తీవ్రమైన కోపముతో చంద్రునిపట్టు రాహువువలె ఆ దశరథపుత్రు నెదుర్కొనుటకై వెళ్లెను.



# ఇరువది యెనిమిదవ సర్గము

## ఖరుడు శ్రీరామునితో రణమొనర్చుట

యుద్ధమందు దూషణత్రిశిరాదుల పాటు జూచి, గుండెజల్లుమనగా, ఖరుడు ఔరా! యిదేమి పరాక్రమము! గొప్ప విక్రమముగల పదునాల్గువేల మందిని, ఎదురులేని బలవంతులను, దూషణుని, త్రిశిరుని వదలక రాముడొక్కడే ఖండించెను. ఇదియేమి భీమబలము! అయినను కానిమ్ము. చూచెదను గాక. అనుచు ఇంద్రుని సముచి ఎదుర్కొన విధము స్ఫురించినట్లు రామునితో సర్పసమూహములైన బాణములను కుప్పలుకుప్పలుగా వేసి, నారిని మ్రోయించుచు, తన అస్త్రశస్త్రసామర్థ్యమంతయు తెలియునట్లుగా ఖరుడు యుద్ధము చేసెను. సకల దిక్కులు నిండునట్లు గొప్ప శాస్త్రాస్త్రములను కనుబొమ్మలు ముడివేసి, రామునిపై గురితప్పక ఖరుడు కురిపించగా, రాముడును కొంచెమైనను వికలత్వమును జెందకుండ, తన బాహుపరాక్రమము ప్రకాశించునట్లు, భరింపరాని నిప్పురవ్వలు గ్రక్కుచున్న బాణములను వేగముగా ఆకాశమున కొంచెమైన అవకాశము లేనట్లుగా కురిపించగా, బాణసమూహములు కప్పుటచే సూర్యుడు కనబడడయ్యెను. అట్లు నొకరినొకరు జయింపవలెనను కాంక్షచే, రాముడును, రాక్షసరాజును పోరుచుండగా, నిశితమైన బాణసమూహములతో ఖరుడు కౌశల్యాతనూజుని, అంకుశము మదపుటేనుగును వలె నొప్పించెను. ఇట్లు నొప్పించి యుగాంతకాల యముని తలపించుచు నిల్చి, రాక్షసులతో ఈ రాముడు యుద్ధముచేసి, ఇంచుకంతయైనను డలసిపోవడే యనుకొనుచుండగా సింహపరాక్రముడైన ఖరుని, రాముడు సింహము అల్పమైన జంతువును జూచినట్లు జూసెను. ఆ యల్పుడు సూర్యసమానమైన బంగారు రథము మీదనుండి వింటిని గిరగిరా త్రిప్పుచు, పాశమును ధరించిన యమునివలె రాముని నెదుర్కొనెను.

## ఖరుడు శ్రీరాముని కవచమును భేదించుట

దావాగ్నిలోనికి ప్రవేశించు మిడుతవలె, రాముని నెదుర్కొని విల్లు వేగముగా కరలాఘవము గనిపించునట్లుగా త్రిప్పుచు, దృఢముష్టితో లాగి, వాడి బాణములను ప్రయోగించుచు, సూర్యునివలె వెలుగొందు ఏడుబాణములతో రఘురాముని కవచమును నేలబడవేసెను. అట్లు కవచమును నిలబడవేసి, ప్రళయకాల భీకరగర్జనలను చేయుచు, వాడి బాణములను లెక్కలేనన్నింటిని వేయగా, రాముడు ఖరాసురిని బాణములచేత కొట్టబడినవాడై, రోషదీప్తుడై, యుద్ధరంగమందు పొగతోలగిన యగ్నివలె వెలిగెను. కోపమే రూపమును దాల్చినదా యనునట్లుగా, ఖరుని రూపుమాపదలచి మునిచే నొసంగింపబడిన వైష్ణవచాపము ధరించి, సీతానాథుడు బాణములతో ఖరుని టెక్కెమును భూమిమీద పడవేయగా, యది దేవతల యాజ్ఞచే వచ్చుచున్న సూర్యుడో యనునట్లు నేలపై బడెను. యుద్ధమర్మములు తెలిసిన ఖరుడు వాడిబాణములచే రాముని మర్మాంగములు నొచ్చునట్లు వేసి, నాలుగు బాణములచే అతనిని రక్తసిక్తంగుని చేయగా, రాముడాఖరుని మూర్ధము నొకబాణముచేతను, బాహువులను రెండుబాణములచేతను, రొమ్మును మూడుబాణములచేతను గ్రుచ్చెను. తిరిగి పదమూడు బాణములను ఎక్కుపెట్టి విరోధి గర్వమణగునట్లుగా ఒకబాణముచేత కాడిని, నాలుగు బాణములచేత గుఱ్ఱములను, ఒకబాణముచే సుతుని, మూడుబాణములచేత నొగలను, రెండుబాణములచేత అక్షమును వేగముగా త్రుంచివేసి, క్రోధముతో, పంద్రెండవ బాణముచే అవలీలగా బాణములతో గూడిన వింటిని త్రుంచేను. సీతాపతి పదమూడవ బాణముచే ఖరునియొక్క శరీరమును చీలికలగునట్లు చేయగా, ఖరుడు సారథి, గుఱ్ఱములు చచ్చుటచే, గదను చేబూని, రథమునుండి భూమిమీదకు దుమికెను. ఆశ్చర్యమును గలుగచేయు కౌసల్యానందనుని చరిత్రమును జూచి, ఆకాశవీధియందు సంతోషముతో పొంగిపోవుచు, దేవతలు మంచి మనస్సులతో ప్రశంసించిరి.

# ఇరువది తొమ్మిదవ సర్గము

## ఖరుని శ్రీరాముడు నిందించుట

గదను చెరగొని నిల్చియున్నఖరుని జూచి, జానకీనాథుడు మెత్తగా గుండెలు పుండ్లుపడునట్లుగా నిష్ఠురములగు మాటలతో నిట్లనెను. ఓ రాక్షసాధమా! రథములను, గుఱ్ఱములును, ఏనుగులను ఎక్కువుగా కూర్చుకొని గర్వము నొందినవాడవై, దాయలేక లోకముచేత దూషింపబడు, దుష్టములగు పనుల నెన్నింటినో చేసితివి. ప్రజలకు కష్టమును గలుగచేయుచు పాపకార్యములను చేయువాడు పరమేశ్వరుడయినను ఆపదను తప్పక పొందును. ఓ పాపాత్ముడా! నీవిధంబిక చెప్పుటకు వీలున్నదా? లోకవిరుద్ధమైన పనిని తలపెట్టి చేయుచు, దుష్టబుద్ధియై పొగరుతో సంచరించు పాపాత్ముని పొగరణచుటకై అందఱును ప్రయత్నించెదరు సుమా. ఇంట ప్రవేశించిన పాము విధమున ధూర్తుడు తన లోభకామములవలన సంభవించిన పాపముచేత వడగండ్లను దిన్న నలిగండ్ల పామువలె చెడిపోవును. ఓ హీనరాక్షసా! దండకాటవిలో సంచరించు సజ్జనులైన మునిశ్రేష్ఠులను, ధర్మనిరతులను అడ్డులేకుండగా వేడుకగా చంపి చంపి, ఏమి ఫలమును పొందదలచితివో? ఓ దురాత్మా! మొదలుచెడిన వృక్షమువలె దుష్టుల సంపద ఎక్కువకాలము నిలువదు సుమా. ఆయా ఋతువులు రాగానే, చెట్లు, పువ్వులు పూయువిధముగా, మానవుడు ఔద్ధత్యముతో తానుచేసిన పాపముల ఫలములనతడే ఆయా వేళయందు తప్పక అనుభవించును. విషము కలిపిన అన్నమును భుజించిన వాని విధమున పాపఫలితములగు కష్టములను పాపాత్ముడెట్టైనను వేగముగా అనుభవించును. పాపఫలితమెప్పుడు వ్యర్థముగా పోదు. ఓ రాక్షసా! పాపములు చేయు పాపాత్ములను, లోకమునకు కీడుచేయు

వారలను సంహరించుటకై రాజుయొక్క ఆజ్ఞపొంది వచ్చినాడను. పాములు పుట్టలోనికి ప్రవేశించునట్లుగా, నా బాణములు నీ శరీరమున బ్రవేశించి, సైన్యము, మిత్రులు మున్నగువారితో గూడ నిన్ను, నీవు ముందు చంపిన మునిశ్రేష్ఠుల వెంబడి కాపుగా పంపించెదను, రమ్ము. నీ శరీరమునందలి కండకావరమును ఇప్పుడిచ్చట చూపించుము, చూచెదను. నరకమును పొందునట్లుగా యుద్ధభూమియందు నా తీవ్రమైన బాణములచేత చచ్చిపడియున్న నిన్ను, దుర్మార్గముగా నీచేత చంపబడిన మునులు విమానములమీద యున్నవారై గొప్ప సంతోషముతో చూచెదరు. తాటిపండువలె నీ శిరస్సును పడవేసెదను. నీబలమెంతయో చూపించుము, అని తనని గూర్చి పలుకుచున్న రామనరేంద్రుని జూచి, కోపముచే ఎఱ్ఱనైన కన్నులు గలవాడై, ఖరుడు నవ్వుచు, నిట్లనెను. చచ్చుమూకను చంపినంతనే కన్నులు కనిపించక, గర్వముతో నిన్ను నీవే మెచ్చుకొనుటచే కీర్తిగలుగునా? వినుము. ప్రగల్భములను బలవంతుడు చెప్పునా? పౌరుషముగల బలవంతుడెక్కడనైన తాను చేసిన పనులను తానే పొగడ్తలతో చేప్పికొనునా? నీచులైన రాజులు నీవలెనే నిరర్థముగా ప్రగల్భములు పల్కుదురు. తాను మహాకులమునందు జన్మించితినని చాటుకొనుచు అనవసరముగా ఏమనుష్యుడు మృత్యుకాలమున తనను పొగడుకొన నంగీకరించును. దర్భచివరనున్న అగ్నివలె నిన్ను నీవు పొగుడుకొనుటచే ఇప్పుడు నీయొక్క లఘుత్వము తెలిసినది. గదను చేతబట్టుకొని నిలబడగా ధాతువులచే వ్యాపింపబడినదియు, కదల్చరానదియు అగు పర్వతములవలెనున్న నన్నిక్కడ చూచుటలేదా? పాశమును చేతబట్టిన సూర్యపుత్రుడగు యముడు, లోకముల్లెల నశింపచేయు విధముగా ఈ గదాఘాతాముచేత నిన్ను ఇప్పుడే చంపగలవాడను సుమా. ఓ సత్వహీనుడవగు రామా! చూడుము. నిన్ననవలెనన్నచో అనేక విషయములున్నవి. వానిని జెప్పబూనను. సూర్యుడస్తమించే వేళయ్యెను. సూర్యాస్తమయమైనచో యుద్ధమునకు విఘ్నము కలుగును. చనిపోయిన రాక్షస సమూహామునకు వేగముగా నిన్నుచంపుటచే, కన్నులనీరు తుడవవలసిన యుత్తమ కార్యమున్నది. మాటలతో నేమిప్రయోజనము.

# ముప్పదియవ సర్గము

## శ్రీరాముడు ఖరుని గదను ఖండించుట

అని పల్కుచు, గదను చేతితో త్రిప్పి, రామునిపై పిడుగునువలె వేయగా, అది గొప్పగొప్ప చెట్లను, తెగపొదలను నాశనము చేయుచు రాగా, ఆకాశమునందే రామచంద్రుడు గొప్పగొప్ప బాణములచే వేగముగా సర్పమును మంత్రముల శక్తిచేతవాలె చిన్నచిన్న ముక్కలగునట్లు పాడనేసెను. ఇట్లు పడనేసి, దిగ్భ్రమ చెంది, భయపడుచున్న ఆ దుర్మార్గునితో ధర్మాత్ముడగు రాముడు నిట్లనెను. ఏమేమో ప్రేలితివి. నీ బలమును చూపితివి. ఇంతమాత్రమునకే ఓ నీచుడా! ప్రగల్భములు పలికితివి. నా బాణముచే ముక్కలై భూమిమీద పడియున్న నీగదను చూడుము. మాటలతో గొప్పలు చెప్పువాడా! తొందరగా రమ్ము. చచ్చిపోయిన రాక్షసుల కన్నీరు తుడిచెదవని నీవు పలికిన మాటలు వట్టివని యిప్పుడే తెలిసినదిగదా, చూచితివా. చరిత్రహీనుడా! గరుత్మంతుడమృతమును గ్రహించినట్లు, నా బాణములివిగో నీ ప్రాణములను హరింపగా, నురుగుతోనున్న నెత్తుటిని పీల్చుటకై భూమి తపించుచున్నది. శరీరము మట్టికొట్టుకొని నీయొక్క బాహువులను భూమిమీదకు చాపి, దుర్లభురాలైన కాంతను గాఢముగా కౌగిలించుకొనినట్లు, నేలమీద అంటుకొనునట్లుగా దీర్ఘనిద్రపోయెదవు. అప్పుడు పుణ్యవంతులగు మునీంద్రులు గుండెలమీద చేతులుంచుకొని నిద్రించెదరు. ఓ రాక్షసుడా! నాయొక్క బాణపరంపరలచేత జనస్థానమిప్పుడు వ్యాధిష్ఠానమౌట చేత, మునులసమూహములు భయములేక ఈదండకాటవియందు

సంచరించెదరు. అందఱను భయపెట్టునట్టి రాక్షసులు, దిక్కులేక భయముతో, నాల్గుదిక్కులకును పరువెత్తెదరు చూడుము. నీకుతగిన వారలయిన నీ భార్యలు కన్నీళ్లచే తడసిన, చిన్నబోయిన మొగములతో ఇట్టి భర్తని నిన్నుచేసుకొనుటచేత ఇటువంటి దుఃఖమును పొందుచున్నామని తెలుసుకొని, కామసౌఖ్యములకు దూరమైనవారై, నిరర్థకమైన జీవితముగలవారగుదురు. రాక్షసాధమా! ఓరీ పాపాత్మా! నీచుడా! వినుము. ఓరీ దుర్మార్గుడా! విప్రులను భాదించినవాడా! క్రూరమైన బుద్ధిగలవాడా! మీవలన కలిగిన భయముచేత, మునిశ్రేష్ఠులు తాము హవిస్సునగ్నియందు వేయుదాక ఏమి విఘ్నము కలుగునో యని సంశయముచేత మాటిమాటికి భీతిల్లేదరు. ఇకముందట్టి చేష్టలు సాగునా? అనగా విని, అతి కఠినమైన మాటలతో ఖరుడిట్లనెను. ఓరి మనుజాధమా! ప్రాణములుపోవు సమయముగూడ గర్వమును పొందుచున్నావు, నీవెట్టి మనుష్యుడవో గదా! కాలము తీరినవాడు ఇది అనవచ్చును. ఇది అనరాదని తెలిసికొనగలడా? బుద్ధిశక్తి నశించి, ఆ ఇంద్రియములయొక్క పట్టు తప్పుటచేత, ఇది మంచిపని, ఇది మంచిపనికాదు, అని తలంపజాలడు కదా. రామా! నీవిధమిట్లే తోచు చున్నది. అనిపలికి, నాలుగుదిక్కులు పరికించి చూచి, దగ్గరనున్న పెద్ద పర్వతమును మొదలంట పెల్లగించి, కనుబొమ్మలు నాట్యముచేయుచుండగా, రివ్వురివ్వున వేగముగా త్రిప్పి, నెత్తురులుగారునట్లు పండ్లచే పెదవిని నొక్కిపట్టి గురిచూచి విసురుగా, ఓ మనుజాధమా చచ్చితివిగా, అనుచు వేయగా

### ఖరుడు శ్రీరామునిచే హతుడగుట

ఆవచ్చుచున్న కొండనుజూచి, రఘురాముడు తీవ్రమైన బాణసంఘముచేత చిన్నచిన్న తునకలై పడునట్లుగా పరాక్రమముతో త్రుంచివైచి, ఈ పాపాత్ముడు ఇంతమాత్రముచేత పోడని తలంచి, తీవ్రమైన క్రోధముపొంది, శరీరమునందు

చెమటలుకారగా, కన్నులెఱ్ఱవడగా, భయంకరములైన బాణముల సమూహము లచే వాని శరీరము చిల్లులు పడునట్లు వేగముగా వేయగా, నెత్తురులు సెలయేరువలె అధికముగా స్రవింపగా, బాధను భరింపలేనివాడై, మత్తు ఆవరించగా, యుద్ధకుశలుడగు రామునిమీద పడుటకై సాహసముతో ఱివ్వనరాగా, నెత్తురులు చిప్పిలుచున్న శరీరముగలవాడై, ప్రకాశముచేత బ్రహ్మదండముకంటె గొప్పనయినదియు, అగ్నివలె నున్నదియు, భయంకర మైనదియు, ఇంద్రదత్తమయినదియు యగు శరమును వేయగా, అది పిడుగువలె దిగంతములను మారుమ్రోగించుచు వెళ్లి ఖరుని హృదయమున తగులగా, అతడు శరీరమంతయు దగ్ధమై త్రిపురాంతకునిచేత దహింపబడిన అంధకాసురుని వలె నేలగూలెను. నురుగు చేత నముచి వలెను వజ్రాయుధపటంచుచేత వృత్రబలుల వలెను, శ్రీసీతానాధుని బాణములచేత రాక్షసాగ్రేసరుడు భస్మమై నేలగూలెను.

## మహర్షులు శ్రీరాముని బ్రశంసించుట

అంత గుంపులు గుంపులుగా గూడి, ఆత్మజ్ఞానులగు రాజర్షులు, మునీశ్వరులు, గౌరవముతో రాముని సమీపించి యిట్లనిరి. ఓ మహాత్మా! నిన్నీప్రాంతమునకు పంపుటకే ఇంద్రుడానాడు శరభంగుని జూడవచ్చెను. ఆ మహర్షులందఱు నుపాయముతో నిన్నిక్కడకు పంపిరి. దుర్మార్గులైన రాక్షససంఘములను చంపించుటకై నిన్నిటకు రప్పింపవలసి వచ్చెను. మాపనులన్నియు తీరినవి. నీపేరుని చెప్పికొనుచు హాయిగా స్వధర్మములను జరుపుకొనుచు తండ్రీ! మునులీదండకాటవియందు ధర్మము వృద్ధిచెందునట్లుగా స్వేచ్ఛగా సంచరించెదరు. అని చెప్పుచుండు నంతలో చారణులు మొదలైన వారలతో దేవతలు, రామజననాథునిపై గొప్ప పువ్వుల వానను గురిపించిరి.

దుందుభి నినాదములు ఆకాశమంతయు నిండెను. ఔరా! ఏమి పరాక్రమము! అరరే ఏమాబాల సామర్థ్యములు! అయ్యారే! ఈ పదునాల్గువేల రాక్షస సమూహములు తన్నెదిరింపగా, ఈ శ్రీరాముడు పదాతియు ఒంటరివాడునైనను భీకరాకారుడై, వారినెల్ల మూడుఘడియలలో చంపివేసెను. చూడగా, ఈతడు సాక్ష్యాత్తు శ్రీమహావిష్ణువే అగును.

**సీతాలక్ష్మణులు శ్రీరాముని చేరవచ్చుట**

అని పొగుడుచు, చూడవచ్చిన దేవతలందఱు తమ దుఃఖము తీరగా, సంతోషముతో తమతమ నెలవులకు వెళ్లిరి. అంత జానకితో గలసి, లక్ష్మణుడు రామునికడకు వచ్చెను. రాక్షసులను జంపి విజయమునుబొంది, మునిసంఘములు పూజించుచుండ లక్ష్మణుడు వెంటరాగా, ఏనుగువలె నడుచుచు, అపరిమిత పరాక్రమశాలియగు రాముడు, తనయాశ్రమమును చేరనరిగెను. అంత జానకి రాక్షసహంతయు, పరమర్షులకు సుఖము గలుగచేసినవాడును అగు తన భర్తను గాంచి, సంతోషముతో కౌగిలించెను. పరాక్రమమున పేరుపొందిన ఆరాక్షసులను చంపి మునులచేత పొగడబడుచు చెక్కుచెమర్పని ఆరాముని జనకరాజపుత్రి మరింత గాఢముగా కౌగిలించుకొనెను.



# ముప్పది యొకటవ సర్గము

## అకంపనుడు రావణునకు ఖరాదివధ వృత్తాంతము చెప్పుట

అచ్చట అకంపనుడను రాక్షసుడు, వేగముగా జనస్థానమునుండి బయలుదేరి లంకాపట్టణమును బ్రవేశించి, లంకాధిపతియైన రావణుని జూచి, ఓ రాజా! జనస్థానముందున్న రాక్షసులు, ఖరుడు మొదలుగాగల వారందఱును యుద్ధరంగమునందు చంపబడిరి. ఎట్లెట్లో నేను ప్రాణములను దక్కించుకొని ఈ వార్తను చెప్పుటకు వచ్చితిని. అని చెప్పగా, దశాననుడదరిపడి కన్నులనుండి నిప్పులు రాలుచుండగా, అతనితో నిట్లనెను. ఎవడురా? నాసుందరమైన జనస్థానమును నేడుపడగొట్టినవాడు. వాడింక నెట్టిలోకమునందు బ్రదుకగలడు? నాకేదైన నపకారముచేసినచో ఇంద్రయములను, కుబేరుడును, విష్ణువును సుఖముగా నుండజాలరు. ఇది నిక్కము. దండధరుడైన యముని దండింతును. అగ్నియొక్క వేడిని చల్లార్చెదను. మృత్యుదేవతను వధించెదను. గాలిని బంధింతును. సూర్యుని కాల్చివేసెదను. అనగా, అకంపనుడు భయమునొంది ప్రభూ! నాకభయమిచ్చెదవేని నిజమును చెప్పెదననగా, రావణుడు నీకభయ మిచ్చితిని. మనస్సున జంకులేకుండ ఇంక చెప్పుము అనగా, అకంపనుడు చేతులను మోడ్చి, భయభక్తులతో రాక్షసాధిపతితో నిట్లనెను. మంచి పొడవైన, గుండ్రనైన చేతులు గలవాడును, సాటిలేని బలముగలవాడును, ఎద్దుమూపురము వంటి భుజములు గలవాడును, చంద్రబింబము వంటి ముఖము గలవాడును, గొప్ప కీర్తిగలవాడును, బాణాగ్నిజ్వాలవంటి ఆకృతిగలవాడును, పరాజయములేని

విక్రమముగలవాడును అగు దశరథనందనుడు రాముడనువాడే ఖరదూషణ సహితముగా జనస్థామును పాడుచేసెను అనిచెప్పగా విని, పెద్దపామువలె ఆ దానవరాజు రొప్పుచు నిజము చెప్పుము. అక్కడికి యుద్ధమునకు రామచంద్రుడు ఇంద్రాది దేవతాసహితుడై వచ్చేనా? అనగా..

**అకంపనుడు రావణునకు రాముని పరాక్రమము చెప్పుట**

అకంపనుడు రావణునితో తేజోబలవిక్రమముల విధమంతయు గర్వము విడిచినవాడై, యున్నదియున్నట్లుగా నిట్లుచెప్పదొడగెను. విల్లు పట్టెడువా రందరిలోను గొప్పవాడు. అనేకమైన దివ్యాస్త్రసంపదను పొందినవాడు. యుద్ధమందు ఇంద్రునంతటివాడు. దివ్యమైన పరాక్రమము గలవాడు రాముడను పేరుగలవాడు. ఆతని తమ్ముడు శక్తియందతని యన్నతో సమానమైనవాడు. దుందుభి ధ్వనివంటి కంఠధ్వని గలవాడు. ఎఱ్ఱదామరలవంటి నేత్రములు గలవాడు. పద్మమువంటి ముఖముగలవాడు. లక్షణుడను పేరుగలవాడు. అన్నకు ఎల్లప్పుడు మిక్కిలి ప్రియమైనవాడు. అగ్నికి వాయువువలె తోడ్పడువాడు. ఆ రామునివలననే దండకాటవియందు మన స్థానమును చెడిపోయెను. దేవతలు యుద్ధమునకు సహాయులై రాలేదు. ఇంద్రుడును రాలేదు. ఆరాముడొక్కడే క్రూరమైన వాడి బాణములచే రాక్షససమూహము నెల్లను చంపెను. బంగారపు పింజలుగల బాణములు వింటినుండి వెలువడి, ఐదుతలల విషసర్పములై వచ్చి, రాక్షసశ్రేష్ఠులను యుద్ధరంగమున తినివేసెను. ఏయేవిధమైన ఆలోచనతో ఏయేతోవలందు విరోధులు పారిరో, ఆయా త్రోవలలో రాముడు యుద్ధమందు వారికి కనిపించెను. ఈ విధముగా జనస్థానము పాడుపడెను. అనగావిని, రావణుడు రోషముతో గూడిన ముఖంతో, నేనిదే ఆ మనుష్యులను బట్టి హింసించుటకై వెళ్లెదననెను. అనగా, అకంపనుడు ఇట్లుచెప్పెను. ఓ అసురేంద్రా! ఆ రాజుయొక్క ప్రఖ్యాతమైన పరాక్రమములను వినుము. అతనికి కోపము

వచ్చినచో రాముడు సాధ్యము కానివాడు. నిండుగా పారుచున్న నదినైనను గొప్ప బాణపంక్తులతో అడ్డుకట్ట గలవాడు. చుక్కలతో, గ్రహములతో గూడిన ఆకాశమునైనను బాణములతో రఘురాముడౌద్ధత్యముతో బగులగొట్టెను. అతడైశ్వర్యవంతుడు. భూమినుద్ధరింపగలవాడు. సముద్రము యొక్క తీరనియమము అతిక్రమింపజేసి, వేగముగా జగత్తునంతయు సముద్ర జలములచే ముంచగలవాడు. సముద్రుని గర్వము మొలముట్టుగా హరింప గలడు. బాణములచేత గాలిని వీచకుండ జేయగలడు. గొప్ప పరాక్రమముచేత అమితమైన కీర్తిగలవాడు. అతడెల్ల లోకములను సంహరించి మరల సృష్టి చేయగలవాడు. ఆమానవసింహుడీప్రజలనట్లే సృజించును. నీకామానవనాథుడు సాధింపరాని వాడని నాయుద్దేశము సుమా. ఓ పంక్తికంఠా! నీవే అననేల? లోకములోనున్న రాక్షస సమూహమంతయును కలసినను, పాపకర్ముడు స్వర్గమును చేరజాలనట్లు అతనిని సమీపింపజాలరు. ఆరాజును చంపు నుపాయమును పరిపూర్ణమైన మనస్సుతో వినుము. చెప్పెదను.

**అకంపనుడు రావణునితో సీతాపహరణమే రామవధ కుపాయమని చెప్పుట**

ఓ రాక్షసరాజా! యేమని చెప్పుదును. రఘురాముని భార్య సీత. ఆమె త్రిలోకసుందరి. గజగమనము గలది. యౌవనముతో నొప్పుచున్నది. అనేక రత్నభూషణములు ధరించినది. ఆ సింహమధ్యకు సాటియైన వారు భూమియందు లేరుసుమా. దేవతలయందు గాని, గంధర్వులయందు గాని, అప్సరసలయందు గాని, రాక్షసులయందు గాని, జానకితో సమానమైన స్త్రీ లేదనగా, ఇంక మనుష్యకాంతలందు జెప్పనేలా? దేవేంద్రునితో నతులు గొన్నవాడా! ఆమెను నీవిచ్చటకు తీసుకొని వచ్చినచో, కాముకుడగు రాముడు భార్యనెడబాయుటవలన కలిగిన సంతాపాగ్నియందు పడి మృతుచెందుననగా, ఆ మాటలను విని, రాక్షసరాజిట్లనెను.

## రావణుడు మారీచుని జూడ నేగుట

కానిమ్ము అకంపనా! నేను తెల్లవారుచుండగనే వెళ్లి, భూపుత్రిని తెచ్చెదను. నీవింక సంతోషముతో బొమ్ము, అని పంపి, రాక్షసరాజు సూర్యునివంటి తేజస్సుచే సాటిలేనిదియు, గాడిదలు కట్టినదియు, శుభ్రముగా నున్నదియగు రథముమీద తానొక్కడే సూతునితో గూడ నెక్కి, కూర్చుండి బయలుదేరెను. ఆకాశమార్గమున వెళ్లుచున్న ఆ రథమప్పుడు మేఘముల మధ్యమందు ప్రకాశించుచున్న చంద్రమండల మనునట్లుండెను. అట్లువెళ్లి ఆ రథము తాటకాపుత్రుని ఆశ్రమమునందు దిగగా, మారీచుడెదురు వచ్చి, అర్ఘ్యపాద్యములిచ్చి పూజించి, రుచికరములగు సాటిలేని భక్ష్యభోజ్యములనిచ్చి, సంతుష్టునిగా చేసి, యిట్లనెను. రాక్షసరాజా! క్షేమమే గదా. రాక్షసులందఱును క్షేమముగా నున్నారా? నీవింత తొందరతో నిచ్చటికి వచ్చుటచే, ఏమియో పని కలదేమో యని మనస్సునందు సంశయము కలుగుచున్నది. అను మాటలను ఆలకించి, రావణాసురుడిట్లనెను. తండ్రీ! రాముడను మనుష్యుడొకడు రాక్షసకోటుల ప్రాణములు యుద్ధ నైపుణ్యముతో తీసి, జనస్థానమునంతయు పాడుపడజేసెను. అతని భార్యను అపహరించుటలో నీవు నాకు సహాయపడుము. ఆవిధముగ అతనిపై పగతీర్చుకొందును. అనగా.

## మారీచుడు రావణునకు శ్రీరామునితోడి విరోధము వలదని చెప్పుట

మారీచుడిట్లనెను. ఎవడురా నీకు అనుకూల శత్రువై జానకిని గూర్చి చెప్పినవాడు? ఎవడురా నీవు చెడిపోవుట కెదురుచూచుచున్నవాడు? భూపుత్రిని దెమ్మని జెప్పినవాడు? నీకు మేలుకోరువాడు కాదు సుమా. ముల్లోకములేలు వాడవైన నీకు లోలత్వముచే శృంగభంగము చేయదలపెట్టిన వాడెవ్వడు? ప్రసిద్ధమైన విషసర్పముయొక్క కోరలు పెరుకుటకు నిన్నెవడు ప్రేరేపించెను? ఇట్లు నిద్రించుచున్న నీతలనెవ్వడో తన్నెను సుమా. ఓ సురవైరీ! రాక్షసోత్తమా!

జగన్నుతమైన సద్వంశమున జన్మించుట యనెడు తొండము గలదియు, గొప్ప పరాక్రమమనెడు మదజలము గలదియు, తీక్ష్ణమైన భుజములనెడు దంతములు గలదియునయి శత్రుభీకరమై యొప్పుచున్న రాముడనెడు మదగజమును యుద్ధమున నెదుర్కొనుటకిప్పుడు పూనుకొనకుము. యుద్ధాగ్రమున నుండుటయే నడుమును తాకెడు తోకగా కలదియు, రాక్షససమూహమనెడు మృగములను జంపునదియు, గొప్పనైన బాణములనెడు గోళ్లుగలదియు, తీక్ష్ణమైన ఖడ్గమనెడు కోరలుగలదియు అయి బలాఢ్యమైన నరసింహమూర్తి నిదురపోవుచు మాగన్నుగా నుండగా, పట్టుదలగా నీవు దానిని లేపుట మంచిపనియా? ఆలోచింపుము. లంకేశ్వరా! ధనుస్సనెడు మొసలి గలదియు, భుజబలమనెడు పెనురొంపి గలదియు, తీక్ష్ణములైన బాణములనెడు అలలు గలదియు, గొప్ప యుద్ధమనెడు ప్రవాహములు గలదియునగు సీతానాథుడనెడు అగాధ సముద్రమునందు పడుట తగదు సుమా. లంకాధిపా! నన్ను క్షమింపుము. శాంతముతో లంకకు తిరిగి వెళ్లుము. నీ భార్యలతో కలసి సుఖింపుము. రాముడు ప్రేమతో జానకితో గలసి యడవులందు సుఖించును గాక. అని మారీచుడు తనకు బోధపరుపగా, సురవైరియగు రావణుడు సరేయని లంకాపట్టణమునకు వెళ్లి, సంతోషముతో తన మందిరమున ప్రవేశించెను.



# ముప్పది రెండవ సర్గము

## శూర్పణఖ లంకకేగి రావణుని జూచుట

పదునాల్గువేలమంది క్రూర రాక్షులతో, ఖరుడు, దూషణుడు, త్రిశిరుడు నొక్కరామునిచే యుద్ధరంగమందు చనిపోవుట చూచి శూర్పణఖ వగర్చుచు, గొప్ప ధ్వనితో నేడ్చెను. అనన్యసామాన్యమైన రాముని పరాక్రమమును చూచి, కలతచెందినదై, వేగముగా రావణునిచే రక్షింపబడుచున్న లంకాపట్టణమునకు వెళ్లి, పుష్పకవిమానాగ్రమందున్న వాడును, ప్రకాశమానమైన తేజస్సుగలవాడును, దేవతలచే కొలవబడుచున్న దేవేంద్రునివలె మంత్రియుక్తముగా యున్నవాడును, సూర్యసమానమైన బంగారు సింహాసనమునందు, బంగారపు వేదికయందు ప్రకాశించుచున్న అగ్నివలె నున్నవాడును, అఖిలమైన దేవతలు, గంధర్వులు, తాపసులు మొదలగువారిచే జయింపరానివాడును, యమునితో సాటివచ్చు వాడును, దేవతలకును, రాక్షసులకును జరిగిన సంగ్రామములందు, సాటిలేని తీవ్రతగల వజ్రాయుధము దెబ్బవలన గాయము గలవాడును, ఐరావత దన్తఘాతము చేత నేర్పడిన మచ్చగల యురము గలవాడును, పొడవైన యిరువది చేతులను, పదితలలును, వింజామరలు, తెల్లని గొడుగు, విశాలమైన యురము, రాజలక్షణములు గలవాడును, వీరుడును, స్వచ్ఛమైన వైఢూర్యమువలె ప్రకాశించువాడును, పెద్దముఖము గలవాడును, తెల్లని దంతములు గలవాడును, విష్ణుచక్రము మొదలైన అనేక సాధనములచేతను, ఇతర అస్త్రములచేతను కొట్టబడిన వాడును, దెబ్బలు తగిలిన సమస్త దేహభాగములు గలవాడును, కలతపెట్టరాని సముద్రసమూహములను సైతము కలతచెందించిన వాడును,

సమస్తములైన పెద్దకొండలను ఎగురుగొట్టిన వాడును, దేవతల సైన్యమును పారద్రోలిన వాడును, రాక్షసులందఱకును నాయకుడును, భయంకరుడును, పరభార్యలను కోరువాడును, సమస్త దివ్య శస్త్రాస్త్రములు గలవాడును, మునుల యజ్ఞములకు విఘ్నమొనర్చువాడును, భోగవతియందు సర్పరాజైన వాసుకిని యుద్ధమందోడించినవాడును, తక్షకుని గెలిచి అతని భార్యను హరించినవాడును, కైలాసపర్వతమందు కుబేరుని గెలిచి, పుష్పకవిమానము నాక్షణముననే తెచ్చిన మహాశూరుడును, నందనవనమందును, చైత్రరథవనమందునుగల సుందర సరోవరముల యందములను పూర్తిగా నాశనము చేసినవాడును, ఉదయించుచున్న సూర్యచంద్రులనాపగల బలశాలియు, లోకముల్లనియు హా! హా! యనునట్లు పదివేలయేండ్లు పూర్వము బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి, తన తలలుత్రెంచి, యర్పించి, పూజించి, ఆ నలువ చేత రాక్షసులచేతను, దేవగంధర్వపిశాచుల చేతను, పక్షులచేతను, సర్పములచేతను, మనుష్యులు తప్ప తక్కిన జాతులవారిచేతను యుద్ధమందు చావులేకుండ వరములను పుచ్చుకొని, యజ్ఞములను పాడుచేసి, హవిస్సులను హరించువాడును, బ్రాహ్మణహంతయు, దుష్టుడును, బాణమువలె కఠినుడును, దయారహితుడును, దుష్టకార్యములందాసక్తి గలవాడును, ఇంద్రశత్రుడును, సర్వభూతములను భయపెట్టువాడును, దేవలోకవాసులను హింసించువాడును, అట్టహాసము చేతనే దేవతాస్త్రీల గర్భస్రావము చేయువాడును, గొప్ప బాహుపరాక్రమముచేత విరుగగొట్టబడిన ఐరావతదంతములు గలవాడును, లోకములకు కీడు చేయుటయే ఇష్టముగా గలవాడును, కుటిలమైన నడవడి గలవాడును, రాక్షస కులవర్ధనుడును, ప్రత్యక్షలయకాలుని వంటివాడును, భూషణములచే అలంకరింపబడినవాడును అయిన తన యన్నయగు రావణుని జూచి, రాక్షసి యగు శూర్పణఖ భయముతో నిండినదై, యిట్లు పలికెను.

# ముప్పది మూడవ సర్గము

## శూర్పణఖ రావణుని నిందించుట

మంత్రులందఱును వినుచుండగా తనయవమానమును, దుఃఖమును రావణుడు చూచుచుండగా, దురాగ్రహమును పొందినదై, ఓరీ! మదించినవాడా! దుర్మదుడా! ఎల్లప్పుడును కామభోగములందు మునిగినవాడవై, వారించువారు లేనివాడవై, నిన్ను మ్రింగుటకు వేగముగా దరిచేరిన మృత్యువును చూడలేకున్నావు గదా. ఎల్లప్పుడును గ్రామ్యములైన భోగములయందు ఆశక్తుడైనవాడును, కామవృత్తులందనురక్తుడైన వాడును అగు రాజును లోకులు స్మశానమునందలి అగ్నినివలె గౌరవింతురా? మతిలేనివాడై రాజ్యకార్యములను చక్కగా తానే చూచుకొనని రాజు, తన రాజ్యము, తన సమస్తకార్యములు, తానూ పాడయి పోవును. వేగులవారివలన వార్తలను సంగ్రహింపక, పౌరసంఘములకు పలుమారులు దర్శనమీయక, చాటుమాటున నుండి కార్యావసరములందితరుల మాటలను నమ్ముచూ, స్వతంత్రముగా వ్యవహరింపని రాజును, బురదను ఏనుగులు విడిచినట్లుగా, ప్రజలు పరిత్యజింపకుందురా? తమతమ అధికారమును విడచి, తాము స్వతంత్రులుగాక రాజులు తమరాజ్యము నెవరిచేత పరిపాలింప జూచెదరో, వారిచేతనే క్రమముగా తమ ప్రభావము నశించిపోగా, సముద్రములో పర్వతములవలె మునిగిపోదురు. నీకపకారము చేయుటకు దేవతలు, రాక్షసులు నెల్లప్పుడు సందువెదకుచుండగా, చారులుగాని, విచారము గానిలేక బుద్ధిచంచలత్వముతో నుండు నీవు, ఎట్లింక రాజువై ప్రాణములతో ఈ భూమియందు నిలిచియుందువు? ఓ రాక్షసుడా! ఇంకనూ నీకు చిన్నతనము

పోలేదు. ఏమియు తెలివిరాలేదు. తెలియవలసినవి తెలియుట లేదు. ఇంకనీవు రాజువై ఎట్లు వృద్ధినందెదవో కదా. వేగులవారియందును, ధనాగారముల యందును, నీతిమార్గములందును, ఎక్కువగా పరులపై నాధారపడువాడు, ప్రాకృతజనులతో సమానుడు సుమా. దూరమందు జరుగు సంగతులను రాజు, చారులవలన తెలుసుకొనును గాన, అతనికి దూరదృష్టి యనుపేరు సార్థకముగా నుండును. అది నీయందు లేదు. ఈ విధముగా మంత్రివర్గము విడువక నిన్ను సేవించుచుండగా, సుఖమునకు అలవాటుపడిన నీవు, నీశత్రువులచే నీబంధువులకు నివాసమై, జనస్థానము నాశనమగుట నెట్లు తెలుసుకొనగలవు? యుద్ధరంగమున రాముడొక్కడే తన వింటిబలముచేత ఖరదూషణాదులగు నీ బంధువులతో సహ పదునాల్గువేలమంది రాక్షసులను జగద్వితముగా వినాశ మొనర్చెను. ఈ గొప్ప బలముగల రామచంద్రుడిపుడు నీసహోదరులను చంపెను. ఋషులకందఱకు అభయమిచ్చి రక్షించెను. నీ దండకారణ్యమును నిర్భయమొనరించెను. లోభిత్వముచే వేగులవారికి జీతములు నీయవు. మత్తుచే నిండినవాడవై, కార్యతంత్రములందు బుద్ధినశించినవాడవై, ఇతరులకు వశు డవై, క్రిందుమీదును తెలియనైతివి. నీదేశమునందిట్టి భయము పుట్టినను ఇస్సిరో! నీవించుకంతయు నెఱుగవు, నిన్నేమనవచ్చును? రావణా! జీతము తక్కువగా ఇచ్చు రాజును, క్రురాత్ముని, మదించినవానిని, గర్వితుని, మోసగానిని ఆపదలు ముంచివేసినప్పుడొకసైనికుడును ఆదుకొనడు సుమా. కారణము లేకుండ కోపించువాడును, గర్వముతో తననుతానే పొగడుకొనువానిని, అసభ్యుడును అగు రాజును, సేవకులును, అతని బంధువులును చంపివేయుదురు. కార్య తంత్రములను తెలివిగా నిర్వహించుకొనక, ఆపదలందు శంకచేత చలింపక నుండు రాజునకు, సంపదలన్నియు వేగముగా హరించుకొని పోగా, పలుచని గడ్డిపరకతో సమానుడై, దుఃఖమును పొందుచుండగా, వాని స్థితికి ఎల్లరును చులకనగా చూతురుగాని, దుఃఖింపరు. ఎండిన కఱ్ఱల వలనైనను,

మట్టిగడ్డలవలనైనను, ధూళివలనైనను, ఏయొక్క పనియైన నెరవేరునేమోగాని, రాజ్యపదవి నుండి భ్రష్టుడైనవాడు ఒక్కగవ్వకైనను పనికిరాడు సుమా. ఇది నిక్కము. నమ్ముము. కట్టివిడచిన వస్త్రమును, పెట్టితీసిన పువ్వులదండవలెను, రాజు రాజపదమునుండి భ్రష్టుడైనచో, అతడెంతటి వాడనైననుసరే, నిరర్థకుడగును సుమా. పొరపాటుపడిన బుద్ధిగలవాడయి, అన్నియు తెలిసినవాడై, ఇంద్రియములను జయించినవాడై, కృతజ్ఞుడై, దర్మశీలము గలిగిన రాజు, ఐశ్వర్యముతో చిరకాలము సుఖములను పొందును. కన్నులచే నిద్రించుచున్నను, నీతియనెడు కన్నులతో జూచుచు, కోపము, దయ ప్రకటించుచు, నీతిగా నడుచుకొను రాజును ఎల్లజనులును సేవింతురు. ఓ పిచ్చివాడా! వెదకి చూచినను నీయందట్టి లక్షణమొక్కటియును కనిపించుట లేదు. యుద్ధమున రాక్షసులు దండకాటవియందు సతమతమై అకాలముగా మరణించుట, చారులు లేకపోవుటచే నీవెఱుగవు. గొప్ప సౌఖ్యరసమున మునిగినవాడవై, నీమనస్సున శత్రువుల నుపేక్షించుచున్నావు. దేశకాలభేదములను తెలిసికొనలేవు. గుణదోషములను తెలిసికొను శక్తి నీకులేదు. కావున ఓ రాక్షసాధిపా! వేగముగా సంపదలను బాసి, దుఃఖములను పొందెదవు, చూడుము.



# ముప్పది నాలుగవ సర్గము

**త**నయొక్క దోషజాలములను చెప్పగా విన్న రాక్షసరాజు, ధన బల గర్వముతో నొప్పుచున్న రావణుడు, కొంతసేపాలోచించి, కన్నులెఱ్ఱవారగా, కఠినముగా పల్కుచున్న చుప్పనాతితో నిట్లనెను. సోదరీ! అచ్చట జరిగిన సంగతులన్నియు చెప్పుము. అని మరియు రాముడనెడువాడెవ్వడు? అతని పరాక్రమమెట్టిది? అతని రూపమెట్టిది? ఆ రాముడు దండకాటవికి వచ్చిన కారణమేమి? ఖరాది రాక్షసులనేమి యాయుధముతో చంపెను? చెప్పుమని యడుగగా, ఆ శూర్పణఖ భానువంశరాజైన రామచంద్రుని చరిత్రనంతటిని చెప్పదొడగెను.

## శూర్పణఖ రావణునితో శ్రీరాముని వర్ణించి చెప్పుట

పొడవైన చేతులు గలవాడు, వెడల్పైన కన్నులు గలవాడు, నారచీరలు, జింకచర్మము వస్త్రములుగా గట్టినవాడు, మన్మథసమాన రూపము గలవాడు. దశరథపుత్రుడైన రాముడు భయంకరమైన పరాక్రమము గలవాడు. బంగారపు తొడుగుగల వింటిని ధరించి, సర్పములనువలె బాణములను విడుచుచుండును. బాణములనెక్కుపెట్టుట గాని, వెనుకకులాగుట గాని, వదలుట గాని ఎట్లు జరుగుచున్నదో నేను తెలియలేనైతిని. పండిన పైరు వడగండ్ల వానచే నేలబడు రీతిగా, కూలిపోవుచున్న సైన్యమును మాత్రమే చూచుచుంటిని. అతని వేగమును, అస్త్రముల బలమును, వీర్యమును ఏమని చెప్పుదును. ఖరదూషణసహితముగా పదునాల్గువేల గొప్ప రాక్షస సైన్యమును, సరిగా మూడు ఘడియలలో అస్త్రములచే పాదచారియై యుండియే చంపివేసెను. దండకాటవిలోనున్న

ఋషులకందఱకు నభయమొసగెను. స్త్రీని చంపుటయా యని, సంశయించిన ఆ మహాత్మునిచే ఏవిధముగానో విడువబడి, బ్రతికి బయటబడి వచ్చితిని. ఆ రాముని తమ్ముడు లక్ష్మణుడనువాడు నివారింపరాని పరాక్రమము గలవాడు. గుణసంపదలో రామునితో సమానమైనవాడు. ఎల్లప్పుడును అన్నను అచ్చమైన భక్తితో సేవించువాడు. గొప్ప కోపముగలవాడు. యుద్ధమందు జయింపరాని వాడు. మంచి నడవడి గలవాడు. రామచంద్రునకు కుడిభుజము వంటివాడు. బ్రహ్మకి ప్రాణమైనవాడు.

## శూర్పణఖ రావణునితో సీతను వర్ణించి చెప్పుట

ఆ రామునియొక్క ప్రియభార్య అందమైన నడక గలది. గొప్ప కీర్తి గలది. అరటి బోదెల వంటి యూరువులు గలది. చంపక పుష్పము వంటి ముక్కు గలది. వెన్నెల వంటి నవ్వు గలది. అందాల భరిణ. చంద్రబింబము వంటి ముఖము గలది. భర్త యొక్క మనసెరిగి నడచునట్టిది. మేలిమి బంగారము వంటి మేని ఛాయ గలది. నల్లని గొప్ప జుట్టు గలది. గొప్ప నీతి గలది. సింహమధ్య . అన్ని లోకములచేతను పూజింపదగినది. సీతయను పేరు గలది. ఐశ్వర్యమునకు నిలయమైనది. అపర లక్ష్మి వలెను ఆ వనలక్ష్మి వలెను ప్రకాశించుచున్నది. దేవతాస్త్రీలను, కిన్నర స్త్రీలను, గంధర్వ స్త్రీలను చూచితిని గాని యిట్టి స్త్రీని చూచి యెరుగను. యక్షకాంతలను గంటిని. కింపురుష స్త్రీలను జూచితిని, రాక్షస స్త్రీలను జూచితిని. గాని రఘురాముని భార్య వంటిదై కన్నులకు పండువు సేయు కలువ కన్నుల స్త్రీని మూడు లోకములయందును నేను చూడలేదు, వినలేదు. ఆ గజగమన యొక్క అందమేమని చెప్పుదును. యవనికా సీత భార్య యగునో, ఆ యింతి యవ్వని సంతోషమున కౌగిట చేర్చుకొనునో, వాడు మూడు లోకముల యందు నా వాసవుని కంటే గొప్పవాడై వృద్ధి చెందును. ఆ స్త్రీ రత్నము సాటిలేని రూపము గలది. మంచి నడవడి గలది. యవ్వనముతో నిండినది. నీకు తగిన భార్య సుమా. సతులలో ఉ

త్తమురాలైన సీతకు నీవే తగిన పురుషుడవు. అని మీ యిద్దఱిని పోల్చి చూచి ఆ భూపుత్రిని తీసికొని వచ్చుటకై అక్కడికి వెళ్ళి తేరగా ముక్కు,చెవులు కోల్పోయితిని. నే నటునిటు తచ్చాడుచు ఆ సీత యొక్క సమీపమునకు వెళ్ళగా మోసమును గ్రహించి లక్ష్మణుడు దయలేనివాడై నేను మొఱ్ఱోయని ఏడ్చుచుండగా ముక్కు, చెవులు కోసివేసెను. నీవు వెళ్ళి నీ కన్నులారా ఆ విలాసవతిని , ఆ పూర్ణచంద్రుని వంటి ముఖము గల దానిని చూచినచో మన్మథుని యొక్క సేవకుడవై నీబెట్టును గిట్టును ఆ క్షణమునందే విడచిపెట్టుదువు సుమా. అధికమైన ప్రేమతో జానకిని భార్యగా జేసికొనుట నీకిష్టమైనచో లేలెమ్ము. జయము కొఱకై నీకుడి పాదమును లేవనెత్తుము. అచ్చటికిప్పుడే పోపొమ్ము. ఆ రఘూత్తములను యుద్ధమందు వధించి అనాథయైన సీతను తీసికొనిరమ్ము. ఆస్త్రీతో ఇష్టసుఖముల ననుభవింపుము. రావణా! ఆ రామునిచేత చచ్చిన ఖరుడు మొదలైన గొప్ప రాక్షసుల మీద నీకేమైనా ప్రేమయున్నచో వారందరికి అధికమైన సంతోషము గలుగునట్లు ఆ రామునిని అతని తోడివారలను చంపిరమ్ము. ఊ రాక్షసరాజా! నీకీవిధమిష్టమైనచో నీవిప్పుడే స్థిరబుద్ధిగలవాడవై అచ్చటకు వెళ్లుము. ఋషులను మర్ధించు రావణా! నీ బలమెంతయో ముందుగా ఆలోచించుకొని ఆపై బలాత్కారమూగా ఆరాజపుత్రికను దొంగలించుటకు ప్రయత్నింపుము. వెఱ్ఱివారివలె ఆ ఖరదూషణాది రాక్షసులందరును దండకాటవియందు చచ్చిన విధమును తలంచి చూచి ప్రతీకారము చేయుటకై ప్రయత్నించుము.



# ముప్పది యైదవ సర్గము

## రావణుడు రహస్యముగా మారీచాశ్రమమునకు పోవుట

అని చెప్పగా శరీరమును గగుర్పొడువ జేయు శూర్పణఖ మాటలను విని రావణాసురుడు తన మంత్రులతో నాలోచించి చేయవలసిన కార్య విధానమును నిశ్చయించుకొని మంత్రులకు సెలవిచ్చి పంపి తాను కూడ తన మందిరమునకు వెళ్ళి అచ్చట సందర్భమును తానాలోచించిన విధము నందు గల మేలు కీడులను వాని బలాబలములను అంత లోనే ఆలోచించి ఒక నిశ్చయమునకు వచ్చిన వాడై, మనస్సును స్థిరపరచుకొని, వాహనములుండు శాలకు వెళ్ళి రహస్యముగా సారథిని రథమును సిద్ధముచేయుమని ఆజ్ఞాపించగా అతడు వెంటనే రథమును సిద్ధము చేసెను. కోరినచోటులకు పోవునదియు, బంగారముతో చేయబడిన దియు క్రూరమైన పిశాచములుకల గాడిదలచే కట్టబడినదియు, మేఘధ్వని వంట ధ్వనిగలదియు నగు నా రథమున సముద్రమును సమీపింపగా తెల్లని గొడుగును చామరములును బంగారు మండలములును కదలుచుండగా నెక్కి స్వచ్ఛమైన వైఢూర్యముల వంటి కాంతిగలవాడు, ఇరువది చేతులు గలవాడు పదితలలు గలవాడునై మెరుపులతో కొక్కెరలతో కూడిన మేఘమువలెనొప్పుచు చూచువారలకు ఇంపుగొల్పునట్టి అలంకారములతో గూడిన వాడై భయంకరమైన పది శృంగములు కల పర్వతమువలె క్రూరచరిత్రుడగు మునికంటకుడు వెళ్ళెను. చల్లని శుభకరమైన నీటిచే పవిత్రము లయిన సరస్సులతోను, అనేక పుష్పములు

ఫలములు గల వృక్ష సమూహముతోను, యజ్ఞవేదికలతో గూడిన ఆశ్రమముల తోను, మద్ది, తాడి, చీకటి, కొబ్బరి, అరటి, కంది, పోక మొదలగు వృక్షములతో, నాగులు, గరుడులు, గంధర్వులు, కిన్నెరులు మొదలగు వారితోనూ, అతి తక్కువ ఆహారమునుగైకొను మునులతోను, కామమును జయించిన వారితోను, అజుల చేతను, వైఖానసుల చేతను, పవిత్రులయిన మాషవంశజులచేతను, సూర్యకిరణములే యాహారముగా గొను వాలఖిల్యుల చేతను సిద్ధుల చేతను, చారణుల చేతను, నిందియున్న సముద్ర తీరప్రదేశమును చేరెను. బాటలందు ఆటపాటలతో దేవతాస్త్రీలు విలాసములు చూపుచుండ, హంసలు, ఆడు క్రౌంచములు. ఇంపుగా చెవులపండువుగా స్వరసంచయము వినిపించుచుండగా, హారములు గలిగి మనోహరములై విశాలములై మంచువలె నిర్మలములై మనోహరములయిన గీతావాద్యములతో గూడియున్న దేవ విమానములు ప్రకాశించుచుండగా, అప్సరసలతోను, గంధర్వులతోను, తమతపోబలముచే లోకములను జయించిన ఘనులతోను రసము ద్రవించు మొదళ్ళుగల చందన అగురు వృక్షములతోనూ ముక్కునకు తృప్తినిచ్చు సువాసనలు వ్యాపించుచుండగా, కన్నులకింపుగూర్చు వనప్రదేశములు, చెవులకింపుగూర్చు జయజయధ్వనులు గలిగి హృదయ తృప్తిని గలుగజేయుచుండగా, ముత్యములు, పగడములు శంఖములతో గూడినవియు, నిర్మలములైన చెఱువుల అలలతో గూడినదియు, మిరియపు పొదలు గలదియు, రథములతో నిందియున్నదియు నాగపట్టణ సమూహము జూచూచు దేవనగర సమానమైన సుందరమైన సముద్రతీరమును గాంచెను. చూచి యచ్చట మేఘసదృశమై నూఱుయోజనముల వఱకు వ్యాపించిన కొమ్మలు గలిగియున్న పెద్ద మఱ్ఱిచెట్టును గాంచెను. పూర్వము గరుత్మంతుడు గజకచ్ఛములనాహారముగా గొనుటకై తనగోళ్లతో పట్టుకొని వచ్చి

ఆ మఱ్ఱిచెట్టు కొమ్మపై వ్రాలగా ఆబరువుచేత ఆ కొమ్మ భళ్ళున విరుగగా దానియందు వాలఖిల్యాదులు తపము చేయుచుండిరని దయ తలంచినవాడై ఆ కొమ్మను తనముక్కున గరచుకొని వేగముగా దానినిపట్టుకొని వెళ్ళుచు త్రోవలోనే ఒంటికాలితోడనే ఆహారమును భుజించి మానులను పంపి వారికి సంతోషమును గలుగజేసి నిషాదులున్న చోటును దానిని పడవేసి నాశనము చేసెను. ఆతడట్లు రెట్టించిన పరాక్రమముతో ఆకాశమునకెగిరి ఇనుపకిటికీలను పగులగొట్టి మణిమయమగు నింద్రభవనమును భేదించి అమృతమును హరించెను. అట్లు తాపసుల కాశ్రయమైనదియు, గరుడుని చిహ్నము గలదియు, సుభద్రయను పేరుగలదియు అయిన వటవృక్షమును చూచి రావణాసురుడు సముద్రమును దాటి ఆ అడవి యందొకచోట పవిత్రమైన వనమధ్యమందు మితముగా భుజించువాడును, చలించని యింద్రియములు గలవాడును, మృగచర్మమును ధరించినవాడును, జడలు గట్టిన తలగలవాడునునై నార చీరలు గట్టి తపస్సు చేయుచున్న తాటకాపుత్రుడైన మారీచుని దగ్గరకు వెళ్ళగా, మారీచుడు ఘనముగా ఎవ్వరును చేయని విధముగా పూజించి పవిత్రమైన ఉదకముచేతను, భోజనముల చేతను, తృప్తినొందించి రాక్షసరాజును జూచి రాజా! క్షేమము కదా. ఇంతలోనే మఱల వచ్చుటకు కారణమేమి అని యడిగెను.



# ముప్పది యాఱవ సర్గము

## రావణుడు మారీచునితో జనస్థాన వృత్తాంతము చెప్పుట

అనగా రావణుడిట్లనెను. తండ్రీ! నా మాటలను సవిస్తరముగా వినుము. నేనార్తుడనై వచ్చితిని. ఈ ఆర్తి చెందినవానికి నీవే గతివి మహాత్మా! ఓ రాక్షసేశ్వరా! నీ వెఱుగుదువు గదా! ఈ జనస్థానమునందు నా తమ్ములైన ఖరుడు దూషణుడు ప్రియ సోదరియైన శూర్పణఖయు, శూరుడైన త్రిశిరుడును మొదలుగా గల గొప్ప తేజస్సు గల వారు పదునాలుగువేల మంది రాక్షసులు సుఖముగా నా ఆజ్ఞతో నివాసముగా నుండి ధర్మాత్ములను అవమాన పరచుచుండ అచట అట్టి వారప్పుడు క్రోధమును పొందినవారై అనేకాయుధ సమేతులగుచు కలిసికట్టుగా రామునిపై తలపడగా కోపించినవాడై ఒక్క పరుషమైన మాటనైనను మాటాడక నిశితమైన బాణములను వింటిని గొని వేగముగా పదునాలుగువేల మంది రాక్షసులను, త్రిశీర్షాదులను మనుష్యుడైన రాముడొక్కడే పాదచారియై చంపెను. బలవంతుడైన ఖరుని, ఇంద్రారియైన దూషణుని వరుసగా చంపివేసెను. దండకాటవిని భయారహిత మొనర్చెను. తండ్రివెడలగొట్టగా భార్యతో గూడ అడవులను బట్టి దుఃఖించు రాజాధముడు దుష్టశీలము గలవాడు, శౌర్యముగలవాడు, న్యాయము లేనివాడు, ఇంద్రియనిగ్రహము లేనివాడు, దయారహితుడు, ప్రాణులకపకారము చేయుటయందాసక్తి గలవాడు, ధర్మరహితుడు, మిక్కిలి వెఱ్ఱివాడు, విరోధమునకు కారణము లేకయే నాసోదరియొక్క ముక్కుచెవులను మదముచే కోసి వేసెను.

## రావణుడు మారీచుని తోడుపడ వేడుట

కాన దేవకాంతను బోలిన అందముగలదియు, అతని భార్యయు నగు జానకిని నేను వేగముగా తెచ్చుటకై వెళ్ళెదను. నీవు సహాయుడవు కమ్ము. నా తమ్ములును నీవును నాకు సహాయులుగ నున్నచో దేవతాకోట్లనైనను యుద్ధమందు గడ్డిపరకలనువలె జయించెదను. ఇది నిజము సుమా, మారీచా! కాన నాకు సహాయపడుము. పరాక్రమమునందు గాని, దర్పమునందు గాని నీకు సమానుని నేను చూడ లేదు. యుద్ధమునందు నీవు చేయలేని మాయలు లోకమునందు లేవు. ఈ విషయము తెలిసియే కదా నేనిచ్చటకి వచ్చితిని. నీవు చేయవలసిన పని యేమంటివా? వినుము. బంగారు చుక్కలు గల మృగరూపమును దాల్చి రాముడును జానకియు నున్న ఆశ్రమము చెంత సంచరించుచుండుము. అప్పుడు జానకి ఆ అన్నదమ్ములను ఆ లేడిని బట్టుటకై పంపును. అప్పుడొంటిగా నున్న మైథిలిని రాహువు చంద్రకాంతిని వలె నేను హరింతును. అంతట భార్యావియోగ దుఃఖితుడైన రామచంద్రునవలీలగా వధించి హాయిగా సుఖింతును. ఇంతమాత్రము చేసి పెట్టుము మామయ్యా!. అనగా మారీచుడు రామరాజేంద్రుని యొక్క యుదంతమును సొంతముగా విన్నంతనే గుండె ఝల్లుమనగా చేష్టలుడిగినవాడై శరీరము కంపించుచుండగా, నోరెండిపోవుచుండగా, చూపులు నిలువుగ్రుడ్లు పడగా, ఎండిన పెదవులను తడుపుకొనుచు ధైర్యమునశించినవాడై పీనుగును బోలినవాడై రాక్షసరాజును చూచుచు రాముని యొక్క పరాక్రమము తెలిసిన ఆ రాక్షసుడు భయము చెందిన హృదయము గలవాడై ఇంద్రవిరోధియైన రావణునకు దనకును క్షేమము కలుగునట్లుగా చేతులు జోడించి యిట్లు చెప్పెను.

# ముప్పది యేడవ సర్గము

## మారీచుడు రావణునకు రాముని పరాక్రమము చెప్పుట

ఎల్లప్పుడును ఇష్టమైన మాటలను చెప్పుజును లెచ్చుటైనను తేలికగా కనిపించెదరు. ఓ రాక్షసేంద్రా! ప్రియము కాకున్నను హితమైన మంచిమాటను చెప్పువాడును, వినువాడును అరుదుగా నుందురు. గొప్పపరాక్రమము గలవాడును, గొప్పగుణములు గలవాడును, వరుణునితోను, ఇంద్రునితోను సమానుడైనవాడును అగు రాముని చపలాత్ముడవైన నీవు తెలిసికొన లేవు. చారులు లేకపోవుటచే రామునకు క్రోధము మనస్సునందు రగులకుండు గాక. ఈ జగత్తుల సమూహము రాక్షసరహితము కాకుండు గాక. నాయనా! నీ ప్రాణములను నిట్టనిలువున తీయుటకై జన్మమెత్తదు గదా జానకి? ఈ భూపుత్రి వలన నీవు రాజౌటచేత లంకాపట్టణము బాధనొందకుండునా? ఇష్టమువచ్చినట్లు సంచరించు నిన్ను కలిసియున్న బంధువులందఱును పాడుగాకుందురా? నిన్నుపోలిన కుమతి నిందింపదగిన నడవడి గలవాడు పాపములు చేయుమని చెప్పమంత్రులు గలవాడు ప్రభువై తనను, తన రాష్ట్రమునంతయు, తన వారితో సహా మూలమట్టుగా మూర్ఖుడై నశింపజేయును. రాముడు నీవనినట్లు క్షత్రియ పాంసనుడు గాని శీలము లేనివాడుగాని కాడయ్యా! కాడు. లోభిగాని, ధర్మగుణము లేనివాడు గాని కాడు. కాడుసుమా. తీక్ష్ణుడు గాడు. సమస్త భూతములకు హితముగాని పనులు చేయువాడునుగాడు తండ్రిచేత గెంటబడి అడవులకు వచ్చిన వాడును కాడయ్యా! రావణా! నీకేవ్వరావిధముగా జెప్పిరో,

తన తండ్రి కైకేయి చేత వంచింప బడుటను చూచినవాడై తండ్రిని సత్యవాదిని చేయుటకై కైకేయియొక్క సంతోషమునకు, జనకుని సంతోషమునకు గాను సుఖములను విడిచిన వాడై యడవులకు వెళ్ళెను. వినవయ్యా! రఘురాముడు కఠినమైన మనస్సు గలవాడు కాడు. తేజస్సు లేనివాడుగాడు. ఇంద్రియ నిగ్రహములేని వాడును గాడు. ఇది నిజము. అబద్ధములగునిట్టి చెడు మాటలేల చెప్పెదవు తండ్రీ! ఆ రాముడు ధర్మావతారుడు. జయింపరాని నిజమైన పరాక్రమము గలవాడు, దేవతల క్రిందుని వలె సమస్త జగత్తులకు నాథుడు. మంచిబుద్ధి గలవాడు. తనయొక్క గొప్ప శీలము చేతనే తనను రక్షించుకొన గలదియగు సీతనపహరింప జూచుట సూర్యుని కాంతిని హరించుట వంటిదే. రావణా! బాణములనెడు జ్వాలామాలికలచే సమీపించుటకు వీలుకానిదియు, విల్లనెడు నింధనములతో కూడినదియు, వెలిగి పోవుచున్నదియు నయిన రాముడననెడు అగ్నిలో పడుటకు పరువవెత్తదగునా? విల్లనెడు తెరచిన గొప్ప నోరుగల వాడును, మహాస్త్రములనెడు జ్వాలలు గలవాడును, కోపము గలవాడును, చాపములను పాశములను ధరించిన వాడును శత్రు సమూహములను సంహరించువాడును, సీతానాథుడనెడు యముని సమీపమునకు సుఖముగానున్న ప్రాణములను వీడుట కేల వేగముగా వెళ్ళెదవయ్యా! జనకరాజు యొక్క కుమార్తె వలన రాముడు గొప్ప తేజస్సు గలవాడయ్యెను. అట్టి రాముని విల్లు తనను రక్షించుచుండగా ఆ సీతను దెచ్చుటకు నీ తరమౌనా? సింహము వంటి శీలముగలదానిని పాపరహితమైన నడవడి గలదానిని చేరబొకుము. ఓ రాక్షససింహా! నీకు హితము చెప్పితిని. వినుము రామునకు ప్రాణముకంటెను ప్రియమైన సీతను మోహముచే దావాగ్నిజ్వాలను పట్ట బోవునట్లుగా పట్టబోకుము. నీకు శుభము గలుగును. ఓ సురవీరోధీ! కొనసాగని యీపనిని పనిగట్టు కొని చేపట్టి యేమిఫలము

ననుభవించెదవో కదా. వినుము నీవతని కంటబడినచో యుద్ధరంగమున నంతటితో నీ యాయుర్దాయము తీరిపోవును సుమా రాక్షసనాయకా! ఆ రామునితో విరోధమును పెట్టుకుంటివేని నీవు కోరుకున్న ఈ రాజ్య భాగములును ప్రాణమును దక్కవు. నీకేమైన కొంతకాలము భూమియందు సౌఖ్యపడుట కిష్టమున్నచో రాముని మనస్సును నొప్పించు పనిని చేయుకుము రావణా! వేడుకొనెదను. పట్టణమునకు వెళ్ళుము. ధర్మముననుసరించి నడచువారైన విభీషణడు మొదలైన వారిని సభయందు జూడుము. నీ మనస్సున దలచిన పనియందలి గుణాగుణము బలమును వేగముగా మనమున నిర్ణయింపుము. హితమును అహితమును తలంచి కార్యమునొనర్పుము. నాకీ విధముగా తోచినది సుమా. ఆ కోసలరాజపుత్రుని యుద్ధమందు నీ వెదుర్కొనుటకు శక్యముగాదు. నా మాట వినుము. నీకు శుభములు గలుగును.



# ముప్పది యెనిమిదవ సర్గము

## మారీచుడు రావణునితో తాను రామునిచే పడిన పాట్లు చెప్పుట

దశకంఠా! వినవయ్యా! వెయ్యి యేనుగుల బలముగలిగి గొప్ప పర్వతము వంటి రూపము గలిగి నల్లని మేఘము వంటి శరీర కాంతితో పుటముపెట్టిన బంగారు కుండలములను ధరించి పరిఘమను ఆయుధమును బట్టి లోకములన్నియు భయముతో తల్లడిల్లునట్లుగా దండకాటవి యందు ఋషుల యొక్క మాంసమును తినుచు తిరుగుచుండగా గాధినందనుడగు విశ్వామిత్ర మునివరుడు భయముతో దశరథమహారాజు నొద్దకు వెళ్ళి రాజా! మారీచునివలన నాకు చాలభయము సంభవించినది కాన యజ్ఞసంరక్షణకై రామచంద్రుని పంపించు మనగా ఆ తాపస మాటలను విని దశరథుడిట్లనెను. తపోధనా! రాఘవుడు పసివాడు. పండ్రెండేళ్ల వయస్సుగలవాడు. అస్త్రములనుపయోగించు మేళకువ లేనివాడు. కాన సైన్యసమేతముగా నేనే వచ్చి ఆ రాక్షసులను సంహరించి మీకు మిక్కుటమైన సంతోషమును గలుగజేసెదను. అనగా ఆ మాటలను విని కౌశికుడు రాజా! రాముడొక్కడు తప్ప ఎవ్వడును ఆ రాక్షసునితో తలపడజాలడు. నీవు దేవతలను గాచుట ప్రసిద్ధ విషయమేకదా. నీ సైన్యములు క్షేమముగా ఇచ్చటనే యుండనిమ్ము. శ్రీరాముని తీసుకొని వెళ్ళెదను. బాలుడయ్యును స్వతః అధిక తేజస్సు గలవాడగుటచే అతడు రాక్షసులను వధింప జాలును. నీకు చాల శుభములు గలుగును సుమా రాజచంద్రా! అని చెప్పుచు రామచంద్రుని తీసుకొని వెళ్ళి విశ్వామిత్రముని సంతోషముతో దండకాటవి యందు తన యాశ్రమమున యజ్ఞము చేయుట కారంభించెను. ఆ సమయమున

రాముడేక వస్త్రమును ధరించి జుట్టుముడి వైచి తామరరేకులవంటి విశాల నేత్రములు గలవాడై మెఱయుచున్న బంగారు దండ అందముగా మెడలో వ్రేలాడుచుండగా సిరులు జిమ్మెడు ఆకృతిలో ముఖము సుందరమై లేత ప్రాయమును దేల్పుచుండగా విల్లును మ్రోగించుచు తన తేజస్సుతో అడవిని వెల్గింపజేయుచు ఉదయించుచున్న బాలచంద్రుని వలె ప్రకాశించుచుండగా వరములు పొందితి నన్న గర్వముతో మేఘమువంటి కాంతితో వేగముగా అక్కడికి వచ్చితిని. అట్లు వచ్చుచున్న నన్ను చూచి కొంచెమైనను భయభ్రాంతుడు గాక వింటిని ధైర్యముతో నేక్కుపెట్టగా నేను బాలుడే గదా యని ఉపేక్ష చేయుచు యజ్ఞవేదిక యొద్దకు వెళ్ళుచున్న నన్ను రాముడు వేగముగా బాణముతో నూఱు యోజనముల దూరమున సముద్రములో పడునట్లుగా కొట్టేను. ప్రాణములతో నన్ను విడుచుట చేత సముద్రమునందు పడి మూర్ఛనందియును, చాల సేపునకు తెలివి పొంది గర్వము విడచినవాడినై లంకాపట్టణమునకు వచ్చితిని. ఓ రాక్షసరాజా! అస్త్రవిద్యయింకను బాగుగా తెలియనివాడును బాలుడును, అమాయకుడును అయియున్నప్పుడే ఈ రాముడు నన్నావిధముగా విసరిపడవేసెను. రాక్షస సైన్యమును గూల్చేను. ఇప్పుడు యుద్ధమునకు నీవు పూనుకొనిన ఇంకా ఫలిత మెట్లుందునో చెప్పవలెనా? కావున రాముని నేదుర్కొనుట మంచిపని కాదని రావణా! నీ ప్రయత్నమును మానిపింప వలసివచ్చెను. రామునితో విరోధము పెట్టుకొంటివేని అదియూరకపోదుసుమా. రాక్షస సమూహమునకు మహాపదను నీవే కలుగజేసినట్లగును. ఇది నిక్కము. పంక్తికంధరా! నమ్ముము. అందమైన వినోదములతో సంతసము కలుగగా సొంపైన వేడుకలందు గలిసి సంచరించుచున్న యీ రాక్షస సమూహములకు సంతాపము కీడు కలుగునట్లుగా చేయకుము. బంగారు మేడలతో అందమైన గృహములతోనూ నిండియున్న లంక పాడయిపోవునట్లు సీతకై చూచుచున్నావు. రాక్షసోత్తమా! వినుము. తాను పాపములను చేయుక పవిత్రముగా

సంచరించుచున్నను పాపాత్ముల సాంగత్యముచే సజ్జనుడు ఇతరుల పాపముల వలన చెడిపోవును. పాములున్న చెఱువునందలి చేపల సమూహము ఆపదను చెందును. నీ పాపముచే హాయిగా సుఖములని అనుభవించుచున్నవారినేల నేలపాలు చేయ జూచెదువు? ఏపాపము నెఱగని వారైనను నీ యొక్కపాప కార్యముల వలన అందమైన సాటి లేని మణిభూషణములు దివ్యచందన లేపనములు గలిగి సుఖించుచున్న రాక్షసావళి నశింప జూచెదవా? యుద్ధరంగమందు చావగా మిగిలిన రాక్షసులు తమ భార్యలను వెంటపెట్టుకొనియో వదలివేసియో దిక్కులకు పరువెత్తుచుండగా లంకలోనున్న ఇండ్లన్నియు దిక్కులేనివై బాణసమూహపుటగ్ని జ్వాలలచే విపరీతముగా కాలిపోయి భస్మమగుటను నీవే చూచెదవు రావణా! పరుని భార్యను కామించుట కంటె ఆలోచించినచో గొప్ప పాపమింకొకటి యున్నదా? రాక్షసరాజా! నీ మనస్సు నందు ఆలోచింపుము. వయస్సులోనున్న నీ భార్యలు పదివేలమందిలేరా? స్వభార్యాలోలుడవగుము. నీ కులమునంతయు గాపాడుము. నెమ్మదితో అందగత్తెలును నీ ప్రేమకు పాత్రలును అయిన భార్యలతో, ప్రియ మిత్రులతో, ఇంకనూ చిరకాలము సౌఖ్యములను పొందగోరెదవేని ఏ విధముగను రామచంద్రునకు కీడు తలపెట్టకుము. స్పష్టముగా చెప్పితిని. రావణా! వద్దు వద్దు వారిజాక్షియైన సీతను హరింపవద్దు సుమా. స్నేహభావముచే నీకు చెప్పుచున్నాను. కాదని బలవంతముగా తెచ్చినచో ఆ సీతానాథునిచే బంధుమిత్రులతో గూడ యుద్ధమందు మృతినందగలవు సుమా.



# ముప్పది తొమ్మిదవ సర్గము

## మారీచుడు రావణుతో తాను రాముని బారిబడి తప్పించుకొన్న విధమును తెల్పుట

జానకీనాథుడు నన్నపుడు యుద్ధమందెట్టెట్లో వదిలి పెట్టెను. ఆ వృత్తాంతము నూతనమైనది ఇట్లట్లనక వినుము చెప్పెదను. నేనావిధముగా రామునిచే కొట్టబడియు ఆ దండకారణ్యమునందే గట్టివారైన యిద్దఱు రాక్షసులతో గలిసి లేడి రూపములను దాల్చి ఔద్ధత్యముతో మండెడు నాలుకయు, పెద్ద శరీరమును, పెద్ద కోరలు గల యాకృతితో అగ్నిహోత్ర గృహములందు, తీర్థప్రదేశములందు, పవిత్ర వృక్షములు గల ప్రదేశములందు క్రూరమతినై మాంసమును భుజించుచు తిరుగుచుంటిని. దండకారణ్యముననున్న ఋషి పరిషములను జంపి రక్తమును ద్రావుచు వారి మాంసము భుజించుచు నధర్మమార్గపరుడనై శరీరమును మరచినవాడనై మదమెక్కి ఒకనాడు, తపసి వేషము ధరించి మితాహారమును గొనుచు ప్రాణికోటిని రక్షించునాసక్తిగల రాముడును, మహాపతివ్రతయగు సీత ఉండుచోటికి వెళ్ళి చిక్కె రాముడుయని, పూర్వ శత్రుత్వమును మనస్సునందు తలచిన వాడనై వాడికొమ్ములు వంచి బలము ప్రదర్శించుచు బుద్ధి హీనుడనై పొడువబోగా నేనున్న విధమును జూచి వింటి నెక్కుపెట్టి గరుత్మంతుని రెక్కలగాడ్పు వంటి చప్పుడు గలిగిన వజ్ర సన్నిభములైన మూడు బాణములను వేగముగా విడువగా వానియొక్క వేగము తెలిసినవాడనౌటచేత ఉరుకుచు పారిపోయితిని. కాన నేను బ్రతికితిని. నాతో వచ్చిన వారు వాడియైన బాణములు తగులగా ప్రాణములను విడచిరి. రాముని నెదిరించి యెవడైనను బ్రతుక గలడా? ప్రఖ్యాత మైన బలము కలిగిన రఘురాముని బారినుండి తప్పించు కొని యెట్లెట్లో బ్రతికితిని. ఓ రాక్షసాధిపా! అప్పటినుండి పౌరుషమును విడచి సన్యసించి గర్వమును వీడి యోగము నవలంచించి మునివలే సంచరించుచున్న వాడను. నా హృదయము యొక్క పాటునేమని చెప్పుదును. ఆ శ్రీరాముని స్మరించినంతనే గొప్పధనస్సును, మృగచర్మము నారచీరలు ధరించిన రాముడు ఓ దశకంఠా! చెట్టుచెట్టున పాశము ధరించిన యమునివలే కనబడుచుండును.

ఓ రావణా! ఎల్లప్పుడు వేనవేలుగా రాములు కనిపించుచుందురు. అడవి యంతయు రామమయముగా గనిపించును. రాముడు లేనిచోటు కూడ ఉన్నట్లే తోచుచుండును. ఆ రాముడే స్వప్నములందు కూడ కనిపించుటచే భయపడి రాత్రులందు నిదుర లేక బాధనొందుచుండును. సురవిరోధీ! రామునిపేరుచే కలిగెడు భయమునేమని చెప్పవలెను? రత్నము, రథము, రామా లు మొదలగు 'ర' తో మొదలయ్యేడు మాటలను విన్నను నా మనస్సు భయముతో కలవర పడుచుండును. ఓ రావణా! నీకు ఆ రామునితో విరోధము వలదు. యుద్ధమునందా బలశాలిని గెలువజాలవు. ఆ రఘురాముని పరాక్రమము నేనెఱుగుదును. బలిని, నముచిని వధింపగల సమర్థుడు. శక్తియున్నచో నీవే అతనితో పరాక్రమముతో పోరుము. కానిచో బంధుజనుల మృతిని సైరింపుము. నేను భూమియందు కొన్ని దినములు జీవించి యందుట ఇష్టమైనచో నాకు ఆ సీతానాథుని కథను చెప్పకుము. రావణా, చాలు చాలును నా తల మీదకు తేకుము. అనేకులయిన సాధువులు పెద్ద ధర్మమునాచరించు వారయ్యును భూమి యందితరుల దోషముచే వారు నశించుచుందురు. అట్లే నీ మూర్ఖపు పనులచేత నేను చెడిపోవుట రూఢి సుమా. నేను నీవెంట రాను. నీ యీ పనియందు నీ యిష్టము వచ్చినట్లుగా చరింపుము. నన్ను విడిచిపెట్టుము. ఆ రాముడు సాటిలేని సత్వముగలవాడు. గొప్ప తేజస్సు గలవాడు. గొప్పదర్పము, స్థైర్యము గలవాడు. అతనిని రాక్షసలోక సంహారకునిగా రావణా! ఏల చేసెదవు? మన చుప్పనాతి మదముతో ఆ దశరథనందనులను ఏమని చేరవెళ్ళినది? అంతటితో బోక ఈసుచే ఖరుని ప్రేరేపించెను వాడు సైన్యస్తోమముతోడ వెళ్ళి రామునిచే చంపబడెను. ఆ రాముడు చేసినట్టి అపరాధమేమియో చెప్పుము రావణా! బంధువుల హితవు కోరుచు నేను చెప్పుచున్న మాటలు నీకు చేదైనచో రామునిచే యుద్ధమందు బంధుమిత్ర కీర్తులతో సహ నశించెదవు సుమా అనగా... యుక్తమును, క్షమమయిన ఆ మారీచుని మంచిమాటను తనకశుభమని రావణుడు, మరణింపబోవు రోగి ఔషధములను విరక్తితో గ్రహింపని విధముగా మనస్సునందు స్వీకరింపడయ్యెను.

# నలువదియవ సర్గము

**రావణుడు మారీచుని పరుషంబులాడి బలాత్కరించి తోడుపడ నంగీకరింపజేయుట**

ఈ విధముగా మంత్రి శ్రేష్ఠుడైన మారీచుడు నీతి యుక్తముగా మేలు కలుగ జేయునట్లుగా నేర్పుతో బోధించినను దైవ ప్రేరితుడై రావణుడు అతి కఠినముగా అతనితో నిట్లనెను. ఓ మారీచా! నిన్నెవడీకథలను చెప్పుమని వేడెను? చవిటి నేలలో విత్తులు నాటినట్లు నోటినిండుగా ఏవో మాటలనేల ప్రేలితివిరా? ఆరాముడు మనుష్యుడు, పాపాత్ముడు, మూర్ఖుడు. నా రాజనీతిని నీవా భేదించు వాడవు? ఆడుదానియొక్క మాటలను విని తల్లిని తండ్రిని స్నేహితులు మొదలైన వారందరిని వీడి వెంటనే బయలుదేరి అరణ్యములందు ప్రవేశించెను. ఎంత తెలివిలేనివాడతడు? నీవే చూచుచుండగా ఖరనిహంతయైన ఆ రాజపుత్రునకు ప్రాణసమానయైన వైదేహిని తెచ్చెదను. నా నిశ్చితమైన బుద్ధిని మార్చుట నీ వశమా? ఇంద్రుడు మొదలైన దేవతలు గూడ నా ప్రయత్నములను వీసమంత యైనను త్రిప్పజాలరనగా నీవటరా నన్ను చక్కదిద్దువాడవు? కార్యనిశ్చయ విషయమున ఉపాయమున అపాయము – గుణము దోషము తెలివితో చెప్పుమని అడిగిన గదా మంత్రులు చెప్పవలెను? ఈ పనినెట్లు చేయదగునని రాజడిగినచో బ్రదుకవలెనను కోరికగల మంత్రి చేతులు జోడించి అణకువతోను భయపడుచు మనస్సునందు గల విధమును విన్నవింపదగును. మంచిదియు, మెత్తనిదియు, ప్రతికూలము కానిదియు శుభకరమైనదియు నయిన మాటతో మంత్రి వినయ పూర్వకముగా రాజునకు సమ్మతమగునట్లు చెప్పదగును. గౌరవార్హుడైన రాజు గౌరవరహితముగా చెప్పబడిన శుభకరములగు మాటలను ఎంతటివాడు చెప్పినను చెవిని బెట్టడు మారీచా! ఇంద్రునివంటి విక్రమమును, అగ్నివంటి

తీక్ష్ణతయును చంద్రునివంటి సౌమ్యతయును, యమునివంటి దండనమును వరుణునివంటి ప్రసన్నతయును గల రాజు అన్నివేళలందు పూజ్యుడగును. ఇది నిజము. నీవు ధర్మము తెలియలేక కేవలము మోహములో పడినవాడవై నేను సాహ్యము కోరిరాగా యేమేమియో కారుకూతలను కూసితివి. మతి చెడినవాడా! నిన్నీవిషయమున మేలుకీడులనెవ్వడడిగెను. ఈ కార్యమున నీవు సహాయము చేయుమని నేను పల్కగా నీవిట్లేల ప్రేలెదవు. వినుము నీవు చేయవలసిన సహాయమెట్టిదో చెప్పెదను. వెండిచుక్కలు గలిగిన బంగారు జింకవై అందముగా రాముని భార్యయెదుట తిరుగుచుండుము. నీయొక్క అందమును జూచి ఆశ్చర్యమును పొందుచు భర్తతో సీత నిన్ను పట్టుకొని తెమ్మనును. అప్పుడు రాముని దూరమునకు తీసికొనివెళ్లి అచ్చట జానకీ! లక్ష్మణా! యని రాముని కంఠధ్వని ననుకరించుచు చావుకేక భూసుత వినునట్లుగా సేయుము. ఆ కేకల వలన మనస్సు చెడినదై సీత రాముని జూచుటకై సౌమిత్రిని బంపును. సౌమిత్రియు ప్రేమభావముతో రాముని వెదుకబోవును. అట్లు రామలక్ష్మణులు వెళ్లగా నేను ఆరాముని భార్యను ఇంద్రుడు శచీదేవినివలె సుఖముగా హరించెదను. ఇంతమాత్రము సహాయము చేసి నీయిష్టము వచ్చినట్లు వెళ్ళుము. దీనికై నీ కర్ధరాజ్యమునిచ్చెదను. ముందు నీవు వెళ్ళి కార్యమును పూర్తిచేయుము. నీవెనుకనే రథముమీద నేను వచ్చెదను. ఈవిధముగా రాముని వంచించి యుద్ధప్రసక్తి లేకుండగా సీతను తీసికొని ఇంచుక సేపుననే నేను లంకకు సుఖముగా వెళ్లెదను. ఈ చిన్నపనిని నీవు చేయకున్నచో నిన్ను మృత్యు దేవతకు బలిపెట్టెదను. నీకిది యిష్టమైనచో నాకోరిక నెరవేర్పుము. కాదు కూడదని ప్రేలినచో బలవంతముగా నైనను చేసెదవు. తప్పదుసుమా. తెలివిగా మెలగుము. రాజునెదిరించి మాటలాడువారు భూమియందు సుఖముగా బ్రతికియుండెదరా? అచ్చటికి వెళ్ళినచో చావు అనుమానమే కాని ఇచ్చటనిట్లు ప్రేలుచున్నచో నిశ్చయముగా నాచేత మృతి నొందెదవు. ఇట్లు చేసిన మంచిదో అట్లు చేసిన మంచిదో గట్టి బుద్ధితో ఆలోచించి కార్యమును చేయదలపెట్టుము.

# నలువది యొకటవ సర్గము

## మారీచుడు రావణుని నిందించుట

అని రాజాధికారముతో మందలించగా విని మారీచుడు కఠినమైన వికటపు మాటలను ఆ రాక్షసునకు ప్రతికూలమైన రీతితో నిట్లనెను. ఓరీ రావణా! పుత్రులు, సేవకులు, మంత్రులు, మిత్రులతో గూడ నీకు ఆపదగలిగించు ఇట్టి చెడ్డపనిని ఏపాపాత్ముడురా నీకు బోధ చేసెను? నీవు సుఖముగా నుండుట చూడలేక ఏకుటిలమైన వాడో నీకు మృత్యుముఖమును జూపెను. అందు పడిపొమ్మని యుపాయముతో బల్కెను. బలహీనులగు నీశత్రువులు ఇట్లు నీవు బలవంతుడైన విరోధిచే అవమానింపబడునట్లుగా తలపెట్టినారు. నీవది తెలియలేకున్నావు. నీకు మంచి చెప్పునట్లుగా హీనుడెవ్వడో కుటిలబుద్ధియై నీ చెడ్డపనిచే నీవే నశింపవలెనని కోరుచున్నాడు. నీవిట్లు తెలవిలేకుండ ప్రవర్తించు చుండగా ఇట్లు చేయరాదని చెప్పునట్టి మిత్రులు లేరా? నీకు హితము చెప్పలేని వారెందుకు రాక్షసేంద్రా! రాజును సరిదిద్దనట్టి మంత్రులు భూమియందింకను ప్రాణములతోనున్నారా? వారు చావకున్నచో చివరకు కీడు కలుగుసుమా. రాజు మంచి నడవడి గలవాడైనచో మంత్రులకు ధర్మార్థకామములు కలుగును. అందుకు విపరీతమైనచో ప్రజలు బాధలను పొందెదరు. మంత్రులకు ధర్మార్థకామములు వ్యర్థములగును. రాజు మూలముగా విజయము ధర్మము కలుగును. అందువలన రాజెల్లప్పుడును రక్షింపదగినవాడు. దుర్మార్గుడును, నీతిలేనివాడును, ప్రజలకు వ్యతిరేకమైన వాడును నైనరాజు రాజ్యము నెట్లేల గలడు? దుర్మార్గులు మంత్రులైనచో రాజుతో గూడ తామును నశించిపోవుదురు.

సారధి మందబుద్ధి యైనచో గుఱ్ఱములు సారధితో గూడ గుంతలలో బడిపోవును సుమా. అనేకులగు సాధువులు భూమియందు పెద్దగా ధర్మము నాచరించు వారైనను తక్కిన వారి దోషములచే తామును బంధుసమేతముగా నశించెదరు. గర్వముతో ప్రజావిరుద్ధముగా కఠినుడై ప్రభువు రాజ్యము నేలినచో నక్కలచే రక్షింపబడు మేకలవలె ప్రజలందఱును నాశము నందుదురు. కాకతాళీయముగా నాకు వచ్చిన యీమహాపదకు నామనస్సునందు నాకై బాధకలుగుటలేదు గాని నీవు మూర్ఖత్వముతో న్యాయము విడచి యింద్రియ జయమును పాటింపక దుర్బుద్ధితో లెక్కింపరానంత సైన్యముతో గూడ నశించెదవేయని నీ నిమిత్తమై విచారించుచున్నాను. నన్ను జంపి రామచంద్రుడు వెంటనే నిన్ను నిశ్చయముగా చంపివేయును సుమా. శత్రువుచే చంపబడుటచే రావణా! నేను ధన్యుడ నయ్యెదను. ఆ రామచంద్రుని కంట బడినప్పుడే నేను చచ్చినవాడను. నీవు రాముని భార్యను హరించి బంధువులతో గూడ నశించెదవు సుమా. నీవా సీతనెత్తికొని వచ్చినచో ఇంకా నీవెక్కడ? నీ యూరెక్కడ? రాక్షస కులోత్తము లెక్కడ? నేనెక్కడ? నశించిపోదుము. నీ మేలు కోరినవాడనై నేను మంచిని చెప్పగా నా మాటలను నీవనాదరణ చేయుచున్నావు. అయ్యో! ఏమందును రావణా! మంచి కోరువారైన స్నేహితుల పథ్యవాక్కులను మృత్యువసుడేవిధముగా వినును?



# నలువది రెండవ సర్గము

**అ**ని చెప్పి రాక్షసరాజును జూచి భయముతో 'పోదములెమ్ము రావణా! ధనుస్సును, బాణములను చేతులతో ధరించి నన్ను చంపబోవుచున్న భూపుత్రి భర్తను చూచిన వెంటనే నిట్టనిలువున దిగాలున చావగలవాడను. రాముని యుద్ధమునందెదరుకొని ప్రాణములతోనుండ గలవాడు కలడా? యమ దండముచే హతుడవయిన నీకును నాకును స్నేహము సరిపోయినది. ఇప్పుడు చెడుకాలమునకు దగిన చెడుబుద్ధితో చెడిపోవు నిన్నేమనగలవాడను? నాయనా! రావణా! మనియున్నచో నీకు స్వస్తి యగుగాక. ఇదే పోవుచున్నాడను అనగా సంతసించినవాడై రాక్షసరాజు ప్రేమతో మారీచుని గౌగలించుకొని 'సైరా! శౌర్య యుక్తముగా నిట్లు మాట్లాడవలయును. ఇప్పుడు నేను చెప్పినట్లు నడచు వాడవైనావు. ఇప్పుడు నీవు నిజమైన మారీచుడవు. పూర్వమెవ్వడవో ? మా మారీచుడట్లు పలుకునా? రత్నములతో అలంకరింపబడిన నారథమును వేగముగా నెక్కుము.

## మారీచుడు పంచవటికి ప్రయాణమగుట

నేనునూ నేవెంట వచ్చెదను. జనకపుత్రిని మోసగించి నీ యిష్టము చొప్పున వెళ్లుము. జానకి ఒంటరిగా ఉండగా నేనామెను బలవంతముగా ఎత్తుకొని వచ్చెదను. వేగముగా లంకాపట్టణమును చేరెదను. అనుచు పట్టుదలగల ఆ రావణుడు కూడ రథమెక్కి మారీచాశ్రమము దాటి వేగముగా వెళ్ళెను. అట్లు వెళ్లి వెళ్లి రాక్షసరాజు పర్వతములు సరస్సులు వనములు దాటి రాష్ట్రములను నగరములను పట్టణములను దాటి దండకాటవిలో రఘురాముని ఆశ్రమమును జూచి రథము దిగి మిత్రుడైన మారీచుని చేతిని తన చేతితో బట్టి యిట్లనెను. సఖా! అరటి చెట్లు గనిపించునదియే రాముని నివాసము సుమా! ఇక వచ్చిన పని కానిమ్ము.

## మారీచుడు మాయా మృగమగుట

అనగా మారీచుడు గొప్ప మణులు చివరగా గలిగిన గొమ్ములను, తెలుపు నలుపు గల అందమైన ముఖమును, ఎఱ్ఱకలువ కాంతి గల మూతియు, ఇంద్ర నీలముల వలె నున్న చెవులు, కొంచెమెత్తైన మెడ గలిగి నల్లని దళము వంటి పెదవియు, మొల్లలు, చంద్రుడు, వజ్రముల వంటి కాంతి గల పొట్టయును, పద్మకేసరముల వంటి వీపును ఇప్పపూవుల కాంతి గల ప్రక్కలును, వైఢూర్యములవంటి గిట్టలును, సన్నని పిక్కలును గలిగి, ఇంద్రధనుస్సును బోలిన పొడవైన తోక, మెరుపుల యందము గలిగి ప్రకాశించుచూ ఒక్క నిమిషములో మారీచుడు అందమైన లేడియై అరణ్యమందు గ్రమక్రమముగా దిరుగుచు రామాశ్రమమును ప్రకాశింపజేసెను. జానకిని మోసపుచ్చుచుటకై లేత చిగుళ్ళను త్రుంచి తినుచు లేత గడ్డి యందు దిరుగుచు తినుచుండెను. మరలా అరటిచెట్ల వనమందు మెల్లమెల్లగా తిరుగుచు తనను సీతాదేవి చూచుటకు వీలైన స్థలము లందు స్వేచ్ఛగా తిరుగ జొచ్చెను. ఒక్కొక సారి దూరముగా పరువెత్తును. పచ్చికలు మేయును. లేళ్ళ గుంపులతో కలియుచుండును. ధ్వనులకు వెరచును. కొంత ముందునకు బోవును. మరలి వచ్చును. నోరు తెరచును. కొన్నిచోట్ల పండుకొనును. రామాశ్రమమునకు సమీపముగా వచ్చును. శరీరశ్రమ పోగొట్టుకొనుచున్నట్లు నేలమీద పచ్చికపై విశ్రాంతిగా పండుకొనును. అంతలో శరీర శ్రమ తొలగినట్లు చటుక్కున లేచి వెళ్లిపోవును. వివిధ వర్ణముల చుక్కలు తన మేనిపై మెరయుచుండగా చివాలున నా అరటితోటయందు దాటుచుండును. చాల అందముగా నిలుచును మాయమగును. మరలా వచ్చును. గుంపులోనుండి వెడలివచ్చి గుండ్రముగా గిరగిరా తిరుగుచు ఆ జానకి చూచునట్లుగా నిటునటు చూచుచు దిరుగుచుండును. ఈ విధముగా సంచరించు చుండ ఆ అడవి యందలి ఇతర మృగములు దాని దగ్గరకు వెళ్ళి వాసన చూచి భయముతో చిందర వందరగా వేగముగా పది దిక్కులకు పరువెత్తుచుండెను. మృగములను వధించు నాసక్తి గలవాడయ్యును, ఆ సీతాదేవిని మోసగించుటకై ఆ మృగములను ముట్టుకొనునుగాని తన నైజగుణమును బయలుపడనీయకుండెను.

# నలువది మూడవ సర్గము

## జానకి మాయా మృగమును జూచుట

ఆ జానకీదేవి పువ్వులు కోయవలెనన్న కోరికతో ఆవనమందశోకచూతాది పుష్పములు కోయుచు నెచ్చటను నెప్పుడును జూడని బంగారుజింకను జూచి ఆశ్చర్యపడెను. మనోహరములగు దంతములు, పెదవులు గలదియు, ఆశ్చర్యముతో వికసించిన నేత్రములు గలదియు నగు సీత స్నేహపూర్వకముగా ఆ చిత్రమృగమును చూచెను. సీతాదేవి తన్ను జూచి ముచ్చట పడుతున్న కొలది యది వింతవింత వేడుకలను చేయసాగెను. బంగారు వెండి మెరుగులతో ప్రక్కలు నిగనిగలాడుచుండగా నడవిని బ్రకాశింప జేయుచున్న చిత్రమైన జింకను జూచి రండురండనుచు జానకీదేవి ప్రాణసమానుడైన భర్తన, ఆయుధపాణియై యున్న లక్ష్మణుని వేగముగా పిలిచెను. దగ్గరకు వచ్చి సుమిత్రా నందనుడు ఆ లేడిని గొప్ప అనుమానముతో జూచి శ్రీరామునితో నిట్లు పలికెను. ఓ కాకుత్స వంశశ్రేష్ఠుడా ! ఆ మారీచాసురుడే యిట్టి లేడి ఆకారమును దాల్చి మునీశ్వరులను, వేటాడవచ్చిన రాజులను క్రూరుడై ఈ అడవిలో చంపుచుండును. మాయావియైన ఆ రాక్షసుడే మాయామృగ రూపమునెత్తి తిరుగుచుండెను. ఈ దేహము గంధర్వ నగరి వంటిది. పద్మదళాక్షా ! ఇది నిక్కము గాదుసుమా.

## సీత మాయా మృగమును బట్టి తెమ్మని కోరుట

ఎప్పుడైనను చూచితిమా ? ఎప్పుడైన వినియున్నామా? బంగారపు కాంతి కలిగి మణిమయమైన మృగమెప్పుడైన సృష్టింపబడినదా ? నా కంటికిది మాయగా దోచుచున్నది. అనుచుండగా శుభ్రమైన నవ్వు గల సీత భర్తను సమీపించి మరిది నాగుమని ఆ లేడి చర్మము పై మనస్సున గలిగిన కోరికతో నిజకాంతునితో నిట్లు పలికెను. ప్రాణనాథా! వినుము. నాకు ఈ మృగ మందాసక్తి

కల్గుచున్నది. ఓ మహాభుజా! దానిని నెమ్మదిగా బట్టుకొనుము. వినోద కేళి కుపయోగించును. ఈ అడవి యందెన్ని మృగములను జూచుచున్నాము. ఎలుగుబంట్లను, కిన్నర మృగములను, వానరములను, చామర మృగములను ఎన్నిటినో జూచితిమిగదా! వానియందీ శరీర కాంతి అందమున్నవా? దీనితో సమానమైన కాంతి గల మృగమును మనము చూడలేదు. ఇది నిజము. వల్లభా! లోకములో నెన్ని జింకలు లేవు. చిత్రమైన మృగముల నెన్నిటినో చూచితిమి కదా. ఈ వన్నె కాని, అంత చేరిక కాని, ఈ అందము కాని దేనియందైనా చూచితిమా? నాల్గుమూలలను తన శరీర కాంతిని విరివిగా జిమ్ముచు ఈ అడవి యందు చంద్రునివలె నున్నది. నాథా! దయతో దానిని పట్టితెమ్ము. ఔరా ! ఏమి రూపము. భళిభళీ! అరరే! ఆ శోభ, స్వర సంపద చాలా ప్రశస్తము. అద్భుతమైన దా లేడి. ప్రాణనాథా! నా మనస్సును బాగుగా లాగుచున్నది. ఆ మృగము గనుక ప్రాణములతో పట్టుపడినచో అంతకన్నా మించిన చిత్ర మున్నదా? ఈ అరణ్యవాసము ముగియగనే అయోధ్య ను చేరినప్పుడిది మన అంతఃపురము నందు సంతోషకారియగు అలంకారముగా నుండును గదా. రాజశేఖరా! నా మాటల నాలోచించి చూడుము. మీకును, భరతునకును, నాకును, మా అత్తగార్లకును ఈ లేడి యెంతో ఆశ్చర్యమును ఎల్లప్పుడును కలిగించుచుండును గదా! ఈ లేడి ఓ పురుషోత్తమా! దీని విధము బుద్ధియం దాలోచింపుము. ఇది ప్రాణములతో దొరుకకపోయినను దీనియొక్క చర్మమైనను గొప్ప సంతోషమును కలుగజేయును. ఈ చర్మమును పచ్చగడ్డి ఆసనముమీద పరచుకొని నీతో గలసి కూర్చోన గోరెదను. భర్తను ఇది కావలెను అది కావలెను అని బాధ పెట్టుట స్త్రీకి మిక్కిలి క్రూరమైన పని. నా అభిప్రాయమిది. అయినను ఈ లేడి తన శరీరకాంతిచే నాకు గొప్ప ఆశ్చర్యమును కలుగజేసెను. అనగా గొప్ప పరాక్రమముగల రాముడు ఆ మృగము యొక్క విస్మయకారణములగు వర్ణము గల కొమ్ములను, బంగారపు రోమములను సూర్యునివంటి కాంతియును, మేనియందలి చుక్కలును ఆశ్చర్యమును కలిగించగా మిగుల ఆనందించువాడై

# నలువది నాలుగవ సర్గము

## శ్రీరాముడు లక్ష్మణునకు సమాధానము జెప్పుట

సీతాదేవి యొక్క మాటలను విని ఆమృగము యొక్క అందమును జూచి తానును ఆశనొందుచు శ్రీరఘుపతి సీతచే ప్రేరేపింపబడినవాడై ఎక్కువయిన సంతోషముతో తన తమ్ముని జూచి యిట్లు పలికెను. ఓ లక్ష్మణా! చూచితివా! ఈ భూపుత్రికి జింకయందు గల ఆశ. మునుపెప్పుడైనను ఇట్టి రూపము గలదానిని చూచితిమా మనము? ఇకముందైనా నిట్టిది యుండునా? కుబేర వనమునందుగాని, నందన వనమునందుగాని యిట్టిదున్నట్లు విన్నామా? బంగారు చుక్కలుగల దీని యందము దేహకాంతి ఆకాశమునంటుచున్నది. దీని రోమములు అనులోపముగను, ప్రతిలోమముగను సొగసుగానున్నవి. ఆవులించి నపుడు మేఘము నుండి వెడలిన మెరుపువలె అగ్నిజ్వాల వంటి నాలుక ముఖము నుండి వెడలెను. ఇంద్రనీలమణి సమానమైన ముఖమును శంఖపుముత్తెము వంటి కడుపుభాగమును గలిగి మేలియందమునకు నిలయమైన ఈమృగము యొక్క ఠీవి యెవని మానసమును హరింపకుండును? అనేక రత్నములతో కూడినదియును, బంగారు వర్ణము గలదియునగు రూపమును జూడగా ఎవ్వరి మనసైనను కరుగకుండునా? ఇక బాలికయైన సీత మాట చెప్పవలెనా? మాంసము కొఱకుగాని, వేడుక కొఱకుగాని విలుకాన్డగు రాజులు మృగములను మృగయ వినోదమున చంపెదరు. ధాతువులను, మణులను, బంగారమును, ధనసమూహమును రాజులు వేటతోనే గదా ఆర్జింతురు. సంకల్ప కల్పిత వస్తువులన్నియు శుక్రుని జెందునట్లు వనము గల్గిన సర్వధనములు రాజుకు చెందును గదా. ఓ లక్ష్మణా! ధనమును సంపాదింప గోరువారు ఆ

పదార్ధములందలి ఆశచే వన సంచారులై దానిని సంపాదించెదరు. అర్ధశాస్త్రము తెలిసినవారు దానినే అర్ధమని యందురు. మణులు, బంగారము గలదియైన ఈలేడి చర్మమునందు ఓ సౌమిత్రీ ! ఈ సీత నాతోగలసి సమ్మదముతో గూర్చొను టకై వేడుక పడినది. మృదుత్వమునందు బ్రసిద్ధిజెందిన నల్లచారల లేడిచర్మము గాని, బొట్లుయిట్టి చర్మముగాని, ప్రవేశి మృగ చర్మముగాని, మేక చర్మముగాని దీనితో సమానమగునా? నీ మనస్సునందాలోచించి చూడుము. భూమిపై ఈ మృగరత్నమును, ఆకాశమునందు ప్రకాశించెడు నామృగమును (మృగశీర్ష) ఈ రెండును నాకు జూడ మిక్కిలి రమణీయములు. తక్కినవిగావు. ఇది నిజము.

## శ్రీరాముడు లక్ష్మణునితో నిది మారీచుని మాయయేయైనను అవశ్యముగా దీనిని వధింపవలెననుట

లక్ష్మణా! నీవు చెప్పినట్లుగా నిది రాక్షస మాయయేయైనను, దీని దుష్ట బుద్ధి నశించునట్లు చంపుటయే శ్రేయము. ఇట్లు తాటకాపుత్రుడే మదించిన వాడై, మునీంద్రుల మాంసముల దినుటకై సంచరించు, వేటాడ వచ్చిన రాజులను వంచించి చంపివేయును. కనుక బలముతో దీనిని చంపుటయే మంచిపని. పూర్వకాలమున వాతాపియను రాక్షసుడు మునులయొక్క పొట్టలందు ప్రవేశించి లోపలనుండి తేలువలే వారి గర్భములను కొరికి హింసించి చంపుచూ తిరుగు చుండ చివరకొక్కనాడు అగస్త్యునిచే భుజింపబడి ఆ వాతాపి పొట్టలోనుండి లేచి బయటకు రాబోవుచుండగా కుంభసంభవుడా రాక్షసుని గుండెలదరునట్లు నవ్వుచునిట్లనెను. "ఓరీ! అమరవిరోధీ! బ్రాహ్మణ సంఘములను లెక్కచేయక నీయొక్క బలముచే వారిని కఠినముగా చంపి పాపాత్ముడవైతివి. ఇప్పుడు నీవు నాకడుపునందు జీర్ణమైపొమ్ము." చూడగా ఈతడును ఆ వాతాపిని పోలినవాడు కాడా? తప్పకుండా ఆ అగస్త్యునిచే నతడు చచ్చిన విధముగా నాచేత నితడును చచ్చునుసుమా. మెలకువగలిగి ఈ జానకిని నీవు జాగ్రత్తగా రక్షింపుము. మన ప్రయత్నములన్నియు ఈ జానకియెందే యున్నవి. అందుచే శ్రద్ధగా సీతను కాపాడుము. ఈ మృగమును చంపుటయో, లేక తెలివిగా పట్టుటయో చేయుటకు

నేను వెళ్ళెదను. సౌమిత్రీ! ఛూచితివా, జానకి ఆ మృగచర్మమునెంత మక్కువతో చూచుచున్నదో. కావున నేను ఒక తీక్ష్ణ మైన బాణముతో లేడిని చంపి ఆ శ్రేష్ఠమైన చర్మమును తీసుకొని వేగముగా వచ్చెదను. అంతదనుక నీవీ సీతాకాంతను మిగుల శ్రద్ధతో పొరపాటునొందని బుద్ధి వైభవముతో సదా రక్షింపుచుండుము తమ్ముడా. ఓ లక్ష్మణా ! సమర్థుడును, ధృఢమైన బలముగల వాడును, ధైర్యవంతమైన మనస్సు గలవాడును నగు పక్షిరాజు జటాయువు నీకు సహాయుడై చరింపగా చంద్రబింబానన యైన సీతకు పొరపాటు పడక– ప్రతి క్షణము ఎటునుండి ప్రమాదము వచ్చునోయని శంకించుచున్న వాడవై రక్షణ గల్పించుము.

## శ్రీరాముడు మాయామృగము వెంటబోవుట

అని చెప్పి రాముడు మూడు వంపులు గలిగిన విల్లును, బంగారు పిడి గల ఖడ్గమును, అమ్ములపొదులను ధరించి మాయామృగమును బట్టుకొనవల ననెడు సంరంభముతో వేగముగా బయలుదేరెను అట్లు తన్ను వెన్నంటి వచ్చుచున్న రాముని జూచి గుండెలు దడదడ లాడుచుండగా తటాలున కనబడ కుండా వెళ్ళి, మరల కనబడుచు వెళ్ళుచున్న లేడిని కోపముతో వెంటాడుచూ రఘురాముడు వేగంగా రాగా అదియును వృక్షములమాటున దాగినట్లు కనబడెను. ఇదిగో దొరికినదని పట్టుకొనబోగా చెంగున దూకుచూ మెరుపువలె మాయమగుచు చాలా దూరము వెళ్ళినది. ఇది చాలా తెలివిగలదని తలచు నంతలో తన ప్రక్కనే నిలచి తచ్చాడుచుండును. పరువెట్టి దీనిని పట్టుకొనెద నను కొనునంతలో పొదలలో దూరి దాగియుండును. చేత చిక్కెనని చేయి చాచి పట్టుకొనబోగా చివుక్కున నొకవైపునకురికి పారిపోవును. కనిపించి, కనిపించక పారిపోవును. తిరిగి వచ్చుచుండును. ఎక్కువగా బెదిరి చూచు చుండును. తిరుగుమొగము పెట్టి నడచుచూ, తచ్చాడుచూ, లేత పచ్చికను తినుచు వింతగా తిరుగుచుండును. చూడచూడగా క్రొత్త కాంతులతో ప్రకాశించు చుండెను. చూచుచూ, చూచుచుండగానే పట్టుబడకుండా దూరముగా వెడలి

పోవును. మునగ దీసుకొని బాణములను జూచి భయము చెందును. ఆకాశమున కెగురును. చెట్లమాటున దాగును. వంచించి కనబడకుండును. ఇది భయపడు చున్నదని రాముడు విల్లుచాటున పెట్టగా నెమ్మది నెమ్మదిగా ముందుకు నడచును. ఇది అందుటలేదు. దీనిని చంపివేసెదనని బాణము తీయగానే భయము చెందినట్లురికి పారిపోవును. తనవెంట వచ్చుచున్న రాముని చూడని విధముగా పచ్చగడ్డిపై నడుచుచుండును. కదలక దాగియుండును. రామునికి వింత గొల్పునట్లుగా ఒంటికంటితో చూచుచుండును. చాటునకు వెళ్ళును. మబ్బు చాటున దాగు చంద్రునివలే కనిపించి, కొంతసేపు కనిపించక, కొంతసేపు సంచరించుచూ రాముని కొంతదూరము తీసుకొని వెళ్ళెను. ఒకసారి పొదల యందు ఒదిగి యున్నట్లుండి దగ్గరకి వెళ్ళగా దూరముగా వెళ్లియుండును. చేయిచాచి పట్టుకొనబోగా దొరకకుండును. ఒక్కమారలసి పోయినట్లుగా నిలచియుండును. అలసి యున్నదని దగ్గరకు పోగా వేగముగా పారిపోవును. ఒకొక్కసారి వింతవింత వేడుకలతో ఆడుచుండును. వింతయైన ఆ లేడి మాయ చేసి అటునిటు తిరుగుచూ ఎక్కువగా తటపటాయించుచూ మాయలో పడవైచుచూ రాముని దూరముగా గొనిపోయెను. అంతట రోషవివశుడై విభ్రాంతిని విడిచిన వాడై రాముడు బడలిక చెంది నిలువబడెను. ఆలేడియు గొప్ప చెట్ల నీడలను నిలచి చెమటతో తడిసినదై విశ్రమించుచు, లేళ్ళమందలతో గలసిమెలసి వాటిమాటున నిలచుచుండెను. పట్టుదలతో రాముడు మరల పట్టుకొనబోగా అవి పెద్దగాయుండియు చెట్టుగుంపుల సందులలో దూరి ఒక చెట్టుమొదట నిలబడి యుండెను. దానిని చూచి రోషముతో రామచంద్రుడు దీనిని చంపివేసెదనని తలచినవాడై సూర్య సన్నిభమైనదియు, ప్రళయకాల వహ్నివలే యున్నదియునగు గొప్ప అస్త్రమును తొడిగి నారినిలాగి లేడిరూపమున నున్నరాక్షసుని గుఱి చూచి వేయగా..

**శ్రీరాముని బాణముచే మారీచుడు హా! లక్ష్మణా! యని అరచి చచ్చుట**

ఆ బాణము మారీచుని ఆ మాయాశరీరమును దూరి వేగముగా వాని

యొక్క గుండెలను బ్రద్దలగునట్లు గొప్పధ్వనితో చీల్చివేయగా ఆ రాక్షసుడగు మారీచుడు నేలమీద పెద్ద తాటిచెట్టువలే భయంకర ధ్వనితో గూలెను. అట్లు మరణమును పొందు సమయమున మాయచే కల్పింపబడిన శరీరమునువీడి ఏ విధముగా జానకీదేవి లక్ష్మణుని దూరముగా పంపించును. రావణుడేవిధముగా సీతను దొంగిలింపగలడు అని యోచించి తగినవిధముగా రఘురాముని గొంతుని బోలిన స్వరముతో హా! సీతా! హా! లక్ష్మణా ! యని అఱచి ఆరాక్షసుడు తన స్వరూపముతో ప్రాణములు విడిచి పడిపోయెను. (తన్ను జంపించిన రావణుడు చావవలయుననియే యిట్లరచెను. మాయాశరీరములు మరణ సురత నిద్రాకాలంబుల నిలవవు) అట్లు రాక్షసరూపముతో, బంగారు ఆభరణములతో వికృతములైన కోరలతో చిత్రాచిత్రములైన కేయూరములతో నిశితబాణ హతుడై రక్తసిక్తాంగుడై చచ్చి పడియున్నవానిని జూచి రాముడు జానకీ దేవిపై మనస్సు పోగా కౌసల్యా తనయుడు, లక్ష్మణుడు చెప్పిన వాక్యములు తనమనస్సున తోచగా తమ్ముడివి తాటకేయుని మాయలని తెల్పెను. నా బాణములచే చచ్చిన రాక్షసుడా మాయావియే అయియుండును. హా! సీతా! హా! లక్ష్మణా! అని అరచూచూ ఈ రాక్షసుడు చచ్చెను. ఆ అరుపులను విని సీతా లక్ష్మణులేవిధముగా భావించు చున్నారో గదాని భయముచే శరీరము గగుర్పొడవగా రామచంద్రుడు తొందర పడుచు ఇంకొక జింకను చంపి ఆ మాంసమును తీసుకొని ఆశ్రమభూమికి వెళ్ళుచుండెను.



# నలువది యైదవ సర్గము

## సీత లక్ష్మణుని రామునికి సహాయముగా వెళ్లమనుట

అచ్చట సీతాదేవి తన భర్త యొక్క కంఠ ధ్వనిని బోలిన ధ్వనిని విని అక్కటా! లక్ష్మణా! యిదేమి? నా గుండె ఝల్లుమనుచున్నది. ప్రాణములు తత్తరమందుచున్నవి. రాముడు తానొక్కడు నెక్కడ చిక్కువడెనో మఱేమి సంభవించెనో గదా. ఏమి చేయుదును. ఆ రాముని జూచుటకై త్వరగా పరువెత్తుము. నీ సోదరుడరుచుచున్నాడు. అతనిని గాపాడుటకు వెళ్లుము. తొందర తొందరగా గొప్ప వీరుడగు నా సోదరుడు తోడగునని ఆశను పొందెనేమో. ఏ విధమైన ఆశపెట్టుకొనెనో. ధైర్యము గలిగిన రాక్షస కోట్లు చుట్టుముట్టగా పెద్ద పులులచే పట్టువడిన ఆవు వలె హడలి పోవడా అని చెప్పినను లక్ష్మణుడు తన అన్న శాసించిన విధమును దలచి వెళ్లక నిలిచి యుండగా చూచి జానకి రోషముతో గూడినదై సౌమిత్రితో నిట్లనెను.

## సీతాదేవి లక్ష్మణుని గోపించి పలుకుట

సౌమిత్రీ! నీ అన్నకు కష్టము కలిగిన కాలమందైనను నీవు తోడుపడుటకు తలంపకుండుటను చూడగా ఔరా! మిత్రునిగా సంచరించెడు గొప్ప విరోధివని తలంచెదను. దుర్బుద్ధీ! రామచంద్రుడు నీకేమి యపకారము గావించెను? వంచకుడా! రామునియందు చాలా ప్రేమయున్నట్లు నటించెదవు. ఆపద వచ్చినప్పుడు మంచివాడిట్లు నిలిచియుండునా? నీ యొక్క ఆలోచనలనన్నిటిని నేను తెలిసుకొంటిని లెమ్ము. రామచంద్రుని యొక్క నాశనము గోరుచున్నావు. పాపచిత్తుడా! నా నిమిత్తమై – ఆ మొర చెవులార వినియు మోహముతో

ముందుకడుగు పెట్టక ఊరుకుందువా? అన్నకు ఆపద వచ్చుట నీకు ప్రియము. నీ మనస్సులో అన్న పై ప్రేమ శూన్యము. ఇది నిజము. నీవు ముఖ్యముగా అడవికి వచ్చుట రామునికై యే గదా. నీకన్న గారి యందభిమానమున్నచో ఆ మహానుభావుని కాపద గల్గినప్పుడు నీవు వెళ్లి సహాయపడక యిట్లు నన్ను కాచుకొని యుండెదవు. నేనింతగా చెప్పుచున్నను మనస్సునందించుకంతైనను భయపడవేల? ఈ విధముగా భయము చెందిన లేడి కన్నులవంటి కనులు గలది యగు సీతాదేవి భయముతో హడలి పోయి బాష్పములు కన్నుల వెంట కారుచుండగా చెప్పుచుండగా ఆమెతో సౌమిత్రి యిట్లనెను.

## లక్ష్మణుడు సీతకు సమాధానము చెప్పుట

ఓ వదినా! యిట్లెందులకమ్మా భయముతో బాధనొందెదవు. నీ భర్తను దేవతలును, మనుష్యులును, యక్షులును, నాగులును, రాక్షసులును, పిశాచులును యుద్ధమునందు ముఖాముఖి ఎదిరించి నిలువగలరా? ప్రాణములు చేదా? ఎవరికైనను ప్రాణములు తీపి కాదా? ఇట్లు మాటలాడుట నీకు తగియున్నదా? నిన్నొక్కదానిని విడచి వెళ్లుటకు నాకు కాళ్లాడునా? మూడు లోకములును ఒక్కటై తనపై కెత్తి వచ్చినను ఇంద్రునితో గూడిన దేవత లందరినైనను రాముడు బాణసమూహముల చేత చంపివేయును. ఓ సీతాదేవీ! నీ భర్త వేగముగా మృగమును జంపి సుఖముగా నిచ్చటికి వచ్చును. నా మాట నమ్ముము. మనస్సును నెమ్మదిగా నుంచుకొనుము. కంగారుపడుటెందులకు? అది రాముని యొక్క కంఠ ధ్వని కాదు సుమా. ఏ మాయలాడో ఆ ధ్వనితో పలికెను. ఏమనవలెను. ఆ రాక్షసుడే గంధర్వ నగరము వలె మాయనొనరించెను. ఇచ్చట రాముడు నిన్ను నా యొద్ద యిల్లడ పెట్టిపోయెను. ఆ మహానుభావుని మాటను వ్యర్థము చేసి ఎట్లు వెళ్లుదును? ఆ ఖరుడు చచ్చినది మొదలు రాక్షసులందఱును విరోధమును పూనియున్నారు. వారలే దుర్మార్గులై యిటువంటి అబద్ధపు ధ్వనిని కలుగజేసి యుందురు. సీతాసతీ! యెందులకమ్మా చింతించుట?

## సీత లక్ష్మణుని నిష్ఠురంబులు పల్కుట

అని సౌమిత్రి చెప్పగా జానకీ దేవి కోపముతో నెఱ్ఱబడిన కన్నులు గలదై కఠినమైన వాక్కులతో సత్యవాదియైన లక్ష్మణునితో నిట్లనెను. "ఓరీ! దయలేనివాడా! వినరా! ఓరీ! క్రూరుడా! అనార్యా! వంచకుడా! ఓరీ! సద్వంశపాంసనుడా! ఉన్నత గుణములు గల రఘురాముని యాపద నీకిష్టమైనది. ఇది నిజము. అట్లు గాకున్నచో కన్నులారా ఆపదను చూచియు ఇట్లు వ్యతిరేకముగా ధైర్యముతో మాటాడెదవా? ఇట్టిదేమి చిత్రము కాదు. జ్ఞాతులెల్లప్పుడును కనిపించని విధమున మనస్సులందు జాలిలేనివారై నీవలనే కీడుచేయుటకు వెరువరు గదా. వింటివా? (లక్ష్మణుని సీత సందేహించెను. లక్ష్మణుడు భరతుని సందేహించెను. రాముడు సీతను సందేహించెను. రాముని లోకులు సందేహించిరి. ఇక లోక నింద తప్పించుకొను శుద్ధాత్ములెవ్వరో గదా) నీ అంతట నీవే వచ్చితివో, లేక కైక పుత్రుడే నిన్ను పంపెనో కాని యిట్లు మాయావేషమును ధరించి ఓ దుష్టాత్మా నా కొఱకై ఒంటరిగా వచ్చితివి. ఒంటరియైన వాత్సల్యనిధియైన రాముని వెంట అభయారణ్యములకు నీవు తోడుగా నుండుటకు వచ్చితివా? కాదు. ఇది నీ కోరికయో, లేక కైకపుత్రుని ఆలోచనయో తెలియుట లేదు. ఇది నెరవేరుననుకొంటివా? ఆ కమలముల వంటి నేత్రములు గల రాముని భార్యనైన నేను కలలో నైన యితరునిగైకొందునా? రాముడు లేకున్నచో ఈ శరీరమున ప్రాణములు నిల్పుకొని యుందునా? ఓ సౌమిత్రీ! చూచుచుండుము. నీవు చూచుచుండగనే ఈ నిమిషమునందే ప్రాణములను విడచెదను.

## లక్ష్మణుడు సీతపై కోపించుచు రామునికడకేగుట

అని జానకీ దేవి వినరాని మాటలను పల్కగా సీతను జూచి శరీరము గగుర్పాటు నొందగా చేతులను జోడించి జితేంద్రియుడగు లక్ష్మణుడిట్లనెను. తల్లీ! దీనికి బదులుచెప్పుటకు మనసొప్పుటలేదు. నీవు నాకు దైవమువు.

ఇట్లనరాని అనుచితపు మాటలు పల్కుట స్త్రీలకు వింతగాదు సుమా. ఇది లోకములోని స్త్రీలందరకు సహజమే. స్త్రీలు ధర్మదూరమైన చెడ్డ మనస్సు గల వారలు, చపలచిత్తలు, ఎంతయో క్రూరస్వభావము గలవారు భేదములకు కారణమగువారు. ఓ జానకీ! నీ మాటలు కొఱ్ఱుగాల్చి చెవిలో గ్రుచ్చినట్లైనవి సుమా. వీనిని కొంచెమైనను నేను సహించుకొనగలనా? న్యాయవాదినై న్యాయముగా బలికిన నన్ను నీవన్న చెడ్డ మాటలను వనములో నున్న వనచరులందరు సాక్షిభూతులై స్పష్టముగా విందురు గాక. ఛీ! నీవిప్పుడే పాడైపోదువు గాక. అన్నమాటను జవదాటక నిల్చిన నన్ను ఈ విధముగా పాపిష్టమైన స్త్రీత్వమునకు సహజముగా సందేహించితివి గాన పాడైపోయెదవు. ఓ అబలా! నేనిప్పుడే రాముని కడకు పోవుదును. నీకు స్వస్తి యగు గాక ఓ పద్మాక్షీ! నిన్ను ఈ అడవిలో నున్న దేవతాసంఘము విడువక రక్షించుచుండుగాక. నాకు శకునములెంతో భయంకరముగా గంపించుచున్నవి. శౌర్యవంతుడైన రామునితో గలసి వచ్చి నిన్నిచ్చుట చూడగలనో లేనో యనిపించుచున్నది. అని లక్ష్మనుడాడిన మాటలను విని బాష్పదారలు కన్నులనుండి కారుచుండ జానకీ దేవి యేడ్చుచు కఠినమైన మాటలతో 'నేను విషమునైన తినెదను. గోదావరిలో బడి చచ్చెదను. ఉరిపోసికొని యైన చత్తును. అగ్ని యందైన దూకెదను గాని కాలి వ్రేలితో నైన నితరుని ముట్టెదనా?' అని పల్కుచు పెద్దగా విలపించుచు, తన చేతులతో గుండెలు బాదుకొనుచుండగా లక్ష్మణుడు సముదాయించు మాటలనెన్నిటినో చెప్పెను. అయినను సీత బదులాడదయ్యెను. అంతట సౌమిత్రి చిన్నగా నమస్కరించి అచ్చటినుండి బయలుదేరి పలుమారులు తిరిగి జానకిని చూచుచు కోపించినవాడై మనస్సున నిష్టములేకున్నను వేగముగా వెళ్లుచున్నట్లే వెళ్లెను.



# నలువది యాఱవ సర్గము

## రావణుడు యతివేషము ధరించుట

అట్లు లక్ష్మణుడు వెళ్లగా అదే సందుగా జేసికొని దశకంఠుడు సీతాదేవిని సమీపించనెంచి వేగముగా సన్యాసి వేషము ధరించి శ్రేష్ఠమైన కాషాయ వస్త్రము గట్టి యెడమ భుజమున దండకమండలువులను ధరించి గొడుగు బట్టి సిగ ముడి వైచికొని, పావుకోళ్లు తొడిగి ఆ రామలక్ష్మణులిద్దరును ఆ పద్మాక్షిని వీడి పోగా సూర్యచంద్రులు లేని సంధ్యాసమయమును క్రమ్మెడి చీకటియోయను నట్లు చంద్రుడు లేని రోహిణీ నక్షత్రమును సమీపించు గ్రహము వలె క్రూరబుద్ధితో సమీపించెను. అతని రాకకు భయముతో చెట్లు కదలవయ్యెను. గాలియు వీచదయ్యెను. వడివడిగా ప్రవహించు గోదావరి మెల్లమెల్లగా నడవుజొచ్చెను. దుర్మార్గుడైన రావణుడిట్లు సత్పురుష రూపుడగుచు గడ్డిచే గప్పబడిన నుయ్యి వలె కపట రూపమును ధరించి ప్రాణనాథుడు దూరముగా వెళ్లినందులకై పరితపించుచున్నదియు, చంద్రరేఖ వంటి ఫాలము గలదియు, పూర్ణిమాచంద్రుని వంటి ముఖము గలదియు, నల్ల కలువల వంటి కనులు గలదియు, స్వచ్ఛమైన పచ్చని పట్టు వస్త్రమును దాల్చినదియు, అగు నా బాలిక యగు సీతను జూచి దుశ్శీలుడగు శనైశ్చరుడు చిత్రా నక్షత్రమును సమీపించుటను దోపింపజేయుచు సమీపించెను. పద్మమున నిలువని పద్మమోయను నట్లు శరీర కాంతి దిక్కుల చిమ్ముచుండగా ఆశ్రమము లోపల ఒంటరిగా గూర్చొని యున్న మెఱుపు దీగ వంటి మేనుగల సీతను..

**రావణుడు యతి వేషమున సీత యొద్దకు వచ్చుట**

మన్మథుని బాణములచే కొట్టబడిన వాడై రావణుడు మోసముతో వేద శబ్దములుచ్చరించుచు చేరబోయి ఆ చంచలాక్షితో వినయముగా నిట్లు పలికెను. ఓ రమణీ! పచ్చని వస్త్రములు దాల్చిన దానా! మనోహరమైన బంగారు వర్ణము గల దానా! చంద్రుని వంటి ముఖము గల దానా! కమలముల దండను ధరించిన సరసి వలె వెలుగుచున్నావు. ఓ కలికీ నీ వెవ్వతవు? భూదేవివా? కీర్తివా? విష్ణు పత్నివా?మన్మథుని పత్నియగు రతిదేవివా? ఓ గజగమనా! దేవ కాంతవా? ఉన్న నిజమును చెప్పుము. ఓ కుందరదనా! నీ దంతములు స్వచ్ఛములు నిగనిగలాడుచున్నవి సమములు మొగ్గల వలె మొనదేరి యున్నవి. ఓ విశాల నయనా! నీ నేత్రములు చివఱలెల్లవారి మధ్యను తెల్లదనము గలిగి విశాలములై నల్లని తారకములు గలిగి యొప్పుచున్నవి. అందముగా బలిసియున్నది నీ విశాల జఘనము. నీ అందమైన యూరువులు ఏనుగు తొండముల వంటి యాకృతి గల్గియున్నవి. ఉన్నతములై వర్తులములై ఒకదానినొకటి యొరుసుకొను చున్నవై మిక్కిలి యందమై యున్నవి నీ స్తనములు. ఓ అబలా నీ స్తనద్వయము తాటి పండ్ల వంటిదై ప్రకాశవంతమై బలిసి పైకి నిక్కి మెరుగెక్కియున్న నీ చనుదోలి రత్నభూషణములచే నొప్పుచున్నదై చూడగోరు వారి హృదయములను వంచించుచున్నది. సుందరమైన చిరునవ్వు గలదానా! అందమైన పల్వరుస గలదానా! మనోహరములగు కన్నులు గలదానా! విలసములకు నిధి యైనదానా! మంచి కేశపాశము గలదానా! మనోహరమై పిడికిట నడగు నెన్నడుము గలదానా! రమణీ! ఒకదానినొకటి యొరయు ఊరువులు గలదానా! కఠిన స్తనములు గలదానా! నదీప్రవాహతీరము వలె ఓ పొలతీ! నీవు నా మనస్సును పలుమార్లు హరించుచున్నావు గదవే! దేవతాస్త్రీలను జూచితిని. యక్షకాంతలను చూచితిని. కన్నులపండువు చేయు కిన్నర స్త్రీలను జూచితిని గాని ఓ సీతా! సౌందర్య విభవము నందు లేడి కన్నులు గలిగిన నిన్ను బోలిన అందమైన స్త్రీని చూచి

యెఱుగను సుమా. ఓ సుకుమారీ! నీ సౌకుమార్య విభవమును నీ రూపమును చూడగా చూడగా ఇచ్చట ఈ అడవి యందు నీవొంటరిగా నుండుట చూడగా వెఱ్ఱియెత్తుచున్నది. ఓ సుందరీ! నీవింటికి వెళ్లిపొమ్ము. భయంకరాకారులును కామరూపధరులు నైన రాక్షసులిచ్చట నెల్లప్పుడు సంచరించుచుందురు. కాన నీవొంటరిగా నుండదగునా? నీకు తగినట్లుగా అలంకరింపబడిన అందమైన బంగారు మేడలందు అంతఃపురములలో ఉండుట తగును సుమా. శ్రేష్ఠమైన వస్త్రములును శ్రేష్ఠమైన భోజనములును శ్రేష్ఠములైన మాల్యములును శ్రేష్ఠుడయిన భర్తయును నీకుండదగును. ఓ పద్మాక్షీ ఇదియే నా గొప్ప అభిప్రాయము. నీవు నిజముగా దేవతాస్త్రీవని నేను మనస్సునందు నమ్మితిని. నిజముగా పార్వతీదేవివో లేక మఱే దేవతాస్త్రీవో చెప్పుము. దేవతలు కిన్నరులు నిందురారు. ఇది రాక్షసుల నివాసము కదా. నీవెక్కడిదానవు? ఇక్కడ నొంటిగా నుండుటకు కారణమును చెప్పుము. కాంతా! పులులును, కోతులును, సింహములును, చిరుతపులులును, ఎలుగుబంట్లును, కంకములును గుంపులుగా నిందు తిరుగుచుండును గదా! ఓ కలికీ! నీకు భయమెట్లు కలుగకున్నదో చెప్పుము. ఓ మదిరాక్షీ! మదించి నవియు, క్రూరములను నయిన ఏనుగులిందు తిరుగుచుండగా మనసునందు భయము చెందక ఎట్లున్నావో కదా చెలియా! ఓ మాదిరేక్షణా! నీవెవ్వరిదానవు? యెవ్వతెవు? నీవిచ్చటికేలవచ్చితివి? ఈ వనములందేల ఒంటరిగా తిరుగు చున్నావు. ఓ జవనీ! ఇక్కడ నెప్పుడును క్రొవ్విన రక్కసి మూకలు సంచరించు చుండును. అని పల్కగా బ్రాహ్మణ వేషమున నున్న ఆ రావణుని ఆ పూబోడి మంచి సపర్యలతో వేగముగా పూజించి మరల..

## సీత యతివేషమున నున్న రావణు సత్కరించుట

ఆ తరుణి కమండలము, కాషాయము ధరించి బ్రాహ్మణ వేషమున నున్న ఆ రావణుని ద్వేషింపరానివాడును, అపాయము కల్గించు దర్శనము గలవాడును అగు బ్రాహ్మణునకు తగినట్లు గానే పూజించి ఈ విధముగా పలికెను. ఇదిగో

దర్భాసనము. ఇందు గూర్చుండుము. ఇదిగో అర్ఘ్యము. ఇదిగో పాద్యము. ఇవిగో ఆడవిలో పండిన పండ్లు నీ నిమిత్తమే యివి. వీనిని తృప్తిగా నారగింపుము అని చెప్పుచున్న ఆ రాజపత్నిని సీతను తన వినాశమునకై రాక్షసాధిపతి అపహరింపవలెనని మనసులో తలంచెను. ఆ జానకీదేవి అడవికి వేటకు వెళ్లిన భర్త తన సోదరునితో మరలి వచ్చునా యని ఆ వనమందు నాలుగు దిక్కులను చూచుచుండెను గాని ఆ రఘూత్తములు కనిపించరైరి. ఉన్నవున్నట్లుగా వనము నందలి చెట్లు మాత్రమే కనిపించుటచే ఆమె మనసు బాధనొందెను.

## సీత మాయాయతికి తన వృత్తాంతము జెప్పుట

తనను దొంగిలించు తలపుతో సన్యాసియై వచ్చిన రాక్షసరాజు ప్రశ్నింపగా ఆ మెచ్చదగిన శీలము గల సీత ఈతడతిథిగా వచ్చెను. బ్రాహ్మణ శ్రేష్ఠుడు. నా విషయమును నేనున్నదున్నట్లు చెప్పకున్నచో కోపముతో శపించునేమో యని తలంచుచు ఒక్క నిమిషము మనమునందాలోచించి వానితో నిట్లని చెప్పదొడగెను. మిథిలానగరాధి పతియై గొప్ప మహాత్ముడైన జనకుని పుత్రిని. నన్ను సీత యందురు. నీకు క్షేమమగుగాక. నేను శ్రీరాముని భార్యను. ఏ కొరతయును లేకుండగా సర్వసుఖసమృద్ధిగా పదిరెండు సంవత్సరములు ఇక్ష్వాకులింట గడపితిని. పదమూడవ సంవత్సరమున రామునకు పట్టాభిషేకము చేయవలెనని రాజు మంత్రులతో ఆలోచించి సర్వవస్తువులును సమకూర్పగా చాతుర్యము గల కైకేయి యనెడి రాజుభార్య తన భర్తయైన మా మామను ఆడి తప్పని వానిగా చేసి నా భర్తకు అరణ్యవాసము తన పుత్రునకు పట్టాభిషేకము ననెడు రెండు వరములను కోరెను. నీ వీ వరముల నీయకున్నచో నేనన్నము తినను. నిదురపోను. నీళ్ళు ముట్టను. రామునకు పట్టాభిషేకము చేసినచో ఇక నాకాయుర్దాయము సరి సుమా. అని చెప్పుచున్న కైకేయి మా మామ సర్ది చెప్పుచున్న మాటలనాయిల్లాలు వినదయ్యెను. ఎదిరింపరాని వాడగు నా భర్తకప్పుడు ఇరువది యైదు ఏండ్ల వయస్సు. ఈ భూమి మీద పుట్టుట మొదలుకొని నాకిప్పుడు పదునెనిమిదేండ్లు. అతడు జగతియందు రామ

నామముచే ప్రసిద్ధికెక్కిన వాడు. గుణవంతుడు. సత్యశీలము గలవాడు. తామర రేకుల వంటి నేత్రములు గల వాడు. ఆజానుబాహుడు. సర్వభూతములకు హితమైన వాడు. అట్టి నా పెనిమిటికి దశరథుడు తన భార్య యొక్క ముచ్చట దీర్చుటకై పట్టాభిషేకము చేయడయ్యెను. తండ్రిని జూడవచ్చిన రాముని జూచి కైకేయి యిట్లు చెప్పెను. రామచంద్రా! నీ తండ్రి యాజ్ఞను వినుము. భరతునందు రాజ్యభారమునుంచి నీవడవులందు పదునాల్గు సంవత్సరములు నివసింపుము. నీ జనకుని సత్యవాదిగా జేయుము. అని కైకేయి చెప్పగా విని భయరహితుడగు నా భర్త జనకుని సత్యవాదిగా జేయుటకై స్థిరచిత్తుడై వనములకు వచ్చెను. ఒకరికిచ్చుటే కాని ఒకరియొద్దనుండి పుచ్చుకొని యెరుగడు. సత్యమునే పల్కును గాని యసత్యమును ఎట్టివేళలందైనను ఆడడు. ఇవే సుమా రామచంద్రుని నియమములు. ఓ బ్రహ్మతేజా! రాముని సవతితల్లి కుమారుడు లక్ష్మణుడు శౌర్యము గలవాడు. అన్నకు యుద్ధములందు సహాయుడగువాడు. శత్రువుల జయించినవాడు. అతిదృఢవ్రకుడు. ధర్మాత్ముడు. అతడు ధనుష్పాణియై మావెంట వచ్చెను. జెడలు ధరించి యతివేషము దాల్చి తమ్ముని తోడను నా తోడను గలిసి రాముడు ఈ దండకారణ్యమునకు వచ్చెను. రాజ్యమును వీడి మేము ముప్వురము నీ యడవులందు దిరుగుచున్నాము. ఒక్క ముహూర్తము నీవిచ్చుటనే యున్నచో నా భర్త వచ్చును. వన్యములగు ఫలమూలములను దెచ్చును. ఓ విప్రుడా! నీ పేరును గోత్రమును, కులమును, నీ నడవడిని నిజముగా దెలియజెప్పుము. దండకాటవిలో ఒంటరిగా తిరిగెదవేల అని తన్నడుగుచున్న సీతాదేవితో ఆ రాక్షసుడు దుర్మార్గుడై గట్టిగా ఓ సీతా! వినుము నా వృత్తాంతము నంతయును.



# నలువది యేడవ సర్గము

## రావణుడు సీతకు తన వృత్తాంతము చెప్పి చెడుమాటలాడుట

ఎవ్వని పేరు చెప్పినచో జగత్తంతయును వణకునో, ఎవ్వడు సర్వదేవతలకు రాక్షసులకు నాయకుడో అట్టి వాడనే ఓ పూబోడీ! నేను రావణుడనువాడను. నీకు క్షేమమును గోరెదను. నిన్ను చూచుటచే మన్మథలీలకు నా భార్యల మీదకు మనస్సు వెళ్లుటలేదు. (సీత హెచ్చరికకు ప్రతివాక్యమిది. ఊపిరి యుండిన నిన్ను విడువనని యర్థము.) ఎందరినో శ్రేష్ఠ స్త్రీలను నేనెత్తికొని తెచ్చితిని. ఓ సుందరీ! నీవు సొంపుగా వారందరికి రాణివి గమ్ము. నా సొగసైన మందిరము గొప్ప సముద్రము మధ్యమున గొప్ప కొండ శిఖరము పైనున్న లంక. ఓ తామర రేకుల వంటి నేత్రములు గల సీతా! అందు నన్ను పొందుము. మోహినీ! అక్కడి బంగారు మేడలను, అక్కడి సుందరములైన వనములను, అక్కడి సౌధవీథులను, అక్కడి అందమైన విహారస్థలములను అధికమైన మక్కువతో జూచి ఆనందముతో నుండెదవేని ఇచ్చటి ఘోరారణ్యములు నీకెట్లు రుచించును? ఓ భామినీ! నీవు నాకు భార్య వైనచో ఉత్తమ కులమున బుట్టిన వారును సర్వాభరణభూషితలును అయిన స్త్రీలు ఆయిదు వేలమంది నిన్ను శ్రద్ధాభక్తులతో ఎల్లప్పుడు సేవింపగలరు.

## సీత రావణుని నిష్టురములు పలుకుట

అని రావణాసురుడు పల్కగా సీత తీవ్రమైన రోషముతో దృఢమైన మనస్సుగలదై రాక్షసరాజును తృణీకరించుచు ఈ విధముగా సమాధానము చెప్పెను. గొప్ప పర్వతము వలె చలింప జేయరాని వాడు, కాంతిచే నింద్రునితో

సమానుడు సముద్రము వలె కలత జందింపరాని వాడు అయిన శ్రీరాముడు నా భర్త. అట్టి రామునకు నేననువ్రతను రాక్షసరాజా! శుభప్రదమైన లక్షణములు గలవాడు, మఱ్ఱిచెట్టు వలె పలువురకాశ్రయమగువాడు, గొప్ప తేజస్సు గలవాడు, సత్యమునందమితాశక్తి గల వాడు నయిన రామునకు నేననువ్రతను రాక్షసరాజా! రాముడు నరసింహుడు. సింహోపరాక్రముడు. విష్ణు సదృశుడు ప్రకాశవంతము లైన భుజములు వక్షస్తలము గల వాడు. అట్టి రామునకు నేననువ్రతను రాక్షసరాజా! రాజపుత్రుడు చంద్రుని వంటి ముఖము గల వాడు. మంచి కీర్తి గల వాడు, జితేంద్రియుడు, అట్టి రామునకు నేననువ్రతను రాక్షసరాజా! చెడు నక్కవు నీవు. దుర్లభయైన ఆడ సింహమను నేను. అట్టి నన్ను కోరువాడవా? సూర్యకాంతిని నేను. అట్టి నన్ను ముట్టుకొనుట నీ తరమా? ఈ విధముగా రాముని పత్నినగు నన్ను కోరుటచే ఓ అదృష్టహీనుడా! ఇప్పుడే నీ కన్నులతో బంగారు చెట్లను చూచెదవు సుమా. రాక్షసా! దురాత్ముడా! గొప్ప ఆకలితో నున్న భయంకరమైన సింహము యొక్కయు, ఘోర సర్పము యొక్కయు కోరలను పెరుక బూనుట. పర్వత శ్రేష్ఠమగు మందరమును అరచేతితో పెరుకబూనుట వంటిది నీవు నరశ్రేష్ఠుడగు రఘూత్తముని భార్యయగు నన్ను నీ మనస్సున గోరుట. అద్భుతమైన పరాక్రమము గల రాముని భార్యను నీవు కోరుట గొప్ప కాలకూట విషమును ద్రావియు సుఖముగా నుండగోరుటయు, వాడిగా నున్న సూదులతో కన్నులను తుడుచుకొనుటయు, పెద్ద బండ కంఠమున నుండగా సముద్రమును దాట దలంచుటయు నగును సుమా. నన్ను నీవు కోరుట యముని ఇనుప శూలము కొనపై దుముకుటయు, బాగుగా మండుచున్న అగ్నిని వస్త్రమునంచున కట్టుకొనుటయు, నాలుకతో ఖడ్గమును నాకుటయు నగును సుమా. రావణా! భయంకరములగు శరముల గల రాముని యొక్క పత్నినగు నన్ను పట్టుకొన దలచుట ప్రకాశమానులైన సూర్యచంద్రులను నీ చేతులతో పట్టుకొనుటగా తలంపుము. భయంకరుడగు శ్రీరాముని ప్రియురాలినగు నన్ను

బట్ట దలంచుట నీ వినాశమునకే సుమా. సింహమునకు – నక్కకును, సముద్రమునకును చిన్నకాలువకును, గరుడునకు – కాకికిని, ఏనుగునకు ఎలుకకును, నెమలికి నీటికాకికిని, మంచి మద్యమునకు – కడుగు నీటికి, చందన జలమునకు – బురద నీటికినీ ఎంత యంతరము గలదో రామచంద్రునకు నీకును అంత అంతరమున్నది. బంగారమునకు సీసమునకును, రాయంచకు గ్రద్దకును, ఉన్నంత భేదమే పరిశీలింపగా ప్రశస్తమైన గుణములు గల రామునకు – వంచకుడవగు నీకును కలదు గదా. బంగారు పుంఖములు గల బాణములు తొడిగిన విల్లుచేబూని ఇంద్ర సమానుడైన రాముడు నాకుండగా అబలనని నన్ను నీవు నీ భుజ శక్తితో హరించినను ఓ రాక్షసనాథా! ఈగ పడిన నేతి వలె నీకనుభవింపరానిదాన నగుదును. అని గట్టి మనస్సుతో కఠినములైన మాటలు పలుకుచుండియు, భయముచే గాలిచే కంపించు లేత అరటి చెట్టు వలె గడగడ వణకుచుండగా ఆ రాక్షసుడామెను భయపెట్టుటకై తన యొక్క కులమును బలమును చెప్పదొడగెను.



# నలువది ఎనిమిదవ సర్గము

## సీతకు రావణుడు తన స్వరూపము చూపి భయపెట్టుట

విశాలమగు తన నొసట బొమముడి వికృతముగా గల్పించి ఆ రక్కసుడు దుష్టమైన కోపముతో, కఠినములైన మాటలతో ఆ కోమలితో నిట్లనెను. ఓ చంచలములైన లేడికన్నులు గలదానా! నన్నేమిగా భావించుచున్నావు? శివుని స్నేహితుడైన కుబేరుని తమ్ముడను. ఆ యక్షరాజు (కుబేరుడు) నాకు సవతితల్లి పుత్రుడు. దశకంఠుడను. రావణుడను పేరు గలిగినవాడను. ఎవనిని చూడగనే గంధర్వులు, నాగులు, పక్షులసమూహములు మృత్యువును జూచినట్లు పారిపోయదరో, ఒకానొకకారణమున కుబేరుడు ఎవ్వనితో యుద్ధమున నెదిర్చి ఓడి పారిపోయనో, ఆ ధనాధిపతియెవ్వనివలన భయముచే సర్వసమృద్ధమై తన లంకానగరమును వీడి వెండికొండ చేరెనో, ఎవ్వడాతని యొక్క కామగమన మైన పుష్పకవిమానమును లాగికొని తన వాహనముగా జేసికొనెనో, అట్టివాడనగు నా ముఖము చూచినంతనే హడలిపోయి నీరసపడి, తడబడుచు ఇంద్రాది దేవతలు వణకుచు పరుగెత్తెదరు. నేనున్నచోట భయము చెందినవాడై వాయువు వీవడు. సూర్యుడు చంద్రుడుగా నగును. ఎక్కడెక్కడ నేను నిలుతునో, నడతునో అక్కడక్కడ చెట్లయందొక్క ఆకైనను అల్లాడదు. ఓ వంకరముంగురుల దానా! నదులును తమవేగమును వదిలి పరుగెత్తుటకు భయపడి సుడులు తిరిగి నిలిచిపోవును. క్రూరులు, భయంకరాకారులునైన రాక్షసులతో నిండిన దియు, ప్రాకారములు, బంగారు ద్వారములు గలదియు, ఏనుగులు, మణితోరణములు మొదలగు వానితో రమ్యమైనదియు, మంగళ వాద్యధ్వనులతో

గూడినదియు, ఉద్యానచరములగు లేళ్లు మొదలగువానితో నిండి, సర్వఋతువుల పుష్పఫలాదులతో నొప్పిన ఉధ్యానవనములు గలదియునై నా పురము ప్రకాశించుచున్నది. ఓ పూబోడి! నగరములన్నింటిలో ఇంద్రుని పట్టణము వంటిదై అధికమైన వైభవములతో అలరారుచున్న లంకయనెడు నా పట్టణమును నీ కన్నుల కరవుదీర చూచుటకు రమ్ము. ఓ మందగమనా! ఆ పురమందు నీవు నాతో గూడ ఆనందముగా క్రీడించుచుందువేని, ఓ కుందరదనా! మనుజ సుందరీబృందమును మనసునందైన తలతువా? మానవుల యొక్కయు, దేవతల యొక్కయు సౌఖ్యములను నాయొద్ద ననుభవించినచో ఆ తరువాత మనస్సునందైనను మానవుడు, ఆయుష్షు క్షీణించిన వాడును, దుర్బలుడును, భాగ్యహీనుడును, హీనుడును అయిన రాముని మనస్సునైన తలంపనైన తలంపవు. నీ మామగారు తన యొక్క గారాబైన కుమారునకు రాజ్యాభిషేకము చేసి జ్యేష్ఠుడైన తనను తిరస్కరింపగా దుర్బలుడై వనములో ప్రవేశించెను. అట్టి దుర్బలుని, రాజ్యభ్రష్ఠుని, అల్పాయుష్కుని, అడవులలో ముని వేషమున దిరుగుచున్నవానిని గట్టుకొని అడవులలో ఏడ్చుచుండుట నీకు తగునా సుందరీ! ఓ కఠిన స్వభావురాలా! మన్మథుని బాణములచే చలించిన మనస్సుగలవాడై ఆశతో, కుతూహలముతో తనంతట తానే వచ్చి వేడుకొనుచున్న రాక్షసరాజును నన్ను సంతోషముతో నేలికొనక తృణీకరించుట నీకు తగునా? ధర్మమగునా? ఓసీ! భీరువా! ఇప్పుడు నన్ను నిరాకరించి తరువాత మన్మథుని వేడిచే తపించెదవు సుమా. భూమి యందు పూర్వము పురూరవుని పాదముతో తన్ని ఊరూతరుణి తపించినట్లు తపించెదవు. రాముడు యుద్ధభూమిలో నా గోటికి గూడ సాటికాడు. అట్టి నన్ను గూడుటకు సంశయించెదవా? ఓ నీరజాక్షీ! నీ యొక్క అదృష్టము పండుటచే నేను వచ్చినాడను. నన్ను త్రోసి వేయవలదు. నన్ను పొందుము. అని రావణుడు పల్కగా ఒంటిగా నున్న సీత కోపించినదై కఠినమైన మాటలతో రావణునకిట్లనెను.

## సీత రావణుని నిందించుట

ఏమిరా రావణా! యక్షులకును గుహ్యకులకును అధిపతియై, భూతములకు నమస్కరింపదగినవాడై గొప్పబుద్ధిమంతుడగు కుబేరుని తమ్ముడవైయుండియు నీవిధమైన పాపము చేయతలంచితివి. ఛీ! ఇంద్రియములను జయింపనివాడును, బుద్ధిహీనుడునుఅగు నిన్ను రాజుగా పొందిన సర్వరాక్షసులును నాశనమైపోదురు. ఇంద్రుని భార్యయైన శచీదేవిని దొంగిలించియైన బ్రతుకువచ్చునేమోగాని, అధికబలవంతుడగు రామచంద్రునిభార్యనగు నన్ను అపహరించి నీకు బ్రతుకదరమా? ఓ దుష్టచిత్తుడా వజ్రహస్తుని భార్యను హరించియైన బ్రతుకవచ్చును గాని భ్రష్టశీలుడా! గొప్పతేజశ్శాలియగు రామచంద్రునిభార్యనగు నన్ను కఠినోక్తులాడినచో అమృతపానము చేసినను యముని జేరెదవు



# నలువది తొమ్మిదవ సర్గము

**అ**ని చెప్పుచున్న సీత మాటలను విని దశకంఠుడు కోపముతో శరీరము తెలియనివాడై తన అరచేతిలో నొండొంటిని చరచుచు ఓ సీతా! వివేకములేని దానా! వినుము నా విక్రమమును. నేనీ భూమియంతయు చేతులతో బట్టి యాకాశమున కెత్తివేయుదునా? యుద్ధమందు మొరవెట్టుచున్నను వినక మృత్యు దేవతను చావ గొట్టుదునో? హిమగిరిని బ్రద్దలగునట్లు గ్రుద్దుదునా? బాణములతో సూర్యుని ఛేదింతునా? సముద్రపు నీటినంతను త్రావి వేయుదునా? మూర్ఖురాలా? మన్మథునివలె రూపము గలిగి మన్మథ సుఖములను గలిగించునున్న భర్తగా జూడమని తన రూపమును భయము కలుగునట్లుగా సీతకు జూపెను. మాయా యతిరూపమును వీడి ఆ దుర్మార్గుడు పదితలలు గలదియు, సూర్యునివలెను, కల్పాంతాగ్నివలెను మండుచున్నదియు, వన్నె బంగారుకుండలములు గలదియు, క్రోధముతో నిండిన కనులుగలదియు, నల్లని మేఘమువంటి కాంతిగలదియు, ధనుర్బాణములు దాల్చిన యమునివలె నున్నదియునగు తన ఆకారమును దాల్చెను. ఎఱ్ఱని వస్త్రమును ధరించి యెఱ్ఱని కన్నులు గలవాడై వేసవి సూర్యుని వంటి తేజస్సుగలదియగు సీతతో రాక్షసేశ్వరుడు విజృంభించినవాడై కఠినోక్తుల నిట్లనెను.

### రావణుడు బలాత్కారముగా సీతనెత్తుకొనిపోవుట

ఓ సీతా! వినుము. నీకు సమానుడైనట్టియు, లోకత్రయము నందు కీర్తిపొందినట్టియు విభుని పొందదలచితివేని నన్ను గలియుము. ఓ కల్యాణీ! నేను మెచ్చదగినవాడను. నీ యందనురక్తిగలవాడను. ఎన్నడును నీ యిష్టమునకు

వ్యతిరేకము చేయబోవను. ఆ మానవుని విడచి శుభము గల్గించుదానవై రాక్షస రాజునైన నన్ను పొందుము. రామునేమి గుణములు జూచి మెచ్చితివి. అతని నేమని మోహించితివి? ఓ మతిహీనురాలా! ఒక స్త్రీ యొక్క మాటను బట్టుకొని రాజ్యమును, బంధుజనులను విడిచి, మృగములు, రాక్షసులుండు అడవిలో శౌర్యహీనుడై దీనుడై తిరిగెడి వానిని ఏమని మోహించితివే. ఓసీ! పండితమానినీ! అని యిట్లు ప్రియవాదినియు, పతివ్రతయు నయిన సీతను కోపముతో పలికి రావణుడు మోహముచే వివశత్వమును పొంది ఆమెను వినువీధిలో బుధుడు రోహిణిని బట్టుకొనినట్లు వేగముగా పట్టుకొనెను. సీతయొక్క జుట్టు నెడమచేతితోను, ఆమె తొడలను కుడిచేతితోను వేగముగా బట్టుకొని మాయా మయమైన గాడిదలు పూన్చిన రథమచ్చట గనిపించగా దశముఖుడంతట భయంకరములగు బెదిరింపు మాటలతో ఆ దుర్మార్గుడామెను బెదరించుచు చంకనెత్తుకొని బలాత్కారముగా లక్ష్మీదేవి వంటి రూపముగల ఆ సీతను రథముపై జేర్చెను. మృత్యుసమానుడును, మిక్కిలి తీక్ష్ణములై పెద్దకోరలు గలవాడును, పర్వతము వంటి మహాకారుడును అయిన రాక్షసుని జూచి అచ్చట నున్న వనదేవతలు అపరిమితమైన భయముతో వనములలోనికి పారిపోయిరి. రావణునిచే పట్టబడిన సీత ఆర్తనాదముతో రామా! రామా! యని అరిచెను. సర్పము వలె రోజుచున్న ఆ జానకి నణచిపట్టుకొని రాక్షసుడాకాశమున కెగిరెను. ఆకాశమార్గమున నీ విధముగా వెళ్ళుచున్న తేరుపై మిక్కిలి ఆపదనొందినదై వెఱ్ఱిదానిదై విభ్రాంతి నొంది ఈ విధముగా విలపించెను.

## సీత రామలక్ష్మణులను బేర్కొని యేడ్చుట

హా! లక్ష్మణా! పెద్దలను సేవించువాడా! ఓర్వలేనివాడై పాపాత్ముడు బలిమితో నన్ను దొంగలించి వేగముగా వెళ్ళుచున్నాడు. అయ్యో! ఓ గొప్ప భుజములు గల వాడా! ఎఱుగవా? (లక్ష్మణుడు సమీపమున నుండు నేమోయని మొదట పిలిచెను) ఓ రఘురామా! జీవితమును సుఖమును అర్థమును గేవలము ధర్మము

కొరకై వదలు కొనిన నీవు ఈ విధముగా రాక్షసుడు నన్నధర్మముగా కొనిపోవు చుండగా కాపాడవా? ఓ రామ అవినయవంతులగు దుర్మార్గుల సమూహముల గర్వమణచి వినయవంతుల నొనర్చు వాడవయ్యును పొగరుచే పాపము చేయుచున్న ఈ అవినీతుడైన దశాస్యుని నేల అణంచవు? ఓ పాపాత్ముడా! రాక్షసరాజా! పాపాత్ముల యొక్క పాప ఫలములు వెంట వెంటనే రావు. అవి కాలముజరుగగా పక్వములై పండు పైరు వలె వచ్చి చేరును. కాలవశముచే ప్రేరేపింపిన మనస్సుచే నీ విధమైన పాపకృత్యమునకు వచ్చుటచే ఓ నీచుడా! ఆ యమధర్మరాజుచే నీ జీవితము ముగియునట్లు మహా దుఃఖమును పొందెదవు. అయ్యో! ధర్మమూర్తియైన రాముని యిల్లాలినగు నన్ను ఈ యధముడు గట్టిగా విలపించుచుండగా హరించుచుండుటచే ఇప్పుడు కైకేయి తన బంధువులతో కోరిక తీరునట్లుగా తనివి జెంది సుఖించును గదా. అడవిలో నున్న ఫల వృక్షములారా! లతలారా! ఆకాశమును చరించు ప్రాణులారా! మీకనేక నమస్కారములు చేయుదును. అయ్యయ్యో! రఘురాముని జూచి వేగముగా రామా! సీతను రావణుడపహరించెనని యిపుడే దయతో చెప్పరా. అందమైన శృంగములు గలిగిన యో మాల్యవత్పర్వతమా! ఓ ప్రశ్రవణ పర్వతమా! వందనము. ఇదే రామా! నీ భార్యను రాక్షసుడు హరించుచున్నాడు చూడుమా యని చెప్పుడు. ఈ దండకాటవియందు వాసము చేయుచున్న అనేక విధములైన పక్షి సమూహములారా! వివిధ వృక్షములందు నివసించు దేవతా కోటులారా! మహా బలము గలిగిన మృగములారా! మీకు నమస్కరించెదను రాముని సమీపించి దయతో నాస్థితియంతయు తెల్పుడు. బెగ్గురు పక్షులతో హంసలతో నొప్పుచున్న ఓ గౌతమీ నదీ! నీకిదే నా నమస్కారము. ఆమేటివిల్కానితో నీ గజగమనను రావణుడపహరించెనని చెప్పుము. ఓ పర్వతములారా! రామునితో నీ ప్రాణ సమానయైన ప్రియభార్యను జానకిని వివశత్వము పొందిన దానిని రావణుడు హరించెను గాన రక్షించుటకు వెడులుమని నాపై దయయుంచి

చెప్పుడు. నా మీదిదయతో ఇంతమాత్రము మాటలు చెప్పి పుణ్యము గట్టుకొనినచో రాముడు తన పరాక్రమముతో నన్ను స్వర్గమున నుంచినను, యముడు దాచినను విడిపించును.

## సీత జటాయువును జూచి పలవించుట

అవి విచారించుచు సీత దేవి ఒక గొప్ప చెట్టు మీద నున్న పక్షిరాజైన జటాయువును జూచి దుఃఖము భయము మనము నందు పెనగొనగా పెద్ద గొంతుతో పిలిచెను. అయ్యా! జటాయువా! ఇదే దురాత్ముడును తరుగని బలము గల వాడును జయింప రాని వాడును, క్రూరుడును, దుర్మార్గుడును అగు రావణుడు ఘోరమైన తలంపు గల వాడై గోల పెట్టు చున్న నన్ను దిక్కులేని దానిని ఇప్పుడు తీసికొని పోవుచున్నాడు. నీకు అస్త్రములు ధరించి యున్న వీని నెదుర్చుట సాధ్యము గాదు. తండ్రీ! జటాయువా! దురాత్ముడైన రాక్షసుడు నన్నీ విధముగా ఎత్తుకొని వెల్లుచుండుటను నా దురవస్థను నీవు వేగముగా వెళ్ళి ఆ యన్నదమ్ములతో నిప్పుడే విన్నవించుము మహాత్మా ఆర్తితో నున్న నన్ను దయతో గాపాడుము.



# ఏబదియవ సర్గము

## జటాయువు రావణుని దూషించుట

అని కేకలు వేయుచున్న సీత వాక్కులను కుఱకుఱ నిద్రవోవుచున్న జటాయువు విని లేచి ముద్దరాలైన సీతను – రావణుని జూచి 'రావణా! నేను సనాతన సద్ధర్మమునందాసక్తి గల వాడను. సత్య జ్ఞానము గలవాడను క్రూరమైన బలముగలవాడను జటాయువను గృధ్ర రాజును. తెలిసికొనుము. ఓ దేవతా విరోధీ! రాముడు సర్వజగములకు హితకరమైన బుద్ధి గలవాడు. దశరథ కుమారుడు ఇంద్ర వరుణులతో సమానుడు. జగజ్జనులకెల్ల రాజు. ఆ లోకపాలకుడగు ఆ రాముని యిల్లాలిని కీర్తి నొందిన దానిని సీతను దొంగిలించుట తగునటరా! ధర్మతత్పరుడై యుండవలసిన భూపతికి పరుని భార్యను దొంగిలించుట తగునటరా! దానిలోని రాజు భార్యను ముఖ్యముగా కాపాడవలెనని యెఱుగవా? పర భార్యను హరింప నెంచుట మిక్కిలి నీచము. ధీరులచే నిందింపదగినదని తెలియలేవటరా? ఓ క్రూరాత్ముడా! నీకిది తగు బుద్ధిగాదు. సీతను విడచిపెట్టుము. తన భార్యను రక్షించుకొను రీతిగనే ప్రాజ్ఞులు పరుల భార్యలను కూడా రక్షింప దగునని తలంపుము. ధర్మనిరతులైన రాజులు శాస్త్రములు గర్హించినట్టి ధర్మార్థకామములకు ఆశపడరు. ఓ పులస్త్య పౌత్రుడా! స్ఫష్టముగా వినుము. ధర్మార్థకామములను సత్కర్మలను చేయు రాజే గొప్ప నిధి యగును సుమా. ధర్మమో, పుణ్యమో, పాపమో యేదైనను ఎల్లప్పుడును రాజు వలననే వృద్ధి చెందును. ఓరీ! పాపస్వభావుడా! చపలా! సాధువులను బాధించు వాడా! పాపాత్ముడు స్వర్గమును బొందినట్లు నీవేవిధముగా ఇంతటి

యైశ్వర్యములను పొందగలిగితివి. పుట్టుకతో వచ్చిన బుద్ధి కట్టెలతో గాని పోదు గదా! దుర్మార్గున కెంత గట్టిగా బుద్ధులు చెప్పినను అవి మనస్సునకు పట్టునా? పట్టినను అవి స్థిరముగా నిల్చునా ? నీ పట్టణము నందు గాని రాజ్యము నందు గాని జానకీపతి విరోధమేమైన చేసెనా ? ఇట్లేల ఉత్తపుణ్యాన కయ్యమునకు కాలు దువ్వుచు గొప్పవాడైన రాముని పట్ల నేరము చేయ తలపెట్టితివి. వినుము నీకు దీనిచే ఆపద సంభవించును. రాక్షసరాజా! గొప్ప మదముచే గర్వించిన వాడై జనస్థానమున నివసించుచున్న ఖరుడు శూర్పణఖా నిమిత్తమై చచ్చెను గాని రఘురాము నెదిరించి చేసిన కార్యమేది? ఓ రావణా! ఈ విధముగా రాముని భార్యను దొంగిలించి నీ వనుభవించున దేమున్నది. వద్దు వద్దు రాక్షస రాజా! సీతాదేవిని బలవంతముగా తీసికొనివెళ్లుట పాపము. నీకిది తగదు. ఆ రామునకు తెలిసినచో నిన్ను చూపులచేతనే కాల్చి వేయును. వజ్రాయుధముచే ఇంద్రుడు వృత్తుని జంపినట్లు నిన్ను చంపివేయును. ఓ దురాత్మా! కోఅలలో విషము గల గొప్ప సర్పమును కొంగున గట్టు కొనియు, మెడకు యమపాశమును చక్కగా బిగించుకొనియు రాగల కీడు నెఱుంగ జాలకున్నావు. ఓ కుమతీ! మోయ గలిగి నంత భారమునే మోయ దలపెట్టవలయును. రోగము కలుగనీయక యే వస్తు వెంత అరుగునో అంతే భుజింప వలయును. ఏ కార్యము చేత లోకమునందు కీర్తియు ధర్మమును చెడునో శరీరమునకు బాధ కలుగునో ఆ కార్యమును బుద్ధిమంతుడగువాడు చేయదగునా? ఓ సురవైరీ! ఇప్పుడు నాకఱువదివేల యేండ్ల వయస్సు. ఏ ఆటంకము లేక పైతృకమైన రాజ్యమును నేలితిని. నీవు దార్యము గల యౌవనముచే నొప్పుచున్నవాడవు. విల్లు, రథము, బాణములు గల శూరుడవు. నేను ముసలివాడను. ఐనను నీవు జానకిని హరించికొని సౌఖ్యముగా వెళ్లజాలవు. చెప్పుచున్నాను. ఓ దానవా! నేను చూచుచుండగా నీవు జానకిని స్థిరమైన వేదార్థమును తర్క హేతువుల వలె హరింప జాలవు. పౌరుషమున్నచో నాతో

తలపడుట కొక్క నిమిషము నిలువుము. మునుపు ఖరుడు మొదలైన రాక్షసుల వలెనే నీవును ఈ నేలయందే దీర్ఘనిద్ర నొందెదవు. ఆ రాముడెన్ని పర్యాయములో రాక్షసులను సంహరించినట్లే నిన్ను కూడా పరిమార్చును. శూరులైన రాజపుత్రులు దూరముగా వెళ్ళుటను చూచి అబల యైన సీతను తీసికొని భయము చెందిన వాడవై పారిపోయెదవా?నేనేమి చేయగలను? వినరా! నా శరీరమున ప్రాణములుండగా తామర రేకులవంటి నేత్రములు గలదియు, రఘురాముని జీవితేశ్వరియు, భూపుత్రియునయిన సీతను కొనిపోనీయను. నాకు ప్రాణ గండమైనను ఆ మహాత్ముడగు రామునకు, దశరథునకును ప్రియము చేసెదను. నా దుర్వారమైన పరాక్రమముతో ప్రకాశించెదను. పోకుమురా పోకుము. నిలుము నిలుము. పంక్తికంతా! ఎక్కడికి పోగలవు? నిన్ను తలపడి నా పరాక్రమముకొలదీ నీకు యుద్ధాతిథ్యమొసగెదను. నీవును వెడలిపోక దానిని స్వీకరింపుము. నాపరాక్రమమును చూడుము. నిన్ను తొడిమనుండి రాలిన పండు వలే రథము నుండి కడు వేగముగా భూమిమీద పడద్రోయుదును.



# ఏబది యొకటవ సర్గము

## జటాయు రావణుల యుద్ధము

ఆ మాటలను విని పంక్తి కంఠుడు దురాగ్రహముతో గూడిన రోషము గలవాడై యిరువది కనుల నిప్పుకణములు రాలుచుండగా జటాయువు నెదుర్కొనెను. అట్లు తలపడి నంతనే ఆకాశమున ప్రళయకాలమందలి పెనుగాలుల తాకిడిచే నెగురగొట్టబడిన పెద్ద మేఘముల వలెను, రెక్కలతో గూడిన రెండు మాల్యవత్పర్వతముల వలెను వారిద్దరు గన్పట్టిరి. ఇట్లు వారిరువురకు ఆశ్చర్యకరమగు యుద్ధము జరుగుచుండగా దశకంఠుడు భయంకరులై వాడియైన బాణములను కుప్పలు కుప్పలు గా జటాయువుపై విడువకుండగా వర్షధారలవలె కురిపించగా, ఆ శర వర్షమును జటాయువు తన గొప్ప ముక్కు తోడను వాడియైన గొప్ప గోళ్ళ తోడను భూమియందు పడవైచి క్రోధముతో ఆ రాక్షసుని శరీరమును పుండ్లు పడునట్లుగా గోళ్ళతోను కాళ్లతోను గీరి యెంతయో నొప్పి కలుగజేయగా రాక్షసరాజు యముని దండముతో సమానమై భయంకరములైన పది బాణముల నెక్కుపెట్టి జటాయువా! వీనిచే నీవు చచ్చెదవు సుమా అనుచూ నారిని లాగి వేగముగా నతనిపై వైచెను. వానికి భయపడక ఆ రాక్షసుని రథముపై నున్న జానకిని భాష్పపూర్ణ లోచనను చూచి విరోధిపై సాహసమును జూపుచు వానిపైకి దూకి ముత్యములు పొదిగినదియు, వాడియైన బాణములు సంధించినదియు నగు అతని వింటిని రెండు ముక్కలై పడునట్లుగా త్రుంచి జటాయువు భూమిపై పడవేయగా, రావణుడింకొక విల్లు ధరించి శౌర్యముతో విడువని కోపముతో బాణసమూహము

లచే ముంచగా ఆ బాణముల మధ్య కొంచెముసేపు జటాయువు గూటిలోనున్న పక్షివలె నుండియు విపరీతమైన రెక్కల వేగముతో ఆ బాణములనెగురగొట్టి విల్లు త్రుంచెను. ఆ రాక్షసుని యొక్క గొప్పనైన కవచమును తన రెక్కల దెబ్బచే పొడియై నేల రాలజేసెను. బంగారపు కవచములు తొడిగిన పిశాచఖరములను చంపి నేలబడనేసెను. స్వేచ్ఛాగమనము గలదియు, మంచి నొగలతో గూడిన దియు, అగ్ని వంటి కాంతి గలదియునగు రథమును భూమిపై పడగొట్టి చంద్రునివలె తెల్లనై ప్రకాశించుగొడుగును, వజ్రములను వాటిని పట్టుకొన్న వారితో గూడ నేలకొరుగజేసి ముక్కుతో సూతుని తలను పట్టి త్రుంచివేయగా ఆ రాక్షసాధిపతి విరిగిన విల్లు గలవాడును, చచ్చిన సారథిగలవాడును, నేల కొరిగిన గుఱ్ఱములుగల వాడును అయి సీతను గట్టిగా అంకమున బట్టుకొని భూమిపై బడును. విల్లు విరిగినవాడై, విరిగిన వాహనములు గలవాడై నేలపై బడిన దేవతా విరోధిని జూచి భూతజాలములన్నియు పక్షిరాజును మేలు మేలని మంచి పొగడ్తలతో మెచ్చుకొనెను. ముసలివాడగుటచేత బడలిక జెందియున్న మహాబలశాలియగు ఆ పక్షిరాజును జూచి ఆ మనుజాశనుడగు రావణుడు సంతోషముతో సీతతో గూడ ఆకాశమున కెగిరెను. అట్లు వెళ్ళుచున్న రాక్షస రాజును చూచి జటాయువు తెగింపు జేసి రావణునకడ్డుపడి అతనితో నిట్లనెను. వజ్రాసమానమైన బాణములుగల ఆ రామచంద్రుని భార్యను నీవు తీసికొని వెళ్ళుట రాక్షస కులము మూలముట్టుగా చెడిపోవుటకే సుమా.

**రావణుని జటాయువు పరుషోక్తులాడుట**

ఓ వివేకము లేనివాడా! స్నేహితులతోడను, బంధువులతోడను, పుత్రుల తోడను, మంత్రులు సైన్య సమూహములతోడను, మనుమలతోడను గలిసి విషమును పవిత్రమని త్రాగెదవా? రాగల ఫలితమును తమ మనమునందు గనిపెట్టలేనివారై మూఢులు బుద్ధిలోపముతో ఉద్రేకముతో అకార్యము చేసి చివరకు నీవలె ఆపదలందు మునిగెదరు. యముడు నీమెడయందు పాశమును

బిగింపగా యెచ్చటికి పోయినను నీకేవిధముగ చావు తప్పునురా? ఎఱతో గూడ గాలమును మ్రింగిన విధముగా నైతివిగదరా. శక్యము కానిదని యెఱుగక మహాత్ములైన వారితో పగపెట్టుకొంటివి. వారు నీకంటె తక్కువ వారుగారు. నీవీవిధముగా తన యాశ్రమములోనున్న సీతను దొంగలించుటచే భయంకరమైన రోదమును పొందినవాడై రాముడు నిన్ను బంధువులతో సహ యుద్ధమునందు చంపివేయును. ఓరీ రావణా ! చెడిపోకుము. భీరువువలె ఈ సీతను దొంగలించి వేగముగా పరువెత్తెదవు. మనస్సునందాలోచించి చూడగా ఇది జగము నిందించెడి దొంగపనికాని పౌరుషము గలవాని విధమా? నీవు శౌర్యవంతుడ వయినచోఒక్క ముహూర్తకాలము నిలువుమురా రావణా ! యుద్ధమందు రాముని జేత నీవునూ నీ తమ్మునివలెనే పెద్ద నిద్రను పొందెదవు. మరణము సమీపించినచో పురుషుడు తననివాసమునకు కారణమైన పాపమును తలపెట్టును. అట్టి చెడుపనిని నీవిప్పుడు చేయ దలపెట్టితివి. రాక్షసా! ఏపురుషుడైనను, లోకమంతయు నేలువాడుగానీ, ఆ బ్రహ్మదేవుడుగానీ తన ప్రాభవము నశించుటకే పాపానుబంధకార్యమును చేయును. అనియిట్లు హితకరములైన నీతి వాక్యములను చెప్పుచు వేగముగా వీపుపై వ్రాలి తన గోళ్ళతో అతని శరీరమును చీల్చుచు మదమతిశయించి చెలరేగిన ఏనుగును మావటీడు సాటిలేని అంకుశముతో వేగముగా క్రుచ్చుచు లొంగదీసికొనినట్లు వాని వేగము తగ్గునట్లు ఒనర్చెను. జటాయువు తన వాడియైన గోళ్ళతోను, తన ముక్కనెడు బాణముతోను రాక్షసుని తలవెంట్రుకలను గొప్ప బలముతో వట్టి లాగగా రావణుడు కోపముతో పెదవి గొరికికొనుచు గిఱ్ఱున దిరిగెను. అట్లు తిరిగి భూపుత్రిని యెడమవైపున బట్టుకొని గొప్ప వేగముతో హస్తముతో జటాయువును గొట్టెను. అరుణపుత్రుడా దెబ్బకు తప్పుకొని యెదుటకు తిరిగి రావణుని యెడమ చేతులను పదింటిని తన ముక్కుతో త్రుంచి నేలపై పడవేయగా ఆ పదిచేతుల సమూహము వెంటనే పుట్టలోనుండి విషముతోగూడిన పాములు

వెలువడినట్లు మరల మొలిచెను. అంతట దశకంఠుడు భరింపరాని రోషముతో మండుచున్న కన్నులు గలవాడై సీతాదేవిని విడచి పిడికిళ్ళతో గ్రుద్దుచు కాళ్లతో తన్నుచు పక్షీంద్రుని మహా పరాక్రమముతో తాకగ ఆ పక్షిరాజునకును రాక్షసేంద్రునకును కొంతసేపు ఘోర యుద్ధము జరిగెను.

## రావణుడు జటాయువు యొక్క రెక్కలు నరకుట

అప్పుడు శ్రీరామునికై శ్రమించుచున్న పక్షిరాజుయొక్క పాదములను పెద్దరెక్కలను పదనుగల కత్తితో రాక్షసుడు భూమిపై పడునట్లుగా నరకెను. అట్లు నరుకగా గుఱగుఱమనుచు గొంతుకయందు కొద్దిగా ఊపిరాడుచుండగా ప్రాణములు పోవుచున్న జటాయువునకై సీతాదేవి స్వంత బంధువునకు వలె దీనముగా నేడ్చెను. చీకటి కొండవలె నేలపై పడియున్న జటాయువును తెల్లని వర్ణముగల ఎద గలవానిని రావణుడు చూచెను. చల్లారిన దావాగ్నివలె రాముని ఆశ్రమ సమీపమున బడియున్నవాడును కంఠగతప్రాణుడును అగుజటాయువును జూచి..



# ఏబది రెండవ సర్గము

## సీత రామలక్ష్మణుల గూర్చి యాక్రోశించుట

ఆ జానకీదేవి కౌగిట పట్టుకొని కోకిల వంటి కంఠము గల ఆమె అధికమైన ఆర్తితో భాష్పములు కాలువ గట్టుచుండగా ఇట్లు విలపించెను. ఓ రామా ! శరీరములందు కలుగు కొన్ని లక్షణములు రాబోవు సుఖ దుఃఖములను సూచించును. అట్లే పింగళపక్షి మొదలుగా గల పక్షుల కంఠధ్వనులును కొన్ని దుర్లక్షణములను సూచించును. అందులకే ఈ మృగముల పక్షులసమూహములు నిప్పుడు నీ యొద్దకే నా దుర్దశను నీకు తెల్పుటకు గాబోలు పరువెత్తుచున్నవి. ఓ రాజా! నీవిప్పుడైన తెలియలేకున్నావా? ఇంతవఱకు కూడ నీవు నీ భార్యకు జరిగిన పరాభవమును తెలిసికొనలేదు కనుక నా పాపము తక్కువది కాదని నిశ్చయించుకొంటిని. నన్ను రక్షింపదలచి ఈ పుణ్యాత్ముడగు పక్షిరాజు ఈ నీచుని చేతిలో మరణించెను. ఔరా నా దురదృష్టము ఇతని నేల బ్రతుకనిచ్చును? రామా! నన్ను కాపాడగా రమ్ము. లక్ష్మణా! వేగముగా రక్షించుటకు రమ్ము. తండ్రీ! ఇంద్రవిరోధియగు రాక్షసుడు నన్నెత్తుకొని వేగముగా వెళ్ళుచున్నాడు. ఈ నా ఆర్తనాదమును రఘువంశ శ్రేష్ఠులు సమీపమున నున్నచో విందురుగాక అని యేడ్చుచుండ కన్నీరు జడివానగా కురియుచుండగా సమీపమున నున్న యొక చెట్టు నా సీత తీగవలె చుట్టుకొనగా ఆ మనుష్యభోజనుడు విడువుము విడువుమని అదలించి జడిపించుచు ఆమెయొక్క పొడవైన జుట్టు విడువక పట్టి ఈడ్చెను. అతడట్లు చేయుటకు కారణము యమధర్మరాజు తననట్లు సిగపట్టి యీడ్చుచుండుటే.

రామా! రామా ! రాఘూత్తమా! యని గొప్పధ్వనితో నేడ్చుచుండగా ఆ స్త్రీరత్నము యొక్క శిరోజములను పట్టి రాక్షసాధిపుడీడ్చెను. ఆ సమయమున సచరాచరములయిన జగత్తులన్నియు అధికమైన చిమ్మచీకట్లు క్రమ్మినవియు, మర్యాదారహితములునై వ్యథతో విచారమున మునిగెను. అప్పుడు గాలి వీవధయ్యేను. సూర్యుడు వెలవెల పోయెను. సీతను రావణు మదమతిశయించి బాధించుచుండుట నెఱిగి బ్రాహ్మదేవుడు కార్యము చక్కబడేనని తలంచెను. సీతయొక్క బాధను రావణునకు జరగబోవు కీడునుచూచుచు దేవతలును ఋషులును శోకమును సంతోషమును పొందిరి.

## రావణుడు సీతనెత్తుకొని పరువెత్తుట

రామా! రామా ! అనుచును సౌమిత్రీ ! అనుచును ఏడ్చుచున్న జనకుసుతను ఆకాశమార్గమున అతివేగముగా తీసికొని రావణుడు పరువెత్తెను. మేఘము వంటి దేహముగల రాక్షసుని ప్రక్కన బంగారు రంగు గల సీత వానకాలపు మెఱుపు తీగ వలె ప్రకాశించెను. ఆ సీత యొక్క బంగారువస్త్రపు చెరగు గాలి కెగురుచుండగా రాక్షసరాజు కీడును లోపింపజేయుచు అగ్నితో ప్రకాశించుచున్న పర్వతము వలెనుండెను. ఆ సీతాదేవి ధరించిన పరిమళముతో గుడిన ఎఱ్ఱ తామరపూరేకులు గాలిచే కొట్టబడి రాక్షస నాయకునిపై రాలి భూమిపై బడెను. కళ్యాణగుణములు గల ఆ జానకి యొక్క పట్టు వస్త్రము బంగారురంగుతో ఆకాశమునందు మిక్కుటమైన యెండచే ఎఱ్ఱగా జేయబడిన మేఘము వలె కన్పట్టెను. ఆ రాక్షసరాజు యొక్క అంకమందున్న సీతాదేవి యొక్క అందమైన ముఖము ఆరాముడు తోడు లేకపోవుటచే తూడులేని పద్మము వలె కాంతిహీనమై యుండెను. సుందరమైన లలాటమును జుట్టు యొక్క సొగసును గలిగి సుకుమారమును, లోపరహితమును, వికసించిన పద్మముతో సదృశమును అగు సీత యొక్క మొగము మేఘమును చీల్చుకొని ఈవతలికి వచ్చిన చంద్రబింబమువలె నొప్పెను. సుకుమారములైన తెల్లపల్వరుసయు, సంపెంగ

మొగ్గవంటి నాసికయును, బంగారు ఆభరణముల వికాసమును ఎగిరిపడుచున్న శిరోజములును, పండిన దొండపండువంటి పెదవియు, గలదియగు సీతాదేవి యొక్క ముఖము రావణాంకస్థితమై పగటను దయించిన చంద్రబింబమోయను నట్లుండెను. చూడగా ఆ నల్లని ఆకారముగల రాక్షసుని ప్రక్కన బంగారు రంగుగల సీత ఆకాశమున ఇంద్రనీలమణితో గూడిన బంగారు వడ్డాణము వలె నుండెను. ప్రకాశవంతమైన పుట్టము పెట్టిన బంగారు ఆభరణములచే మనోహరియై పద్మమువంటి గౌరవర్ణము గల సీత మేఘము వద్దనున్న మెఱుపు వలె ప్రకాశించుచుండెను. పగడపు దీగవలె నున్న సీతాదేవి నల్లని శరీరము గల ఆ రాక్షసుని బంగారపు నడుము పట్టీచేత కట్టబడిన ఏనుగు వలె కనబడ జేసెను చంచలమైన నేత్రములు గల ఆ సీత యొక్క బంగారు ఆభరణముల యొక్క ఘల్లుఘల్లు మను శబ్దములతో గూడిన ఆ రాక్షసరాజు మెరుపు ఉరుములు గల మేఘము వలె నొప్పెను. జానకి యొక్క తలలో నుండిన పువ్వులు ఆ రాక్షసుడు పరువెత్తు వేగముచే రాలి నేలబడుచు సుడులు తిరిగి రావణుని చుట్టు తిరుగుట నక్షత్రములు వరుసగా మేరుపర్వతము చుట్టును దిరుగుచున్న విధముగా దోచెను. భూపుత్రి యొక్క రత్నములు తాపిన కాలి అందె వేగముగా జాఱి మధురమైన శబ్దము చేయుచూ మెరుపుతీగె చక్రమో యన్నట్లు నేలకు వ్రాలెను. రావణుడా రాముని భార్యను పెద్ద ఉల్కను వలె పట్టుకొని వేగముగా ఆకసమున పరువెత్తుచుండగా ఆమె యొక్క బంగారు ఆభరణములు అగ్ని వలె ప్రకాశించున్నవి. చుక్కలవలె నేల వ్రాలెను. ఆమె యెదపై నుండి జారిన చంద్రుని వలె తెల్లనైన హారములు క్రిందకు బడుచు ఆకాశగంగవలె నుండెను. పక్షులతో గూడిన చెట్లు గాలికి కదలుచున్న కొమ్మలతో ఆ సీతను భయము వీడుమనునట్లుండెను. భయపడిన చేపలు మొదలగు జలచరములతో నశించిన కలువలు, పద్మములు మున్నగు పుష్పములతో గూడిన కొలనులన్నియు ఊపిరి నిలిచిపోయిన ప్రియసఖి వలె భూపుత్రికై విచారించు చుండెను. బలమైన పులులు, సింహములు, పక్షులు, మృగములు విడువని

రోషముతో సీత యొక్క నీడవెంబడి ఆకాశము వంక జూచుచు పరువెత్తుచుండెను. భూపుత్రియొక్క విపద్దశను చూచి పర్వతములన్నియు సెలయేళ్ళనెడు కన్నీరు దొరగుచుండగా ఎత్తైన శిఖరములనెడు చేతులనెత్తి గుహలలోనుండి వెలువడు గాలియొక్క శబ్దముల నెపముతో ఏడ్చెను. సూర్య మండలము దైన్యముతో వెల్లబారినదై సాగెను. ఎక్కడ ధర్మము? ఇంకెక్కడి సత్యము? ఇక పుణ్యమెక్కడిది? ఋజుత్వమెక్కడ? అహింస యెక్కడ? ఈ కుటిలుడైన రాక్షసుడు దిక్కులేనిదానినివలె కఠినత్వముతో మోసగించి తీసికొని పోవుచుండగా లోకమందొక్కడైనను కాదను వాడు లేదు కదా ! అయ్యో యని భూతసంఘములన్నియు నేడ్చెను. ముఖములు వ్రేలాడుచుండగా భయముతో చలించుచున్నవై కన్నీరు కార్చుచు మృగ శిశువులు సీతాదేవి వెళ్ళుచున్న మార్గమునే చూచుచు దుఃఖించుచుండెను. భూమిని జూచూచు సన్నని గొంతుతో రామా! లక్ష్మణా! యని పలవరించుచు ఏ దిక్కునుండియైనను ఎవ్వరైన నడ్డమురారాయని చూచూచు వెళ్ళుచున్న సీతను జూచి వణుకుచున్న శరీరములతో వనదేవతలు గొప్ప స్వరముతో బోరుననేడ్చెను. తెగిపోయిన తారహారములును, బీటలువారిన దొండపండువంటి పెదవియు, కరగిన తిలకమును, చెదరిన కాటుకయును, చిక్కులు వడిన శిరోజములునుగల ఆ సీతను తన వినాశనమునకై పట్టుకొని రావణుడు వెళ్ళుచుండగా భయముతో తల్లడపడుచు వివర్ణమైన ముఖముతో సీతయు ఏడ్చుట చేతను, క్రోధము చేతను కన్నులెఱ్ఱవడగా లోక భీకరుడును, చంపుటయందాసక్తి గలవాడును అగు నా రావణునితో మర్మములను భేదించునట్లుగా కఠినోక్తులతో నిట్లనెను.



# ఏబది మూడవ సర్గము

## సీత రావణుని నిందించుట

ఏమిరా! రావణా! ఒంటరిగా నున్న నన్ను జూచి యీ విధముగా దొంగిలించుకొని తెచ్చి భయపడి పారిపోవుటకు సిగ్గు లేదటరా! ఓరీ! రాక్షసవంశ దావాగ్నిహెూత్రుడా! మృగరూపముచే వనము నందు నా మనోనాయకుని దూరము చేసినది కూడ నీ మటుమాయయేకదా. ఓరీ హీనచరిత్రుడా! నా మామగారి స్నేహితుడును నన్ను రక్షింప వచ్చిన వాడును అగు ముసలి గ్రద్దను పెద్దగాయుద్ధము చేసి చంపితివి. ఔరా!ఎంత శూరుడవురా! ఆహా! యేమి నీ బలము. పేరు చెప్పుకొనుటకైనను ధైర్యములేక యుద్ధమందు నన్ను గెలువలేక ఓరీ దుష్టరాక్షసుడా! దొంగిలించి పారిపోయెదవా? దురాత్మా! బాలిశా! కొంచెమైనను సిగ్గులేదటరా? ఛీ! శూరుడనని నీకు నీవే భావించు కొనుచున్న నిన్ను, ద్రోహిని చూచి మగవారు పరిహసింతురు సుమా. నీచుడా పెద్దబలవంతుడనని, శౌర్యవంతుడనని ప్రేలుచున్నావు. ఇస్సీ! అవి యన్నియు కల్పనా? దురాత్మా! ఎల్లకాలము అపకీర్తిని వంశ నాశమును గలిగించు పనిని తలపెట్టితివి. ఒక్క నిమిషమైనను యుద్ధవీరుడవై నిలిచిన చాలు. అంతట ఈ శరీరముతో ఈ విధముగా వెళ్ల గల వేమో చూడుము. చావు పరుగున పరుగెత్తు నిన్ను రాజేమి చేయగలడు? ఏది చూతము. ఒక నిమిషమిందు నిలిచి యుండుము. నీ యొక్క ఘోరమైన పనికి తగిన ఫలితమును కుడవ జేయగలడు. ఓరీ దుష్టరాక్షసా! ఆ రాజపుత్రుల కన్నుల యెదుట నీవిప్పుడు కనిపించినచో

నీవును నీసైన్యములును ఒక్క నిమిషమైన ప్రాణములతో నుండగలరా? ఓ రాక్షసరాజా! అడవులలో రేగిన దావాగ్నిని సమీపించుటకు శక్తి లేని పక్షి వలె నీవును వారి బాణములను కన్నులెత్తి తేరి చూడలేవు సుమా. వినురా! నీకు మంచి చెప్పెదను. నన్ను విడిచి పెట్టుము. నా మాటలు వినకున్నచో నన్నపహ రించుట వలన కలిగిన మహారోషావేశముతో రాజపుత్రుడు తన తమ్మునితో కలిసి దర్పముతో నీ శరీరమును కాకులకును, నక్కలకును, గ్రద్దలకును తనివి తీరునట్లు విందుగా అర్పించును సుమా. ఏదో కోరికతో నీవు నన్ను తీసికొని ఎంతో వేగముతో పారిపోవుచున్నావు. నా మాటలు వినుము. ఓ మాయావీ! నీ ఆ ప్రయత్నము ఎన్నటికిని సాగబోదు సుమా. జయింప రానివాడును, లోకాధిపతులతో సాటి వచ్చు వాడును అయిన నా భర్త యగు రాముని వీడి శత్రువుల యధీనమున నున్న దాననై నేను చిరకాలము బ్రదుక నేరను సుమా. లోభి వాడు చనిపోవు సమయమునందు విపరీతముగా భుజించు విధముగా నీవును చపలత్వముచే నీక్షేమమునే తెలిసికొన లేకున్నావు. పాపాత్ముడా! చావనున్న వేళలో మానవునకు పథ్యము చేదగును. ఇది నిక్కము. నామాట వ్యర్థము గాదు సుమా. నిన్ను యముడు ఆతిథ్యమున కీడ్చుచున్నాడు. ఇంతటి పాపకార్యము నొక్కింతైనను జంకు గొంకు లేక నిశ్చింతగా జేయ బూనుటచే సత్వరమే నీవు బంగారు వృక్షములను జూచెదవు సుమా. భయంకరమైన వైతరణీ నది నీదగలవు. ఆసిపత్రవమున విహరించెదవు సుమా. నీ మనస్సునందు నమ్ముము. బంగారు పుష్పములతో గూడినదియు, వైడూర్యముల ఆకులు గలదియు, దృఢమైన నల్లని యినుప ముండ్లు గలదియు నయిన యమలోకపు బూరుగుచెట్టును చూడగలవు సుమా. హీనచరిత్రుడా! అంతటి మహాత్ముడైన రాముని వంచించి శరీరమున ప్రాణములు నిలుపనేర్తువా? దయలేనివాడా! విషము త్రాగిన వానివలె నీ చరిత్రము నేటితో ముగిసెను యమభటుల యొక్క

భయంకర పాశములచే బంధింపబడిన నిన్ను ఎక్కడ కేగినను వీడక రాఘవుడు వధించును. ఓ అమరారీ! తమ్ముని సహాయము కూడ లేకుండగనే పదునాల్గువేలమంది దుష్టులైన రాక్షసుల తన చేతిలో దురద తీరునట్లుగా నిమిషములో నాశనము చేసెను గదా రాముడు. ఆ మహాస్త్రశస్త్రముల నెఱిగిన వాడు, సమర్థుడు తన భార్యను దొంగిలించిన దుర్మార్గుడవైన నిన్ను యుద్ధము నందు ముక్కలుముక్కలుగా నరుకక క్షమించునా? ఈ విధముగా జాలి కలుగునట్లుగా పలుకుచు, తిట్టుచు గొప్ప శోకభారముచే నేడ్చుచు దీనురాలై మధ్య మధ్య మూర్ఛనందుచు, గట్టిగా విలపించుచు పొరలుచు వణకుచు తపించుచున్న సీతను పాపాత్ముడైన రాక్షసాధముడు గట్టి తనముతో తీసికొని వెళ్లెను.



# ఏబది నాలుగవ సర్గము

## సీత తన యాభరణములు కపుల ముందట వైచుట

ఆ రావణుడట్లు వెళ్లుచుండగా ఒక్కరైనను కాపాడుటకు రాకుండుటను జూచి సీత విలపించుచు భూమిపై పర్వత శిఖరము మీదనున్న వానరుల నైదుగురిని చూచి ఈ చెట్లయందు చరించువారైనను రామునితో నా గతిని చెప్పకుందురా యని తలంచి తన బంగారు భూషణములను చీర కొంగున గట్టి వారి ముందర పడవేసెను. ఆపడవేయుటను వారింపరాని తొందరపాటు, భయముగలవాడై వేగముగా వెళ్ళుచుండుటచే ఆ దుష్టుడు చూడడయ్యెను. ఆ వానరులు రెప్ప పాటు లేని కన్నులతో రామా! రామా! యని శోకముతో విలపించుచున్నదియు, చంచలములై విశాలములైన లోచనములు గలదియునగు సీతను గాంచిరి. ఆ రాక్షసరాజును గడు వేగముతో పంపా సరస్సును దాటి వాడి కోరలు గల ఆడసర్పమును తొడపై నిడుకొన్నట్లు భూపుత్రిని మృత్యుదేవతను వలె సాహసముతో బలవంతముగా వెంట బట్టుకొని పర్వతములు, నదులు, సరస్సులు, వనములు అడ్డులేని బాణమువలె వేగముగా దాటి మొసళ్ళు, చేపలు, తిమింగిలములు మొదలైన వానితో నిండియున్న సముద్రమును సమీపించి 'దీనితో సురారి పని తీరె' నని సిద్ధ సమూహము సంతచించుచుండ, రాక్షసరాజు సంతోషము నొంది వేగిరపడుచు

## రావణుడు సీతతో లంక జొచ్చుట

తన నగరమగు లంకయందు బ్రవేశించెను. అంతట రావణుడు దయారహితుడై సీతను తన యంతఃపురమున పూర్వము రాక్షస శిల్పి యగు మయుడు మాయచే గల్పించిన స్త్రీని వలె నుంచి, అంతట పిశాచ స్త్రీలను జూచి మీరలు మెలకువతో నెల్లప్పుడు నీ సీతకు కావలియుండుడు. స్త్రీలను గాని పురుషులను కానీ ఇక్కడ ప్రవేశింపనీయకుడు. ఈమె నేకాంతమున

నుంచి బంగారు రత్నములు వస్త్రములు మొదలైనవేవి కోరినను ఇంచుకయైన అడ్డు చెప్పక ఇచ్చుచుండుడు మీకు శరీరముపై నేమాత్రమైన ఆశయున్నచో తెలిసియైనను తెలియకయైనను కఠినములైన మాటలను పల్కకుడు అని ఈ ప్రకారముగా ఆజ్ఞాపించి ఆ రాక్షసుడు అంతఃపురము నుండి వెడలి వరగర్వితుడై యింకనేనేమి చేయవలెనని ఆలోచించుచూ..

## రావణుడు జనస్థానమునకు కాపు పంపుట

మహాబలవంతులైన ఎనమండ్రు రాక్షసులను జూచి స్పష్టముగా నిట్లనెను. మీరలు మీకు మీకిష్టమైన ఆయుధములను ధరించి వేగముగా శౌర్యాతిశయ ముతో దండకారణ్యమునకు వెళ్లుడు. అందు జనస్థానము మన వారందరు నశించినచోటు. అందు పూర్వము ఖరాసురుడుండెను. మీరందు భయములేక రోషము పట్టుదల పౌరుషము ప్రకాశించునట్లు నివసించుచు చూచుచుండుడు. పూర్వము నేనచ్చట నుంచిన ఖరదూషణాది రాక్షసులను రాముడు చంపెను. దానిచే వైరము పుట్టినది. వైరమును తీర్చుటకు నుపాయమాలోచించుచున్నాను. నాకు ధైర్యము కంటె కోప మధికముగ నున్నది. ఓ రాక్షసులారా! ఆ జానకీనాథుని యుద్ధము నందు చంపి కాని నే నాదమరచి నిద్రింపను సుమా. కనుక ఆ ఖరారిని జంపి పేదవాడు ధనమును పొందినట్లు సుఖమును పొందుదును. మీరు వెళ్ళి అచ్చట రాముని యొక్క యత్నములను రాత్రింబవళ్లు ఏమఱుపాటు లేక తిరిగి చూచుచు ఆ వేషములను వార్తలను నాకు పంపుచుండుడు. ఆ రాజపుత్రులను జంపయత్నింపుడు. మీ యొక్క బలమును, పౌరుషమును నేననేక యుద్ధములందు చూచి తెలిసికొని యుండుటచే ఈ గొప్ప కార్యమునకు మిమ్ము పంపించుటయ్యెను సుమా అని చెప్పి ఈవిధముగా ఆనందమును గలిగించు మాటలను రాక్షసరాజు పల్కగా ఆ యెనమండ్రు రాక్షసులును అతని యానతిని తలదాల్చి వేగముగా జనస్థానమును ఎవ్వరికి కనిపించనివారై భయంకరముగా బ్రవేశించిరి. ఈ విధముగా జానకిని దెచ్చి రామునితో శత్రుత్వమును బెట్టుకొని రావణుడు మహితుడై సంతోషమును పొందెను.

# ఏబది యైదవ సర్గము

## రావణుడు సీతకు తన సౌధమును జూపుట

మిక్కిలి బలిష్ఠులైన రాక్షసుల నెనమండ్రను బంపి దిక్పాలురను జయించిన వాడగు ఆ రావణుడు తనలో కృతకృత్యుడనైతినని బుద్ధిహీనుడై తలంచెను. తరువాత మన్మథుని తీక్ష్ణములైన పుష్పబాణములచే గొట్టబడిన వాడై తపించుచు దేవేంద్రునే దండించిన వాడగు రాక్షసరాజు తన యాజ్ఞచే నామెను సేవించి యున్న రాక్షసీగణముచే కూడియున్నదియు, కన్నీరు కారుచున్న కనులు గలదియు, వంచిన ముఖపద్మము గలదియు, పెనుగాలిచే కొట్టబడిన తెప్పవలె అతి వ్యాకులనైన బుద్ధిగలదియు, తన ముఖము చూప నిచ్చగించని లక్ష్మి వలె నున్నదియు నగు సీతను గాంచెను. వేటకుక్కలు తనను చుట్టుముట్టి అరచు చుండగా నివ్వెరపాటు నొంది బాధజెందుచున్న మృగములకు దూరమైన ఒంటరి ఆడ లేడిని బోలుచు, త్రాచుపాము వలె దీర్ఘ నిశ్శ్వాసములను నిగడించుచున్న సీతను బలాత్కారముగా బట్టుకొని తన నగరు అందమును చూపుటకై లాగుచు తీసుకొని వెళ్లుచు వేలకొలది స్త్రీలతోడను, విలువైన రత్నములతోడను ప్రకాశించు చున్న మేడలును మిద్దెలును నగరులును, వివిధ వర్ణములతో ముద్దులు మూటగట్టుచున్న పక్షులును గల యింటిలో స్ఫటిక నిర్మితములును, రజత నిర్మితములును, దంత నిర్మితములును, కనక నిర్మితములును నయి వైడూర్యములతో వజ్రములతో మనోహరములయిన స్తంభములు గలదియు, బంగారు తోరణములు గలదియు అయిన మేడ మెట్లెక్కి సీతాదేవితో ఆ రాక్షసుడిట్లనెను. ఇవే చూడుము సీతా! బంగారుపూత పూసిన దంతములతో

చేయబడిన కిటికీలను. ఓ భామా! అదిగో చూడుము మనోహరమైన కాంతిచే చంద్రుని జయించెడు ప్రదేశములను. ఓ ముద్దరాలా అటు చూడుము మనోహర జలకేళులందాసక్తములయిన హంస సమూహములను. ఓ చానా! యిటు చూడుము ఇంపు సొంపుల నీనుచున్న ఈ క్రొత్త క్రొత్త యుద్యాన వనములను. చూచితివా ఆ సరస్సుల అందచందములను? అందమైన చిలుకల గుంపు చేసెడు రొదలు వింటివా? అన్ని చోట్లను వికసించిన పుష్పములు గల వృక్షములు సంతోషమును గలిగించుచున్నవి. ఇంకనైనను నీ మంకుపట్టును విడువుము. అని చెప్పుచు తన భవనముల యొక్క అందమును సీతకు కనిపింపజేసి అమెనింకను మోసగించుటకు మరల ఇట్లనెను. ఓ జానకీ! ముప్పది రెండు కోట్ల రాక్షసులు నన్నెల్లప్పుడు విడువక కొలుచుచుండెదరు. ఓ సీతా యింత మంది నేలుచు నేను ప్రభుత్వము నొందితినని తెలియుము. సేవలు చేయుట యందొక్కొక్క పనికి ఒక్కొక్క వేయి మంది రాక్షస శ్రేష్ఠులు బాలురు వృద్ధులుగాక ఇక్కడ నున్నారు సుమా! ఓ చంచలములైన కనులు గలదానా! ఈ శ్రేష్ఠమైన మందిరములను, ఈ సాటిలేని పూజ్యమైన రాజ్యమును నా ప్రియ భార్యలు వేలకొలది మందిని మఱియు నా జీవితమును నీ ఆధీనము చేసెదను. ఇన్నిటికి నీవే ఇప్పుడే రాణివి కమ్ము. లెమ్ము. ఏల విలపించెదవు. నన్ను భర్తగా చేకొనుము. ఏల యిట్లు అంతులేని తాపముతో నేడ్చెదవు? నా మాటలను లాలనతో ఆదరింపుము. ఓ విలాసినీ! ఇది యే మేలైన మార్గము. ఆలస్యమేల? వ్యర్థమైన ఆశలతో ఏమిటికి తపింతువు? ఓ బాలికా! పుష్పబాణుని బాణములచే గొట్టబడిన నన్ను త్రోసి పుచ్చుట నీకు న్యాయమైన పనియా? నల్ల కలువల వంటి నేత్రములు గల ఓ సీతా! నూరుయోజనముల విస్తీర్ణము గలిగి భయంకరులైన వేలకొలది రాక్షసులచే నిండి యున్న లంకాపట్టణము నేమని తలంచితివే? దీనిని ఇంద్రాదులగు దేవతలు గాని యితర రాక్షసులు గాని సమీపింపనైన జాలరు.

నా యొక్క బలమునకు యుద్ధమునందు యక్షులు దేవతలు మొదలైన వారెవ్వరును సాటి రారు సుమా. ఓ భామా! రాముడు రాముడని ఒక రాజ్యము లేని వానిని దేబెను బిచ్చగానిని, అల్పమైన తేజస్సు గలవానిని గూర్చి పలుమారులు అనేక విధములుగా తలచి యేడ్చెదవేలనే? నీకు యోగ్యుడగు భర్తను నేను. నన్ను భజింపుము. ఓ జానకీ! ఈ యౌవనము శాశ్వతమా? ఓసి పిరికిదాన! హాయిగా నన్ను కలియుము. ఓ సుందరీ! రఘురాముని జూచెదనని ఏటికి వట్టి యాస పెట్టు కొందువు? ఈ చోటును మనస్సుతో నైనను ప్రవేశించి నిన్ను చూచుట వాని తరమా? ఆకాశము నందు నిరాఘాటముగా వేగముగా సంచరించు గాలినెవ్వరు త్రాటితో గట్ట గలడు. ప్రజ్వలించుచున్న అగ్నిజ్వాలలను పట్టుట వశమా? చంచలములైన కన్నులు గలదానా! జానకీ! వినుము నా యొక్క బాహుసమూహముచే రక్షింప బడుచున్న నిన్ను, పరాక్రమముతో నన్ను గెల్చి తీసుకొని పోవువాడీలోకమునందు లేడు. దేవతలును చరాచర జీవకోటులన్నియు నీకు సేవలు చేయును. ఈ రాజ్య సంపదతో గూడ నన్నేలుకొనుము. ఓ లలనా! అనుమానముతో గూడిన భయమేమిటికి? ఈ లంకారాజ్యమునంతను పట్టాభిషిక్తురాలివై యేలుము. సౌఖ్యములు కలుగు నట్లుగా నీ సేవకునిగా నన్ను స్వీకరింపుము. పూర్వము నీవు చేసిన పాపము వనవాసములో కలిగిన బాధలతో నివర్తించినది. నీవు చేసియున్న పుణ్యముల యొక్క ఫలితములు నీవు అనుభవింపదగిన సమయము సమీపించినది. బంగారురంగు శరీరముగలదానా! మనమిద్దఱము ఇచ్చట వచింపరాని సుఖ క్రీడా చాతుర్యముతో ఈ చందనమును పూసుకొని, ఈ పూమాలలు ముడుచు కొని, ఈ అందమైన బంగరు భూషణములను ధరించి సుఖింతమా? ఓ సుందరీ! ఇది పుష్పకమను పేరు గల గొప్పదైన విమానము. సూర్యకాంతితో ప్రకాశించునది. నా అన్నయైన కుబేరు నోడించి దీనిని దెచ్చితిని. ఇది మిక్కిలి

మనోహరమైనది. ఓ చానా! సుందరమైన దానియందు ప్రవేశించి ఇద్దరము ఎంతో గొప్పవైన సుఖభోగముల ననుభవించుచు నుందుమా? నీ ముఖము పద్మశోభకు నిలయమైనది. అది ఆముఖము యొక్క ముద్దులొలుకు అందము నీ రోదనముచే ఇప్పుడు చెడిపోయినది. నీ మనస్సునందలి విచారమును వదిలి నన్ను దయతో నేలుము. అని ఈ విధముగా రాక్షసరాజు పలకగా సీతాదేవి తన చీరచెంగుచే ముఖమును కప్పుకొని కన్నుల నీరు ధారలుగా కారుచుండగా నిశ్చేష్టయైయుండెను. అది చూచి రావణుడు భూపుత్రితో నిట్లనెను. సీతాసతీ! ధర్మలోపమగునను ఆలోచనతో గలిగిన సిగ్గు చాలును. ఊరకే ఏడ్వవలదు. ఇందు ధర్మలోప మేదియో చెప్పుము. ఋషీశ్వరులైనను వైవకృతమై వచ్చువాటిని తను మనస్సులందు గణింపకుందురా? మైథిలి పలుమాట లేల నా మాట వినుము. ఓ జానకీ! నీ పాదపద్మములయొక్క ధూళి నా శిరస్సునకు తిలకము కావలెనని కోరుచున్నాడను. ఓ చంద్రాననా! నిన్ను బతిమాలెదను. నన్ను దయ గల మనస్సుతో ఏలుము. నీ సేవకుడను. పుష్పశరుని బాణములచే ఆర్తి నొంది యిట్టి దీనాలాపముల నాడితిని. ఓ జానకీ! రావణుడొక స్త్రీ యొక్క పాదము పట్టి నమస్కరించునా? అని ఈ విధముగా దశముఖుడు సీతతో పల్కి ఈ వనితామణి ఇక నాకు దక్కినదని యమపాశములచే గట్టబడినవాడై మనస్సునందు సంతోషించెను.



# ఏబది యాఱవ సర్గము

## సీత రావణుని పరుషోక్తులాడుట

ఆ రాక్షసుడిట్లు పలుకగా సీతాదేవి గడ్డిపోచ నడ్డముగా బెట్టుకొని నిర్భయముగా రాక్షసరాజుతో నిట్లు పలికెను. సత్యసంధుడు, జ్ఞాని, స్థిరచిత్తుడు, ధర్మమునకు వంతెనవంటివాడు నయిన దశరధునకు పుత్రుడైన రాముడు మూడు లోకములందును పూజింప దగినాడు. విఖ్యాతమైన పేరు గలవాడు, పెద్ద నేత్రములు గలవాడు, పొడవైన బాహువులు గలవాడు, ధర్మాత్ముడు నైన నా ప్రాణనాధుడే నాకు దైవము సుమా. నిన్ను చంపుటకై లక్ష్మణ సమేతుడై గొప్ప పరాక్రమము గలవాడై అతడిక్ష్వాకు వంశమున బుట్టెను. ఏమేమియోప్రేలెదవు. రాముని యెదుట నీవు  నన్ను పట్టుకొని యుండిన ఖరుని వలె నిన్నును అక్కడనే భూమికి బలిపెట్టియుండును గదా. రావణా! భయంకరరూపము గలదియనియు, గొప్ప పరాక్రమము గలదియనియు రాక్షస సమూహమును గూర్చి ఏమేమో పలుకుచున్నావు. గరుత్మంతునిముందు విషరహితములై సర్ప సమూహములు తలలు వంచునట్లు నా భర్తయొక్క బంగారు పుంఖములు కలిగిన బాణ సమూహములు గంగా తీరము తరంగములను వలె మ్రింగగా తలలు నేలకు వంచుదురు సుమా. నీవు వరములచే దేవదానవులకు చంపరాని వాడవైనను నా భర్త కపకారము చేసి కోపమును దప్పించి బ్రతుకుట నీకు శక్యమా? ఓ రాక్షసరాజా! యాగము నందు యూపమునకు గట్టబడిన పశువు విధముగా రాముని యొక్క భీకర బాణ సమూహములకు లక్ష్యమువై నీవింక మన జాలవు. నీచమైన తలపు గల ఓ రాక్షసా! క్రోధముతో వెలుగుచున్న కన్నులతో నిన్ను రామచంద్ర ప్రభువు చూచినచో తక్షణమే నీవు తగుల బడి భూమి మీద పడిపోవుదువు గదా. చంద్రబింబమును తన బాహు విక్రమముచే

నేల బడ గొట్టుగలడు లేక నాశనమైన చేయగలడు. గొప్ప శౌర్యముతో ఆటలాడు విధముగా సముద్రమునైన ఎండిపోవునట్లు చేయగలడు. అట్టి గొప్ప వాడైన రాముడు సాటిలేని పరాక్రమము గలవాడు తన యిల్లాలిని తన యందనురక్తురాలిని బంధము నుండి విడిపింప జాలడా? రాక్షసా! ఓరీ ఖలుడా! నీవు పోయిన సంపద గలవాడవు. ఆయుస్సు లేనివాడవు. ఇంద్రియములు నశించినవాడవు. బలముచెడిన వాడవు నగుటచే నీ కారణమున ఈ లంకా పట్టణము విధవయై బాధపడనున్నది. ఎందుకు నీకీ పొగరు రావణా! ఓ పాపాత్ముడా! నా భర్త ప్రక్కన నుండనీక అబలనగు నన్నెడ బావుటచే కలిగిన పాపము నీకేవిధముగను సుఖకారి కాదు సుమా. దైవ బలము గలవాడును, మంచి తేజస్సు గలవాడును, ధర్మశీలుడును, ఉత్తమ స్వభావుడును, భయములేని వాడును, ఎదురు లేని శౌర్యము గలవాడును అగు రాముడు క్రూరజంతువులతో నిండిన మహారణ్యమున నొంటరిగా నున్నాడురా రావణా! అతడు తన బాణవర్షముచే నీ బలమను గర్వమును క్రక్కునట్లు చేయగలడు. కాలుని వశమైన పురుషులు ఆ కాలుని ప్రేరణచే మంచిదనుకొని చెడు పనులను చేయుటకు పూనుకొని గొప్ప ప్రమాదమున బడుదురు. నీకును, నీ రాక్షససంఘములకు నిన్ను కట్టుకొన్న భార్యలకును నీవు నన్నిట్లు బలవంతముగా తెచ్చుటచే అట్టి వినాశకాలమే పుట్టెను సుమా. యజ్ఞ మధ్యమున స్రుక్పాత్రలతో నొప్పుచున్నదియు, బ్రాహ్మణుల మంత్రములచేత పవిత్రమైనదియు నగు వేదికను మాలవాడంటుటకు వశమా? రాముని భార్యను పతివ్రతను నన్ను నీవంట దలచుట అట్టిదే చూడరా దురాత్మా! ధర్మనిరతుడైన దశరథపుత్రుని సాధ్వినైన ధర్మపత్నిని నన్ను రాక్షసాధవుడగు, దుష్టచరిత్ర గలవాడవు పాపాత్ముడవు నైన నీకు నీచుడా! నన్ను ముట్టుకొనుట శక్యమా? తామర పువ్వుల సమూహము లందు రాయంచుతో నెల్లప్పుడు విహరించు హంసాంగన ఏవిధముగా గడ్డి నేలను దిరుగు నీరుకాకిని చూచును? ఓ రాక్షసా! ఈ శరీరము అచేతనము. దీనిని గర్వముతో బంధించెదవేని బంధింపుము. కోపముతో దీనిని తినదలచి నచో దినుము. నేను కాదను దానను కాను. ఓ దానవుడా! నా కీశరీరమును

జీవితమును రక్షింపవలసినవి గావురా. ఓరీ! నా మనస్సు మాత్రము నా యధీనములోనే యున్నది. అవమానము పాలుగాను సుమా. ఇది నమ్ముము. అని కఠినముగా మాటలాడి అసహ్యముతో మఱి యేమియు మాటాడక భూపుత్రి ఉండగా రాక్షసుడు భయముకలుగునట్లుగా మండు చూపుల జూచుచు ఇట్లనెను.

**రావణుడు సీత మీద రాక్షస స్త్రీలను గావలి యుంచుట**

చిఱునవ్వు చిందుమోము గలదానా! సీతా! వినుము. పండ్రెండు మాసములలో నమ్మికతో నన్ను ప్రేమింప నిష్టపడవేని అంత ప్రాతఃకాల భోజనమునకై నిన్ను నా వంటల వారు ముక్కలుగా ఖండింపగలవారు అనుచు నా రాక్షసుడచ్చట కాపలా కాయుచున్న స్త్రీలతో నిట్లనెను. రాక్షసాంగనలారా! విన్నారా! మీ కసిదీరునట్లుగా దీని క్రొవ్వును తీసివేయుడు. అనగా వారు సురవిరోధిని జూచి చేతులు జోడించిరి. రాక్షసరాజు తన పాదఘట్టనలతో భూమిని కంపింప జేయుచు దీనినిప్పుడే నా ఆజ్ఞచే పుష్పములతో చివురులతో కూడిన పూదీవలుగల సుందరమైన అశోకవనమునకు తీసుకొని వెళ్లుడు. అందే మీరే నియమముతో రక్షించుచు మిక్కిలి రహస్యముగా ఈ పద్మాననను కనిపెట్టుకొని యుండుడు. చూచుటకు భయంకరమైన రూపము గలవారలారా! వికృత రూపులారా! మాంసము రక్తము భోజనముగా గలవారలారా! ఈ సీతా సతిని భయపెట్టి మాటలచేతగాని మెత్తని మాటలచేగాని అడవిలోని ఆడ యేనుగును వలె వశమునకు దెండు. అని చెప్పి వెళ్లగా రాక్షసస్త్రీలు జానకీ దేవి నెల్లప్పుడు ఫలములతోను పుష్పములతోను నిండి యుండు అశోక వనమునకు తీసికొనివెళ్లిరి. ఆడుపులులు చుట్టుకొనగా మిడికెడు ఆడలేడి వలె రాక్షసస్త్రీల వశమై సీత విడచి పెట్టని దుఃఖముతో సుడివాడుచు నుండెను. ఆ ముగ్ధ భరింపరాని వ్యధచే బాధ నొందుచు త్రాళ్లచే కట్టబడి సుఖము నెఱుగని ఆడలేడి వలె నుండెను. భయంకరములై వికృతములైన కన్నులు గల రాక్షస స్త్రీలు మిక్కిలి భయపెట్టుచుండ నామగువ శోకముతో శ్రీకారుడును, దైవమును, ప్రియుడును నగు భర్తనెల్లప్పుడు మనసులో జింతించుచు మూర్ఛిల్లుచుండెను.

# ఏబది యేడవ సర్గము

## రాముడపశకునముల గని పరితపించుట

అక్కడ రామచంద్రుడు కామరూపియగు మారీచాసురుని మృగరూపధారిని మోసగానిని సంహరించి యాశ్రమమును జేరుతొందరలో వెళ్లుచుండగా వెనుక ప్రక్కన నక్కల కూతలను విని యీ ధ్వని దారుణము నాకెక్కువయైన కీడును దెల్పుచున్నది రాక్షసులు జానకిని మ్రింగి యుండరు గదా. దుర్మార్గుడైన ఆ మారీచుడు నా కంఠ ధ్వని ననుకరించుచు గట్టిగా అరిచెను. ఆ ఆర్తధ్వనిని తామర రేకుల వంటి కన్నులు గలదియగు సీతయు, లక్ష్మణుడును విన్నచో విభ్రాంతిని పొందినవారై ఆ జానకీ దేవిచే ప్రేరేపింపబడిన వాడై సుమిత్రా సుతుడతి వేగముగా నన్ను వెదకుచు ఆమె నరణ్యములో వీడివచ్చును. అటు తరువాత నేమి యపకారము గానున్నదోగదా. ఎక్కడి బంగారులేడి? నన్నీ విధముగా తాటకపుత్రుడు దొరకక దూరముగా తీసికొని వచ్చి నా బాణముచే కొట్టబడి చచ్చిపోవుచు హా సీతా! లక్ష్మణా! పట్టుపడితినని యఱచెను. యధార్థము. దీనిని బట్టి చూడగా ఏ మాయచేతనైనను రాక్షసులు జానకిని చంప జూచు చున్నారు. అడవిలో నొంటరిగా నున్న నా సీతకు, చిన్నవాడైన నా తమ్మునకు క్షేమము కలుగుగాక. ఈ జనస్థాన నివాసము రాక్షసులతో అంతులేని విరోధము గలిగించినది. భయంకరములైన శకునములు విపరీతముగా కనిపించుచున్నవి. ఎచ్చట చూచినను నక్కలరచుచున్నవి. ఏమి కీడు మూడనున్నదో. ఏమి చూడవల యునో గదా. ఏమి చేయుదును. వారెట్టులున్నారో అని దీనముగా వెళ్లుచుండగా పక్షులును మృగసంఘములును ఎడమ ప్రక్కకు వెళుచూ భయంకర ధ్వనులు చేయుచుండగా జానకిని తమ్ముని తలంచుకొనుచు ఎక్కడను ఆలస్యము చేయక వెళ్లెను.

**రాముడు లక్ష్మణుని జూచి సీతను దలచి దుఃఖించుట**

అట్లు వెళ్లుచు ఆశ్రమ సమీపమున కొంత దూరమున తన కెదురుగా దీనవదనముతో వచ్చుచున్న తమ్ముని జూచి దుఃఖముతో నిండిన మనస్సుతో దగ్గఱకు వచ్చి ఆదుర్దాతో అతని కుడి చేతిని బట్టుకొని ఆర్తి తోచునట్లీవిధముగా కఠినముగాను మృదువుగాను పలికెను. అయ్యో! లక్ష్మణా! ఏమి చేసితివి. ఇస్సీ! సీతాదేవి నొంటరిగా నా ఆరణ్యమధ్యమున వదలి నీవెందులకు వచ్చితివి? అక్కటా! ఆ సుందరాంగిని మనుష్యులను దిను రాక్షసులు తిని వేసిరో! లేక, ఎత్తుకొని పోయిరో! హా! లక్ష్మణా! సందేహము లేదు. గొప్ప అశుభమే కల్గుననితోచుచున్నది. అన్నా! లక్ష్మణా! జానకిని ప్రాణములతో క్షేమముగా చూడగలమా? చూచితివా లక్ష్మణా! సమీపమునందు నక్కలు భయంకరముగా కూయుచుండెను. పక్షులును క్రూరజంతువులును సూర్యాభిముఖములై యరచుచున్నవి తమ్ముడా! మనకింక శుభమెట్లు ప్రాప్తించును. ఆ దుష్టరాక్షసుడు సాధువైన లేడి వలె కనిపించుచు చాల దూరమునకు తీసికొని పోగా వేగముగా నెట్లో వాని మాయలను తెలిసికొని వానిని చంపివేసితిని. ఎడమ కన్నదరుచుండెను. నా మనస్సునందు సంతోషమేమాత్రము లేదు. నిక్కముగా ఆశ్రమమందు జానకీ దేవి లేదురా. సుందరినీ రక్కసులు తమ పగ తీరునట్లుగా హరించిరో లేక ఆమె మరణించెనో లేక అడవి యందు దారియే తప్పెనో గదా.



# ఏబది యెనిమిదవ సర్గము

**అ**నుకూలములైన సౌఖ్యములన్నిటిని విడచి నాపై నెంతయో భక్తితో రాజ్యహీనుడను, త్రిమ్మరిని దీనుడనునై తిరుగుచున్న నన్ను వెంటనంటి దండకాటవికి సహాయముగా వచ్చితివి. అట్టి నీవు తమ్ముడా! జానకిని వీడి యెట్లు వచ్చితివి? నా సతి యేగతి బట్టినదో గదా. ఎవతెను విడచి నేనొక్క నిమిషమైనను దేహమునందు ప్రాణములను నిల్పి నిలువ జాలనో ఎవతె నాయొద్ద లేనిచో భూపతిత్వమును గాని దేవలోకాధిపత్యమును గాని కోరనో, అట్టి నా ప్రాణసఖి, పూబోడిభూపుత్రి ఏదిరా లక్ష్మణా! నా ప్రాణములకంటే ప్రీతి పాత్ర యైన భూపుత్రి దండకాటవినియందు ప్రాణములతో నున్నదా? చెప్పవయ్యా! పదునాలుగేండ్లు చలనము లేక వనములందు నివసించెదనన్న మాట తుమ్మెదల వంటి జుట్టుగలదియగు సీత నెపమున కల్లయయి నా గొప్పదనమునకు హాని కలుగజేయదు గదా సుకుమారా! సీత కారణముగా నేను జీవములను విడచినచో నీవు తిరిగి పురమునకు వెళ్లగా కోరిక తీరినిదై భరతుని తల్లి మనస్సులో మిక్కిలి సంతోషించును గదా. రాజ్యముతోను పుత్రునితోను గూడియున్న కైకను కొడుకు చనిపోయినదై తపములచే కృశించినదై మృదశీలము గలదై నుతగుణములు గలదియగు నా తల్లి కౌసల్య యేవిధముగా మనస్సెరిగి సేవింప గలుగునో గదా. ఓ సచ్చరితా! సీత ఆశ్రమమున ప్రాణసహితయై యున్నచో వచ్చెదను. ఆ చిగురుబోణి ఆశ్రమములో లేని యెడల నిచ్చటనే చచ్చెదను. ముద్దులొలుకు నవ్వుతో ముద్దరాలైన జానకి నాకెదురువచ్చి మురిపముతో మంచి మాటలు చెప్పకున్నచో నేనాశ్రమము ముందరనే మృతి

చెందెదను. పెక్కుమాటలింకెందులకు? లక్ష్మణా! చెప్పుము. జానకి ప్రాణములతో నున్నదా? చనిపోయినదా? నీవేమరుపాటుతో నుండగా రాక్షసులు సీతను తిని వేసిరా? పిన్నవయసు గలది, దుఃఖమెట్టిదో యెఱుగనిది, సుశీలురాలు, విలాసములు గలది, సుకుమారి, అమాయకురాలునగు సీత నావియోగము నెట్లోర్చుకొన గలదు. ఎట్లు దుఃఖించుచున్నదో. నీచుడు క్రూరాత్ముడు వంచకుడునైన మారీచుడు నా వలె వాక్కు యొక్క నేర్పరితనముతో అరవగా తమ్ముడా! నీకు కూడ భయము కలుగలేదు గదా. చెప్పుము. నా కంఠ ధ్వనిని పోలిన ధ్వని నాలకించి భూపుత్రి భయపడి నిన్ను వెళ్లుమని చెప్పగనే నాకై ఈ విధముగా వచ్చితివి. జానకి నొంటరిగా అడవి యందు వీడుటచే దుష్టులైన రాక్షసులకు పగ దీర్చుకొను నవకాశము గల్గించితివి. ఖరుడు వధింపబడెనని రాక్షసులవకాశమును చూచుకొని జానకి నేట్టైనను చంపివేసి యుందురు. ఇది నిక్కము. ఇది యంతయు నీవు పరికించి చూడనైతివి సుమా. సోదరా! దుఃఖసముద్రమున మునిగితిని. పడితిని. చెడితిని. కూలిపోయితిని. ఇంకే మందును. ఏమి చేయుదును. ఈ విధముగా జరుగుటయే ప్రాప్తవ్యమని మనసునందు తలచెదను. అని మనస్సు నందు జానకిని తలంచుచు రాముడు, దప్పి, ఆకలి బాధనోందించుచుండగా మోము వాడిపోవుచుండగా, సంతోషము నశించగా తన యాశ్రమమునకు వెడలెను. అచ్చట సీత లేకుండుటచే బాధనొంది దుఃఖించెను.



# ఏబది తొమ్మిదవ సర్గము

## రాముడు లక్ష్మణుని సీతను విడచి యేలవచ్చితివని యడుగుట

తన యాశ్రమమునకు వచ్చుచు తనను చూడ వచ్చియున్న తమ్ముని జూచి మార్గముననే శోకసంతప్తుడైన జానకీ నాథుడు లక్ష్మణుని నిట్లు ప్రశ్నించెను. నిన్ను నమ్మి కదా లక్ష్మణా! లేడి కన్నుల వంటి కన్నులు గల సీతను వనములో నొంటరిగా వీడి ఓ యన్నా! ఇట్లు వచ్చితిని. అరణ్యమధ్యమందిట్లు నారీమణిని వీడి ఆదరబాదర పరుగెత్తుకొని వచ్చుట నీకు న్యాయమా? లక్ష్మణా! నిన్ను చూచినది మొదలుగా నా మనస్సు భయమునొందుచున్నది. సీతా దేవి లేకుండగా నీవు వచ్చుటను దూరము నుండి చూచినంతనే నా మనస్సు కలతనొందెను. తమ్ముడా! అయ్యా నా యెడమభుజము నెడమకన్నును అదరెను. అనగా భరింపరాని దుఃఖముచే తపించుచున్న బుద్ధి గలవాడై లక్ష్మణుడు ఆర్తినొంది యున్న రామునితో నిట్లనెను. అన్నా! స్వతంత్రముగా మనస్సు విభ్రాంతినొంది నేనిచ్చటకు రాలేదు. జనకజా! లక్ష్మణా! కావరే అనుచు నరణ్యమునందు శబ్దము కల్గుట విన్న సీతా సతి నన్ను పోమ్ము పొమ్మని నీపై ప్రేమచేతను భీతి చేతను తొందరపెట్టెను. ఈ విధముగా తొందరపెట్టుచున్న ఆమెను జూచి అనునయ ముతో ఎంతో దూరము నమ్మిక కల్గునట్లుగా ఓ ధీరగుణా నిన్ను గూర్చి చెప్పితిని. మఱియు వదినా! ఈ విధముగా భయముపొందిన దానవై యిట్లేటికి దుఃఖించెదవమ్మా! రాక్షసులచేత యుద్ధమునందు రామునకు భయము కల్గునా? అది యేటి మాట? ఆ ధ్వని రామునిదని నాకు తోచుట లేదు. రాక్షసుడెవ్వడో

సమయము కనిపెట్టి ఇట్లరచెను. ఓ జానకీ! నీ మనసునందు నెమ్మదిపొందుము యుద్ధమునందు దేవతలనైన రక్షింపగల గొప్ప బలశాలియగు నా రాముడీ విధముగా నీచముగా నోరువిప్పి నన్ను కావుమనుచు వాపోవునా సతీ! ఓ తల్లీ! ఎవడో ఏమి నిమిత్తముననో యిట్లరిచినాడు. నమ్ముము. మా యన్న యొక్క కంఠ ధ్వనిని బోలునట్లు రక్ష – రక్ష యని గద్గద స్వరముతో వచ్చిన ఆ ధ్వని మనస్సునందు తలపగా రాముని కంఠస్వరమని నమ్మరాదు. శాంతించుము. చెడుస్త్రీలవలె నీవిట్లు దుఃఖించుట తగునా? జగత్తులో పుట్టినవాడిలో గాని పుట్టబోవు వానిలో గాని రఘురాము నెదిరించి గెలువ నేర్చిన వారలు లేరమ్మా! నీ మనస్సునందు కలిగిన భయమును విడచిపెట్టి ఓ పద్మాక్షా! స్థిర చిత్తము గలదాన వగుము. దేవకోటికైనను రఘురాముడు జయింపరాని వాడు సుమా. అని నేను చెప్పగా అతి విమోహితమతియై భూపుత్రి ఇట్లనెను. అన్న చచ్చినచో నీవు నన్ను గోరి పాపచిత్తుడవైతివి. అట్టి కోర్కెతుద ముట్టునా? నీ సంగతి యంతయు తెలిసినది లెమ్ము. భరతుడును నీవును సంకేతమేదియో నిశ్చయించు కొని నీవు రాముని వెనువెంట వచ్చితివి. అట్లుగానిచో తన యన్నగారు రక్షింపుమన్నచో పలుకరించని తోడబుట్టిన వాడుండునా? పైకి కనిపించని శత్రుడవగుచు నా నిమిత్తముగా నా భర్త వెంబడి యావకాశము కొఱ కెదురు చూచుచు వచ్చితివని వదిన నన్ననగా పెదవులదరుచుండ కోపముచే నెఱ్ఱవడిన కన్నులు గలవాడనై నిలువలేక ఆశ్రమమువిడచి వచ్చినవాడను. ఓ అన్నా! ఉన్న నిజము చెప్పినాడను.

### రాముడు లక్ష్మణునితో సీతను విడచి వచ్చుట తగనిపనియని చెప్పుట

అని లక్ష్మణుడు చెప్పగా దశరథ జ్యేష్ఠ పుత్రుడు శోకముతో గూడిన మోహతాపములు గలవాడై యిట్లనెను. ఓ అనఘా! సీతను విడచి వచ్చుట

తగిన పని కాదు గదా. నిన్నేమందును? ఆడుది కోపముతో కఠినమైన మాటలాడినదని కోపము వచ్చి నా యొక్క ప్రతాపమును, రాక్షసుల నణచుటలో శక్తుడనగుటను నీ వెఱిగి యుండియు సీత నడవులలో వీడి వచ్చితివా తమ్ముడా! నీకు కోపమే గాని ఆలోచించుశక్తి లేదయ్యె గదా. జానకి నీపై కోపగించినదని వేగముగా కోపించి ఇట్లు వచ్చుట తగియున్నదా? నీ ఆజ్ఞను తిరస్కరించితివి. ఇది మీకు తగునా? లేడి రూపము ధరించి ఆశ్రమమునుండి నన్నింత దూరము తీసికొని వచ్చిన రాక్షసుడిడిగో. ఒక్క బాణమును నేనవలీలగా వేయగనే వాడు తన మృగరూప్పమును విడచి భూషణములు కేయూరములు గల దేహము గల వాడై ప్రాణములెప్పుడో పైకెగిరిపోగా నేలపై పడియున్నవాడు. ఆ దుర్మార్గుడు భయంకరమైన నా బాణపు దెబ్బ నోర్చుకొనలేక ప్రాణములను విడచుచు నా స్వరమును బోలిన స్వరముతో దూరమునకు విన్పించునట్లరచిన మాటలను విని నీవు సీతను విడచి వచ్చితివి.



# అఱువదియవ సర్గము

## రాముడు పర్ణశాలలో సీతలేమి గని దుఃఖించుట

అని పల్కుచు తొందర తొందరగా వెళ్లుచున్న రామునకు ఎడమకన్నదరెను. అడుగులు తడబడెను. శరీరము వణకదొడగెను. ఆ అవ లక్షణములు చూచి రాముడాదుర్దా పడుచుండెను. నేను సీతను క్షేమముగానిక చూడగలనా యనుకొనుచు తన యాశ్రమమునకు వేగముగా వెళ్లి లోపల సీతాదేవి లేకపోవు టను చూచి శోకములో మునిగినవాడై ఆర్తితో చేతులను విదుల్చుచు సీతాపతి సీతాదేవి లేకుండుటచే హేమంతమున పద్మరహితమైన సరస్సువలె నున్నదియు, ఏడ్చుచున్నట్లు వాడిన పుష్పములతోనూ, పక్షులతోనూ కూడియున్న చెట్లు గలదియు, గాంతిహీనమై కలహలపడుచున్న మృగములు గలదియు, వన దేవతలు లేనిదియు, చెదరిపడియున్న కృష్ణాజనములు, విరిగిపోయిన జమ్ము ఆసనములు, తెగిన చాపలు, దర్భలు గలదియు, పాడుపరచునట్లు కాంతిహీనమై యున్నదియునగు తన యాశ్రమమును బ్రవేశించి వెదకిచూచి సీత లేకపోవుట తెలిసి, మనస్సు కలత చెందగా భార్యను తలచి తలచి యేడ్చెను. అయ్యో! రాక్షసులు పగబట్టి కాంత నెత్తుకుపోయెరో, ఏ దుష్టమృగములైన దినివేసెనో, ఏ కారణముచేతనైన నెచ్చటికైనా వెళ్ళినదో, వినోదమునకై ఎచ్చటినైనా దాగియున్నదో గదా. పిరికి దౌటచే అడవులలోనికి వెళ్ళినదో, పండ్లు పువ్వులు తెచ్చుటకు వెళ్ళినదో, సరోవరముల చెంతకు స్నానముచేయుటకు వెళ్ళెనో, నీరు దెచ్చుటకై యేటికేగెనో, యేమి చేయువాడను? ఎక్కడకు వెళ్లుదును? ఇచ్చట నెవ్వరినడుగుదును? అని సీతను వెదకి వెదకి రాముడు కన్నులు వాయునట్లు ఏడ్చెను. వెఱ్ఱి ఎత్తినట్లు తెలివిలేనివాడివలే, పిచ్చి ఎత్తినవాడయినట్లు,

తలతిక్కఏమో అనునట్లు వికారపు చూపులు చూచుచు పిచ్చివాని వలె రాముడు దుఃఖముతో నిండిన కన్నులతో పైకి చూచుచూ, తన కుడిచేతితో ఇకనేది దిక్కనుచు నెత్తిని బాదుకొనెను.

**రాముడు సీతను వెదకుట**

చెట్టు చెట్టునకు పరువెత్తును. వేగముగా గుట్ట గుట్టకు వెళ్ళి వెదకును. పుట్ట పుట్టను సమీపించును. తొందరగా వాగు వాగునకు వెళ్ళును. విశేషముగా విలపించును. గాఢమైన దుఃఖసముద్రమునందు మునుగును. ఓ మగువా! నన్నిట్లు బాధపెట్టుట నీకు తగునా యని దీనుడై ఏడ్చును. ఓ బింబమా! బింబ ఫలము వంటి పెదవి గల సీతను చూచితివా? ఓ అందమైన కడిమి వృక్షమా! కడిమి పువ్వులయందు ప్రీతి గల నా ప్రియను గంటివా? ఓ కీరమా! కీరవాణిని చూచితివా? పండిన మారేడు వృక్షమా! మారేడు పండ్ల బోటి కుచములు గల సీతను గంటివా? ఓ సాల వృక్షమా! సాలప్రియయైన సీతను గాంచితివా? ఓ మృగసమూహమా! మృగనయనను చూచితిరా ? ఓ కకుభమా! కకుభముల వంటి యూరువులు గల సీతను చూచితివా? ఇభమా! ఇభగమనను చూచితివా? ఒ తిలకపుష్పమా! నీవయిననూ నా నెలతను చూచితివా? నిజము చెప్పుము. ఓ నేరేడు వృక్షమా! స్నిగ్ధమైన కాంతిగల సీతను చూచితివా? శోకమును పోగొట్టు నశోకవృక్షమా! శోకముచే గొట్టబడిన నన్ను ఆ జానకి జాడచెప్పి నీ పేరు గలవానినిగా చేయుము. ఓ తాళవృక్షమా! నీకింత కాంతాళ (అసూయ) ఎందులకు? తాళ ఫలముల వంటి స్థనములు గల నా భార్య లేదా చెప్పుము. ఓ చూత (మామిడి) వృక్షమా! నీ దయ యెట్టిదో చూతము. ఆ నూతన చూత పల్లవుల వంటి హస్తములుగల సీతను నీవు చూడలేదా? చెప్పుము. ఓవృక్ష రాజమా! నీపమా! నీప పుష్పము వంటి యధరములు గల సీతను నీవు చూచితివా? ఓ జంభ (నిమ్మ) వృక్షమా ! నీకింత జంభమా? జంభ ఫలముల వంటి స్థనములు గల సీతను జూచితివా? చెప్పుము. ఓ పాటల వృక్షమా! పాటలమైన (ఎఱ్ఱని) అధరములు గల సీతను జూచితివా? నవ వయస్థ(ఉ

సిరిక) వృక్షమా! నవ వయస్సు గలదియగు సీతను గంటివా? ఓ సరళ వృక్షమా! సరళమైన హృదయము గల సీతను జూచితివా? మల్లెతీగా! తీగవంటి శరీరము గల సీతను చూచితివా? ఓ కరిణీ ! కరితొడలు గలదానిని, ఓ హరిణీ! హరిణాక్షిని, తుమ్మెదా! తుమ్మెదలవంటి కురులు గలదానిని, సింహమా! సింహము వంటి నడుము గలదానిని, గజగమనయగు సీతను మీరెందైనను జూచితిరా? ఓ అందమైన మృగములారా! మీరైనా చెప్పుడు. మృగ విలోచన మీ గుంపులో నున్నదా? ఓ గజరాజా! చూడగా నీకు తెలిసినట్లని పించుచున్నది. ఏనుగు నడకలు గల సీత జాడ చెప్పుము. పెద్దపులీ! నీకు భయమెందులకు? నీవయినను తెలిసినచో నింతి ఏగిన విధము చెప్పుము. ఓ కోకిలా! నీకు తెలిసి యుండవచ్చును. కోకిల కంఠము వంటి కంఠము గల సీతను నీవు చూడలేదా? హంసమా! హంసగమనను చూచితివా? చిలుకా! నీవు చిలుక పలుకుల సీతను చూచితివా? తుమ్మెదా! నీవు తుమ్మెదలవంటి జడ గలిగిన సీతను గాంచితివా? నాయందు దయతో సీత జాడను మీరలు చెప్పరా! నిలు నిలుము. వెళ్లకుము. ఓ కలికీ ! మన్మధుని పూములికీ! మీయద ఇంత దయా రహితమా? అలుక యేటినే ప్రాణసఖీ! ఓ చంద్రముఖీ! ఇది పరిహాసమా? కులుకుచూ కులుకుచూ పరువెత్తెదవా? చూచితినిలే. నీ అందమైన చీర అదే కనిపించినదిలే. నల్లని కురులదానా! పలుకవు. కోపమెందులకే? కుభములవంటి కుచములు గలదానా! జానకీ! నన్నేలుకొనుము. ఇట్లు అడిగినవానినే తిరిగి అడుగుచు, చెప్పిన మాటలే మరల చెప్పుచూ, పరువెత్తి మునుపు చూచిన చోటులనే మరలా చూచుచూ, మనసులో భయమునొందుచూ, సొమ్మసిల్లుచూ, కలవర పడుతూ, ఆ అడవియందంతటను భూపుత్రిని వెదికియు నెచ్చటను గానక.

### సీత రాక్షస హతయైనదని ఎంచి రాముడు పలవించుట

వ్యాకులమైన మనసుతో రఘూత్తముడిట్లాలోచించెను. అయ్యో బాలామణి రాక్షసులచేత జిక్కి మృతి చెంది యుండును. ఆ జానకిని బట్టుకొని రాక్షసులామె

యంగములను పంచుకొనుచు సంతోషముతో. నేనులేకుండుటచె కట్టా ! సీతకెంత చెడు కలిగినది. అందమైన కుండలములు గలదియు, పద్మము వంటిదియునైన నీ అందమైన ముఖము అయ్యో! ఈపాటికి కాంతితరిగెనేమో కదా. మనోహరమైన సంపెంగ వర్ణము గలదానా ! తార హారములు గలదానా! రాక్షసులు నీ వరచుచుండగా నటికిరేమోకదా. ఇప్పటికే లేత చిగురుల వంటి నీ బాహువులను తెగనటికి చెఱుకు ముక్కలను వలె నమిలిరేమోగదా. పాపపు తలపులు గల వారలు నీ నడుమును విరిచి భక్షించుచున్నారేమో. జనుల గుంపు విడిచి పోయిన స్త్రీని అడవి మృగములన్నియు జంపునట్లు, అడవిలో నేనొంటిగా విడిచివెళ్ళగా తామరుల వంటి నేత్రములు గల నా సీతను దుర్మార్గులైన రాక్షసులు చంపివేసిరేమో గదా. ఓ లక్ష్మన్నా ! నీకైనా స్త్రీ రత్నమగు సీత కనిపించినదా? ఓ చిన్నారి కన్నియా! ఓ సీతా! నిన్ను నా కన్నులారా చూడగలనా? ఇట్లు విలపించుచూ రాఘవుడు వనము వనమున వెదుకుచూ సీతా! సీతా! యని పిలుచుచూ భ్రాంతి చెందినవాడై నిలుచుచూ, తొలగిపోవుచూ, మరలా దిరుగుచూ, సీతా సతికై వెర్రివానివలె దుఃఖించెను. (వెకలియై యనక వెకలిమాద్మిన్ అనుటచే శ్రీరాముడు లోకసంగ్రహార్ధయై వెకలి వలె నటించెనె గాని నిజముగా కామాధీనుడై శోకపీడితుడు కాలేదని ఎరుగ వలయును. తన్నాశ్రయించిన సీతకు దుఃఖము గలిగెనే యని దుఃఖము.)



# అఱువది యొకటవ సర్గము

**ఆ**శ్రమ ప్రదేశమున భయశోకముల కధీనుడై, దీనుడై, మిక్కిలి నొచ్చుకొన్న వాడై చెదరిపోయిన వస్తుసమూహమును జూచి చేతులెత్తి ఎంతయో విలపించెను. ఏమిరా! లక్ష్మణా! సీతలేదుగదరా! ఎచ్చటికి వెళ్ళినదో? క్రూరమృగమేదైనను తినివేసినదో? ఎవరైనను తీసికొనిపోయిరో? ఆ పద్మాక్షిని విడచి నేనొక్క నిమిషమైననూ నిలువగలనా? ఓ నాచెలీ! మానినీ రత్నమా! కన్నులారా నిన్ను చూడగలనా? ఓ ఎలనాగ! చెట్లమాటున దాగి దాగుడుమూతలాడుచూ నన్ను బాధించు సమయమా ఇది? ఓ జానకీ! నీకు వేళాకోళమా? నన్నుచేరగదే! ఓ బాలామణీ! నీ స్నేహముచే నీతో ఆటలాడుట మరిగి తిరుగుచుండిన క్రీడామృగములు నిన్ను పీడుటచే నిప్పుడేడ్చుచున్న విధము నీవెరుగుదువా సీతా! నీ వియోభారముచే నేను మృతిచెంది స్వర్గమునకేగగా నా తండ్రి ఏమి రామా! ఇచ్చటికి వచ్చితివి? ఇంకనూ రెండేండ్లరణ్యవాసము చేయవలెనని నేను చెప్పి యుండలేదా? ఇస్సీ! అప్పుడే సమయమైపోయినదా? అని ఈ విధముగా స్వేచ్ఛావిహారుడను, మోసగాడను, అబద్ధములాడువాడను, అని నన్ను బలుకును. తిన్ననైన నడవడి లేని పురుషుని నుంచి కీర్తి విడచినట్లుగా ఓ పంచదార చిలుకా! దీనముగా నేను శోకసంతప్తుడనై తపించుచుండగా ప్రేమ లేకుండా నన్ను విడచి పోదగునా నీబోటికి? నిన్ను విడచి నేనెక్కడికి వెళ్ళువాడను. ఇంకా నేవిధముగా ఈ శరీరమున ప్రాణములను నిలిపి యుండెదను. అని ఈ విధముగా విలపించుచూ జానకిని వెదకుచూ బురదలో దిగబడిన ఏనుగువలే భరింపరాని దుఃఖభారమున మునిగియున్న అన్నగారికి మంచి మాటలతో లక్ష్మణుడిట్లనెను.

## లక్ష్మణుడు రామునకు సమాధానము చెప్పుట

అన్నా! శోకముచే నెందులకెంతయో తపించెదవు? ఈ కొండలనుండి కారు సెలయేరుల తీరములందు, లోయలలో, అందమైన అడవులలో, గుహలలో భూపుత్రిని వెదకినచో కనబడకుండునా? ధైర్యముతో లేచిరమ్ము. సీతాదేవి యడవుల దిరుగ గోరుచుండుట నీవెరుగవా ? జలములందు క్రీడించుటకే వెళ్ళెనో, పద్మములు నిండియున్న సరోవరముల తీరములకు వెళ్ళెనో? నిండుగా పాఱు నేరులు చూడగోరెనో, నవ్వులాటకై చాటున దాగి ఉన్నదో, వీరి తెలివి చూతమనియో, మనలను భయపెట్టుటకై దాగియున్నదో, ఆ చెంచలాక్షి ఎక్కడకేగ గలదు? వేగముగా ప్రయత్నము చేసినచో చిక్కకపోవునా? శోకమును పొందకుము. వ్యర్థముగా బాధనొందుటను వీడుము. అని పలుకు చున్న తమ్ముని మాటలను విని రాఘవుడు వేగముగా లేచి మరల అడవులలో వెదుకదొడగెను. కొండలను, గుట్టలందును, అడవులలోనూ, నదులందును, దారులందును, అందమైన సరస్సులందును మరలా వెదకి వెదకి భూపుత్రిని గానక తమ్మునితో రాముడిట్లనెను. ఈ దండకారణ్యము నంతయు వెదకితిమి. అంతయు వ్యర్థ మయ్యెను గదా. ఆ గజగమన ఎందుబోయెనో తమ్ముడా! ఇకనేమి చేయవలెను. అనగా సౌమిత్రి ఇట్లనెను. శ్రీరామా! వామనుడు పూర్వము బలినుండి బలవంత ముగా భూమిని పొందినట్లుగా నీవు జానకీదేవిని తిరిగి పొందెదవు. అనగా విని రాముడు ఈ సర్వ ప్రదేశములను వెదకితిమి. బాధపడుటే గాని ఎచ్చటను సీత లేదు. ఈ పర్వతమున నెన్నియో గుహలు గలవు. ఎచ్చట అతివను వెదుకగలమని పలుకుచూ నేలపై మూర్ఛలనొంది వ్రాలును. దుఃఖముతో తూలిపోవును. శోషచే వ్రేలాడిపోవును. ఓ బాలా! సీతా! సీతా! ఏమయితివేయని మిక్కిలి దుఃఖమునొందును. బాధనొందును. ఏడ్చును. తమ్ముడూరడించుచు చెప్పెడు మాటలను చెవినిబెట్టక శోకముతో సీతాయని విలపించుచు బాధ నొందును. ఆ పద్మాక్షిని గానక పద్మాక్షుడు, ధర్మనిరతుడు రాముడు మన్మథ బాణములచే గొట్టబడిన వాడై సీతా యనుచు పెద్ద రోదనము చేసెను.

# అఱువది రెండవ సర్గము

## రాముడున్నతునివలె దుఃఖించుచూ సీతను రోయుట

కన్నులెదుట లేకున్నను, మన్మధ బాణాగ్నిశయముచే నెదుట కనిపించుచున్న ఆ జానకిని గాంచి చెప్పరాని బాధనొందుచూ రాముడిట్లు పలికెను. ఓ జానకీ! క్రొత్తపుష్పములందు నీకు గల ప్రీతిని నేనెరుగుదును. ఎక్కువ పుష్పములు గల ఈ అశోకపు గొమ్మలను పట్టుకొని చాటుగా దాగియుంటివి గదా! తెలుసుకొంటిని. ఓ లీలావతీ! అరటిబోదులవంటివి గదా నీ ఊరువులు. అరటి కాండములలో కలసిపోయినవై నీయొక్క తొడలు గనిపించుచుండగా దాచుట శక్యమా? ఓ కర్ణాంకి! విలోచనా! ఈ కర్నికార వనమున పువ్వులు గోయుటకు వెడలి, నవ్వులాట పట్టించుటకై నేను బాధపడుచుండగా నిట్లు దాగియుండుట నీకు న్యాయమా ? ఓ విలాసవతీ! నీవు హేళన చేయుటకై ఇట్లు చేసితివని యెఱుంగుదును. గేలి చేయుటకిది సమయమా? ఓ బాలా! నేను బడలిక చెందితిని. ఈ అడవిలో ఇట్టి యాపదలో నాతో నీకేల ఈ పరిహాసము? లక్ష్మణా! సీత యున్నచో ఓయ్ అని పలుకదా? శత్రువులు మ్రింగి వేశిరో? లేక దొంగిలించినారో? కన్నీరు విడుచుచూ మృగములు, రాక్షసులు సీతను దినివేసిరని చెప్పుచున్నవి. ఎక్కడకు వెళ్లితివే తన్వి! ఎందున్నదానివే? నీ మూలముగా కైక కోరిక దీరును. జానకితో వచ్చి తిరిగి జానకి లేకుండగా అంతఃపురమునకు ఎట్లు వెళ్ళువాడను? రాముడు వట్టి చేతగానివాడు. శౌర్యము లేనివాడు. దయలేనివాడని జనులందఱు పలుకుదురా? భార్య లేకున్నచో సౌఖ్యము నేవిధముగా పొందుదును. ఇల్లాలు లేని బ్రతుకు దరిద్రము గదా. ప్రతిజ్ఞను తీర్చుకొన్న వారమై మనమరణ్యవాసమును పూర్తి గావించుకొని ఊరికి

వెళ్ళినచో మామగారైన మిథిలానాథుడు వచ్చి కూతురు, అల్లుడు వచ్చిరని ప్రేమతో క్షేమముగా ఉన్నారా ? యని యడుగగా నేమని చెప్పవాడను. అతడీ వార్త తెలిసి తన కూతురును దలంచి, తపించి మూర్ఛనొందగా నేనెట్లా తన మొగము చూడగలను? మాయమ్మ నాకోడలేదిరాయని యడుగగా నేమని మారుచెప్పుదును. జానకి ఏదిరాయని అడుగు మీ యమ్మయైన సుమిత్రకు ఏమని చెప్పుటకు నాకు నోరువచ్చును? కైకేయి ముసిముసి నవ్వులతో సీతనడవులకు ధారపోసితివాయని యడిగినచో ఏమి చెప్పుదును? అన్నా! వదినె రాలేదేమని యడుగు తమ్ముళ్ళకేమని సమాధానము చెప్పుదును? సీత రాలేదు. రాముడు చేతగానివాడై భార్యను రాక్షసుల నోటద్రోసెనని వేళాకోళము చేయు జనుల నోరెట్లు మూయుదును? తమ్ముడా! చెప్పుము ఏమి చేయువాడను? పోనీ నేను భరతుని పురికి రానేయనుకొనుము ... జానకీ రహితుడనై స్వర్గమునకు వెళ్ళినను అది నాకు శూన్యమై అడవి వలె తోచును.

**రాముడు లక్ష్మణుని నయోధ్యకు బొమ్మనుట**

తమ్ముడా! లక్ష్మణా! నీవిచ్చట ఆలస్యము చేయకుము. అయోధ్యాపురమునకు వేగముగా పొమ్ము. భరతుని బిగికౌగిట జేర్చి నామాటగా అతనితో నిట్లనుము. నీవు స్థిరముగా అయోధ్యారాజ్యము నేలుకోమని రామాజ్ఞ యని చెప్పుము. మా తల్లియగు కౌసల్యకును, మీ తల్లి సుమిత్రకును, కైకకును నీవు నా మారుగా నమస్కరింపుము. చాలా అడిగితినని చెప్పుము. మాయమ్మకు సీత బోవుటయు, నాచావును చెప్పుము. ఆమెను సర్వ విధముల కాపాడుచుండుడు. పోయిరా నాయనా! నీకు శుభము కలుగును. ఓ లక్ష్మణా! ఇక నీవు నన్ను కాచుకొని తిరుగ వలసిన పనిలేదు. భూపుత్రి లేకుండుగా శరీరమునందు ప్రాణములను నిల్పుట శక్యము గాదు సుమా! అని చెప్పుచు బాధనొందుచుండగా అధికమగుచున్న సంతాపముతో ఆ సీతనే తలచుచూ రాముడు శోకించుచుండగా లక్ష్మణుడు జూచి మనస్సు చెలించి మిక్కిలి వ్యాకులతనొందెను.

# అఱువది మూడవ సర్గము

స్నేహము-మోహము-శోకము-సాటిలేని సంతాపము యొక్క భారముతో క్రుంగి మిక్కిలి బాధనొందుచున్న రాముడు తన దుఃఖమునకై తనవలే బాధనొందుచున్న తమ్మునితో తిరిగి ఇట్లనెను. దుఃఖముపైన దుఃఖము నన్ను విడువకుండగా నా గుండెలు పగులునట్లుగా బాధించుచున్నది. లోకములో నా వంటి పాపాత్ముడింకొకడున్నాడా? పూర్వజన్మమున పాపకార్యముల నెన్నింటినో సంతోషముతో చేసియుండుటచే ఈ జన్మము నందు తత్ఫలితముగా భరింపరాని దుఃఖము మీద దుఃఖము విడువకుండగా కలుగుచున్నది. సాటిలేని రాజ్యము నాశనమగుటై, హితుల, ఆప్తుల యెడబాటును, తండ్రిచావును, నాతల్లిని విడిచి వచ్చుటయు అనునవన్నియు నా దేహమును దహించుచుండగా అడవిలో పడుచున్న దేహకష్టము నెపములచే మరువగల్గితిని. జానకినెడబాయుటచే దిరిగి ఆదుఃఖము సమిధలచే ప్రజ్వరిల్ల జేయబడిన అగ్నియేమయ్యెను సుమా. రాక్షసుడెవ్వడో జానకిని బలాత్కారముగా పట్టుకొని యాకాశమున పారుచుండగా ఆకోమలి దిక్కులేని దానివలే, అపస్వరముతో నేడ్చి యుండును గదా. ఎఱ్ఱ చందనము పూయబడిన మనోహరములైన జానకి స్థనములను దుర్మార్గుడెవ్వడో రక్తధారలు కారునట్లుగా రక్కెనేమో గదా. మృదుమధురము లైన మాటలు గలదియు, నల్లని జుట్టు గలదియు, అందమై ముచ్చట గొల్పునదియునగు ఆమె ముఖము రాహువుచే పట్టబడిన చంద్రునివలె, వన్నె తరుగుకుండునా? తారాహారములు మొదలైన వానిచే అందమైన మెడగల ఆ సీతను చీల్చి, నీచులు నెత్తురు త్రావిరేమో గదా. ఒంటరిగా నేను విడిచివెళ్ళగా వనములో రాక్షసులు బాధలు పెట్టుచుండగా కురరి(గొర్రె) వలె నేడ్వకుండునా? ఇదియే గోదావరి.

ఇది నా ప్రియురాలికి ఎక్కువ ఇష్టమైనది. ప్రతి దినము నిచ్చటికి వచ్చుచుండెడిది. తామరరేకుల వంటి కన్నులు గలదియగు జానకి యిందుదునా? ఉండదు. ఎప్పుడునూ ఒంటరిగా ఇచ్చటకు వచ్చునది గాదుకదా. ఈ రాతి ప్రదేశమునందు ఉత్తమశీలయగు సీతింతకుమునుపిచ్చట నుండి నవ్వుమొగముతో నా సమక్షమందు నీతో నవ్వుచూ చాలామాటలు పల్కెను గదా. పద్మము వంటి ముఖము గలదియు, పద్మము వంటి నేత్రములు గలదియునగు సీత పద్మముల కొఱకై యీ గౌతమి నదికి వచ్చెనేమో? తానొంటరిగా ఆశ్రమము విడిచిరాదు గదా. అటువంటి పద్మాక్షి నేడిచ్చటికి ఒంటరిగా వచ్చునా? సాటిలేని పుష్పములతో గూడినదియు, తుమ్మెదలు చిలుకలు మొదలగు పక్షులు గలదియు అగు నీపుష్ప పొదరిండ్లను సమీపించి యుండునా? వెళ్ళియుండదు. సీతాసతి పిరికిమనస్సుగలది కదా. ఈ త్రిభువనముల వారియొక్క కృతాకృతములను, సత్యాసత్యములను, దెలిసిన ఓ ఆదిత్యుడా! రవీ! నీకు మ్రొక్కెదను. నా కాంత ఎచ్చటికి వెళ్ళినదో, ఏ కఠినాత్ముడైన తీసుకొని వెళ్ళెనో చెప్పవయ్యా! ఓ వాయుదేవా! నీకు తెలియనిది భువనములందు లేదుగదా. సీత చనిపోయినదో, ఎవరైనా నెత్తుకొని పోయెరో, వనమధ్యమందెక్కడైనా చిక్కుబడినదో ఆలస్యము చేయక చెప్పుము. అని ఈ విధముగా కౌసల్య కుమారుడు ప్రలాపించుచుండగా ధైర్యము గల లక్ష్మణుడు అప్పటికి తగిన మాటలను రాముని ఆరాటమును మాన్పుటకై యిట్లుచెప్పెను. దుఃఖమును మానుమన్నా! వెతల జిక్కి తపింపకు మన్నా! ధైర్యమును వహింపుమన్నా! దైన్యముతో కృశింపకుమన్నా! ఆ జానకీదేవిని తగిన విధముగా వెదకుదము. రాగదవయ్యా! ఎంతటి కష్టములు కలిగిన వేళయందైనను మహాత్ములు మిక్కిలిగా దుఃఖింపరు గదన్నా ! అని ఈ విధముగా సుమిత్రాతనయుడు ఎన్ని విధముల ధైర్యము చెప్పినను వినకుండా దుఃఖించుచు జానకీనాధుడు మరల సౌమిత్రితో నిట్లనెను.

# అఱువది నాలుగవ సర్గము

**ల**క్ష్మణా! గౌతమీనదికి వెళ్లుము. నా పూబోణి పద్మములు కోసికొనుటకై వెళ్ళి యుండును. అని చెప్పగా లక్ష్మణుడు గోదావరి తీరమున జేరి సీతమ్మా! ఓ వదినా! అని పెద్దగా పిలిచి సమాధానము లేక ఆ దారులందంతయు వెదకి కమలము వంటి ముఖము గల జానకిని గానక ఆ వార్తను తెలియజేసి రామునితో నిట్లనెను, అన్నా! స్త్రీరత్నమున్న జాడ కనబడలేదు. పిలిచినను భూపుత్రి పలుకుట లేదు. అని చెప్పగా ఆ రాజపుత్రుడు గౌతమి నదిని జూచి యిట్లు పలికెను. తల్లీ! గోదావరీ నది! చిగురాకుల వంటి పాదములు గల సుకుమారియగు నా సీత యిచ్చటకి వచ్చెనా చెప్పుము. ఎర్ర కలువల వంటి హస్తములు గల జానకి యెందేగెనో చెప్పుము. ఎవ్వడైన దారి దోపిడి దొంగ ఎత్తుకొని పోయెనా? యని యడుగగా ఓ భూతకోటులు! చెప్పుము చెప్పుమని యంతగా చెప్పినను, ఆ రాజపుత్రుడెంత వేడుకొన్నను ఆ రాక్షసరాజుచే వలని భయముచే ఆ నది మారు పల్కక యూరకున్నది. నది బదులు చెప్పకున్నది. ఇక సీత ఆశ లేదు. ఆమె తండ్రికిని, నా తల్లికిని సీతయేదని అడిగినచో నేమని చెప్పుదును? రాజ్యమును గోల్పోయి అడవి కాయకసరులతో కడుపు నింపుకొనుచు పడుచున్న ఆగచాట్లన్నియు దూరము చేయునట్టి ఆ తామరరేకుల వంటి కనులు గల సీత అడవిలో నెచ్చోటికేగెనో గదా. నేను బంధువులు లేక, భార్యనెడబాసి నిద్ర లేకుండగా జాగరములతో బాధనొందు రాత్రులు ఇంకనూ పెద్దవై బాధింపవా లక్ష్మణా! ఏమిచెప్పుదును? ఆహా! నాకు జానకి ఇప్పుడు లభించనేని ఈ జనస్థానమున గల గోదావరి జలములందును, ప్రస్రవణగిరి యందును చేయిచేయి కలుపుకొని కోరికలు తీర సీతతో గలసి దిరుగనా?

## అడవి మృగములు రామునకు సీత పోబడి సూచించుట

లక్ష్మణా! చూచితివా? వనమృగములు మాటిమాటికి నావంక చూచి యేమియో చెప్పుటకై, మనోభావమును దెల్పుచున్నవి. జానకి జాడ వాటికి తెలియునేమో. ఓ మృగములారా! మీరలు సీత వెళ్ళిన జాడ నెఱుగుదురా?యని కన్నుల నీరుగారుచుండగా రాముడడుగగా చటుక్కున నవిలేచి దక్షిణముఖముగా నడచుచూ మొరలాకాశమునకెత్తి దక్షిణ దిశను పట్టి రామలక్ష్మణుల మొగములు చూచుచూ పరువులెత్తగా శ్రేష్ఠమైన బుద్ధిగల లక్ష్మణుడు వాని భాషను తెలిసికొని అన్నతో నప్పుడిట్లనెను. అన్నా! మృగములను నీవు సీత యేదని ప్రశ్నింపగా అవి నేల వంకను, ఆకాశము దిక్కును జూచుచూ దక్షిణ దిశగా వెళ్లుచున్నవి. మనము నైఋతి దిశగా వెళ్ళుదమా? మనము వెళ్లు దిక్కున జానకి కనిపించు సదుపాయమేదైన లభించును. యనియనగా, లెస్స అని లక్ష్మణుడు తన్ననుస రింపగా రాముడు తామరల వంటి నేత్రములు గల సీతను వెదకుచూ వెళ్లుచుండ, త్రోవలో నేలమీద పుష్పములు రాలి యున్న విధము చూచి దుఃఖముతో కూడిన మనస్సుగలవాడై వాటి వంక జూచి తమ్మునితో గద్గద కంఠముతో నిట్లు పలికెను. తమ్ముడా! ఈ పుష్పములను నేను కోసి యీయగా భూపుత్రి తలయందు ముడుచుకున్నది. వీటిని మా యొక్క ప్రీతికై భూమియు, వాయుదేవుడును, సూర్యుడును ఇట్లా కాపాడుచున్నారు అని లక్ష్మణునితో జెప్పుచూ, ధర్మము నందిష్టముగల రాముడు మెల్లగా నడచుచూ ప్రస్రవణమను గొప్ప కుల పర్వతమును, సుందరియగు నాభార్య సీత నొంటరిగా నేను వదిలిరాగా మనోహరమైన వనరాజు యందిచ్చట దిరుగుచుండగా చూడబడినదా? అని రాముడడుగగా తన వలెనే పర్వతము కూడా చెప్పు చున్నట్లుగా అడవియందు చిన్న మృగమును జూచి కసరుకొను సింహమువలెనది కన్పింపగా శ్రీరాముడు కన్నులెఱ్ఱబడ కోపముతో ఆ పర్వతమును జూచి యిట్లనెను, బంగారు రంగు గలదియు, లేడి వంటి కనులు గలదియు నగు

నా బంగారుబొమ్మను చూపించకున్నచో, ఓ పర్వతమా! నీ నెత్తములను, గిత్తములను సర్వనాశనము చేసెదను అని పర్వతమును రాముడు జానకిని గూర్చి యడుగగా, ఆ పర్వతము ప్రతిధ్వని నెపమున నట్లే బదులు పలికి సీతను చూపకుండగా రాజపుత్రుడును, ఓ పర్వతరాజమా! మంచితనముగా నాసీతను సమర్పించిన సరి కాకున్నచో, నా బాణములచే నిన్ను నొప్పించెదను. మసి చేసెదను. చెట్లతో, వ్రేళ్లతో పాడైపోయదవు గాక. చిగురాకు వంటి మేనుగల ఆ సీత జాడ తగువిధముగా చెప్పకున్న తమ్ముడా! ఆ నది యందు నీరు లేకుండా ఇంకిపోవునట్లు చేసెదనని కోపముతో సాహసమున పల్కుచుండగా నొక దిక్కున నేలమీద.

**రాముడు సీతాదేవి భూషణాదులను నేలపై చూచుట**

ఇటునటు భయముతో పరువెత్తిన జానకి పాదముల గుర్తులను, స్ఫుటముగా నామెను వెన్నంటుచున్న రాక్షసరాజు యొక్క పెద్దపాదముల గుర్తులును, విరిగిన విల్లును రథమును, అమ్ములపొదియును, ఇచ్చటచ్చట చెదరిపడి యుండుటను చూచి సంభ్రమును నొందుచూ తన ప్రియసోదరునితో నిట్లనెను. తమ్ముడా! చూడుము సీత ధరించిన హారముల యందలి పూసలు, బంగారు ఆభరణములు, మాలికలు భూమిపై రాలియున్నవి. నేలనిండా బంగారు పూసలవలే రక్త బిందువులు కనిపించుచున్నవి. కాన, నా సీతను కామరూపులైన రాక్షసుడు ఖండించి, ఖండించి తినివేసిరాయని తలంతును. జానకికై యిద్దఱు పెనుగులాడుచు బలము గల రాక్షసులు తమలో తాము యుద్ధమునకు దలపడి యిట్లయిరని తోచుచున్నది. కాకున్నా నిచట విండ్లు మొదలయిన ఆయుధముల ముక్కలు రాలుటకు కారణమేమున్నది? బంగారు ఆభరణములతోను, మంచి ముత్యములు, మణులతోనూ అలంకరింప మంచి విల్లెవరిదో ఈవిధముగా విరిగిపడిన విధమెదియో కదా. ఉదయ సూర్యుని వంటి కాంతిగలదియు, బంగారుచే నిర్మింపడినదియు, వైడూర్యమణులు పొదిగినదియు నగు

నీకవచమెవ్వరిదో ముక్కలై నేలపై బడియున్నది. నూరు బంగారు శలాకలు గలదియు, దివ్య పుష్పమాలికలచే నలంకరింప బడినదియు, కొమ్మ విరిగి నేలపైబడినది. ఇట్లగుట ఏమికారణము ? ఇది ఎవ్వరిదో గదా. బంగారు కవచములు గలవియు, భయంకరాకారములు గలవియు, పెద్ద శరీరములు భయముగొల్పు పిశాచ ముఖములు గలవియునైన గాడిదలు భూమిపై చచ్చి పడియున్నవి. ఇవి ఎవరివో గదా. ప్రకాశించు అగ్నివలె నున్న ధ్వజము విరిగిపోయినది ఎవరిదో గదా. కొనలు విరిగిన సువర్ణ పుంఖములైన ఈ బాణము లేవ్వరివో గదా. నింపిన బాణములు నింపినట్లే ఉన్న ఈ తూనీరము లను జూచితివా. విరిగి పడిపోయినవి. ఒకచేత పగ్గములను ఒకచేత శాలగోలమును ధరించి చచ్చిపడిన సారథి ఎవరివాడో గదా. చెవులందు కుండలములను తలమీద తలపాగయును ప్రకాశించుచుండ, చామరముల పట్టువారలిద్దరును చచ్చిపడి యున్నవారలు వీరలెవ్వరివారో కదా. ఓ హితచరితుడా! చూడుము.

**రాముడు దేవతలపై కోపించి జగత్సంహారము చేయ బూనుట**

తమ్ముడా! ఈ విధమంతయు చూడగా రాక్షసుడెవ్వడో ఈ వనమందున జానకిని హరించెనని నాకు నిజముగా తోచుచున్నది. ఇదివరకు పోనీలేయని యూరకుంటిని. ఇక దీనివలన రాక్షససమూహముతో జీవితానకమై విడువరాని విరోధము ఘటిల్లినది. రాక్షసులచే అపహరింపబడినదియ, చనిపోయినదో, భక్షింప బడినదో, భూపుత్రి రాక్షస సమూహముల చేత చిక్కగా ధర్మమైననూ రక్షింప జాలదయ్యెను చూచితివా. భూపుత్రి అపహరింపబడి భక్షింపబడగా, ఓ సౌమిత్రీ ! దేవతలు నివారింప దలపరైరి. నాకపకారము చేసి వీరు సంతోషముగా నుందురా? లోకములను పుట్టింపను, సంహరింపను, శక్తిగలిగి యుండియు, దయచే సాధువుగా నున్న పురుషుని, లక్ష్మణా! లోకములోని జనులు జ్ఞానము లేనివారై యవమానపరుచుచుందురు. లోకమునకు హితవు

చేయువాడును, సాధువును, ప్రఖ్యాతమైన కరుణ గలవాడును, ఇంద్రియ నిగ్రహము గలవాడునునైన పురుషుని లోకము బలహీనునిగా దలంచును గదా. సత్యము. నాయనా! లక్ష్మణా! ఇప్పుడు నా కథ అట్టిదిగా నడుడుచుచున్న దయ్యా! వింటివా? కుట్టినచో తేలందురు. కుట్టకున్నచో కుమ్మరి పురుగని తలంచి జనులు లక్ష్య పెట్టరు. జనులు దుష్టులు కుమారా! ఇది లోకము తీరు. నా యందు కనిపించెడు సాధుగుణములు దోషములుగా కనబడుచుండెను గదా. కానిమ్ము. ఆ రాక్షస గణములింక నెట్టిపాట్లు పడునో తప్పక చూడు మిప్పుడు. తూర్పు కొండపై కఱకఱమని కరకు వెలుగులు గల సూర్యుడు దహించి, చంద్రుని వెలుగును బఱబఱ హరించు విధముగా కాఠిన్యముచే నేనును ,నా మృదుగుణములు అణచివేసి ప్రకాశించెదను చూడుము. తమ్ముడా! రాక్షస పిశాచ సమూహములందు గాని, యక్షులయందు గాని, గంధర్వుల యందు గాని, భూమియందుండు జనులందును గాని, ఒక్కడైనను ఈ క్షణమున సుఖముగా నుండెనేమో చూడుము. వాయు, సూర్యాగ్నుల శక్తి నశించినదై, పర్వతశృంగములు విరిగినదై, గ్రహ సంచారము నశించినదై, చంద్రబింబము నశించినదై, సముద్రజలములెండినదై, తీగలు, జట్లు పొదలు తెగగొట్టబడినవై జగత్సమూహము నా నిశితమైన బాణములు సమూహముయొక్క ప్రభావముచే నశించునట్లు నొనర్చెదను. అదిగో చూచుచుండుము. నా అస్త్రముల యొక్కయు, బాణముల యొక్కయు సమూహముచే ఆకాశమును బ్రద్దలు కొట్టెదను. ఆకాశచరులను, ముల్లోకాలను బాధింతును. నా జానకిని చెక్కు చెమర్పకుండా దేవతలు చూపింప నిచ్చగింపరేని ప్రఖ్యాతమైన తిరుగులేని నాయొక్క విక్రమమును యేడ్చుచు నిదెచూచెదరు గాక. చెవిదాకా తెగలాగి వదిలిన నా బాణమును గుంపులచే నిండిన లోకమిప్పుడతలాకుతలమై, అల్లకల్లోలమై, చెల్లాచెదురునై, పచ్చము పాడై, పంచబంగాళమై, పాండవ బీడై, పగులువారినదై, పటాపంచలై, మర్యాదరహితమై, చెడిపోవును లక్ష్మణా! చూడుము. చొక్కి సోలి

వ్రాలి తూలి యీ దేవతలు, యక్షరాక్షసాదులు కలతజెంది శక్తిమంతములైన నా బాణములచే ఖండింపబడుదురు. వీరా నన్నోడించెడివారు? సౌమిత్రీ! నాయొక్క శక్తిని చూడుము. ముద్దులొలుకు నా సీతను మంచిగా నాకు తెచ్చియీయకున్నచో నీమూడులోకములు నేవిధముగా నశించునో చూడుము. అని కటములదర, రోషముచే నెఱ్ఱవైన కనులు గలవాడై గొప్ప వింటిని వేగముగా తీసుకొని భయంకరమైన విషసర్పమును బోలిన యొక వికృతమైన బాణమును సంధించి ప్రళయకాలపుటగ్ని వలే ప్రకాశించుచు తన తమ్మునితో నిట్లనెను. ఓ సౌమిత్రీ! ఏ విధముగా ముసలితనమును, మరణమును, సమయమును, అదృష్టమును నివారింపరానివో ఆ విధముగా కోపము వచ్చినప్పుడు నేనుగూడ నివారింపశక్యము గానివాడను. సుకుమారమైన మంచి నడవడి గలదియు, చిఱునవ్వు చిందు ముఖము గలదియునగు  సీతను మెల్లగా తెచ్చియిచ్చినచో మేలగును. లేకున్నచో జగము  లల్లకల్లోల మగునట్లుగా ఉడికించెదను సుమా అని రోషించుచుండగా...



# అఱువది యైదవ సర్గము

## లక్ష్మణుడు శ్రీరాముని శాంతుని జేయుట

సీత దొంగలింపబడుటచే బాధనొందుచున్న వాడును, సంతాపము నొందుచున్న వాడును ప్రళయకాలాగ్ని వలె జగత్తును దహించుటకు పూని కాఠిన్యము నొందిన వాడును, సంధింపబడిన విల్లు వంక చూచుచున్న వాడును, వేడి నిట్టూర్పులు విడచుచున్న వాడును, ప్రళయ కాలరుద్రుని వలె వెలుగుచున్న వాడును, ఇంతకు మున్నెన్నడు కోపించి యెఱుగని వాడునునైన రాముని జూచి సుమిత్రాసుతుడు పెదవులెండిపోగా, ముఖము వెలవెల పోవుచుండ నిట్లనెను. సర్వ ప్రాణులకు మేలుచేయువాడవు, ఎప్పుడును ప్రశాంతమైన బుద్ధి గలవాడవు, మెత్తనివాడవు. అట్టి నీవు కోపము పొంది నైజగుణమును విడుచుట తగునటయ్యా? చంద్రుని యందు శోభయు, సూర్యుని యందధికమైన తరగని కాంతియు, భూమి యందధికమైన యోర్పును, వాయువు నందు నిత్య చైతన్యము స్థిరముగా ఎప్పుడును విడువకుండును. ఈ గుణములన్నియు కీర్తితో గూడ నీ యందే స్థిరముగా వసించియున్నవి. లోకముల నిట్లు కలత పెట్టదగునా? ఎవ్వడో యొక్క డపచారము చేసెనని యెల్ల జగత్తును నశింపజేయుట తగునటయ్యా! ఈ విరిగిన రథ మెవ్వనిదో ఎందుల కెవ్వరిచేత నిట్లు భగ్నమైనదో తెలియకున్నది. తెగిన గిట్టలు, చెదరిన చక్రపుజాడలు గలదియై ఈ నేల నెత్తురు బొట్లచే తడిసి యున్నది. సైన్యము యుద్ధము చేసిన జాడ లేదు. ఒక్కడే యుద్ధము చేసినట్లు కనబడుచున్నది. కాన కఠినముగా ప్రవర్తించి రాజులైన వారలు ఒక్కనికై

జగత్తంతయు నశింపజేయదగునా? మార్దవపు శాంతి తగిన దండము విధించుట యను గుణములతో ప్రకాశింపవలదా? నీవు సర్వ భూతములకు కేవలము శరణ్యమైన వాడవు. కీర్తింపబడిన ఉత్తమ గతియు నీవే కాన నీ విపత్తును జూచి యెవ్వడు సంతోషించును? దేవతలు, గంధర్వులు, రాక్షసులు, పర్వతములు, నదులును, ఋత్విజులు దీక్షితున కీడు తలపెట్టని విధమున నీకు ప్రియముగాని పనిని చేయజాలరయ్యా! శాంతముగా నాలోచింపుము. చేతియందు విల్లు పూని నేను నీ ప్రక్కన నడచుచుండగా తపశ్శాలురండతో పర్వతములందును, అరణ్యములందును, పర్వత గుహలయందును, నదులయందును, పద్మములు కలువలు గల సరస్సులందును, దేవతలు మున్నగువారు నివసించు లోకములందును ఎంతయో జాగ్రత్తతో వెదకుము. అప్పటికి మంచితనముతో దేవతలు సీత నర్పింపని యెడల తరువాత తప్పక వారల మీద కాలోచితముగా ఆ పని చేయుట నీకు న్యాయమగును గదా. సామము చేతను, మంచి శీలము చేతను, వినయాది గుణముల చేతను భూపుత్రి దొరకకున్నచో ఓ రాజపుత్రా! వజ్రాయుధము వలె కఠినములైన నిశిత బాణముల చేత నీ మనసుకు నచ్చిన విధముగా లోకములను బూడిదగా చేయుము. అప్పుడది తగియుండును.



# అఱువది యాఱవ సర్గము

**అ**ని లక్ష్మణుడు పాదములపై వ్రాలుచు వినయముతో మరల నిట్లనెను. నిష్ఠతో గూడిన తపస్సు చేతను, గొప్ప సత్కర్మల చేతను తనతండ్రి దేవతల మృతమును పొందినట్లుగా నిన్ను కనెను. శ్రేష్ఠమైన నీ గుణములకు పరవశు డైన మన తండ్రి నీ వియోగముచే స్వర్గమునకు వెళ్లెనని భరతుడు మన మందఱము వినునట్లుగా చెప్పెను గదా. ఓ కాకుత్థ్సశ్రేష్ఠుడా! నీవే దుఃఖమును భరింపలేక బాధ చెందెదవేని లోకములో అల్పమైన సత్యముగల ప్రజలు గొప్ప దుఃఖముల నెట్లు భరింపగలరు? మన్మథ బాధచే నీవే యీ విధముగా జగత్తును నాశనము చేయ జూచెదవేని భూప్రజలను గావ దిక్కెవ్వడగును? కంచెయే చేను మేసినచో నింక రక్షించు నుపాయమేమియుండును? నహుషుని పుత్రుడైన యయాతి స్వర్గమును బొందియు వివేకము లేని వాడై దుఃఖమును పొందలేదా? మన పురోహితుడైన శిష్ఠుడు నూరుగురు పుత్రులను కనగా ఒక్కమారుగా వారు స్వర్గము చేర లేదా? లోకులచే నమస్కరింపబడినవాడా! సర్వభూతములు కాధారమైన భూమి వణకు పుట్టగా గడగడలాడదా? భువనములకు కన్నుల వంటి వారును, పూజ్యులు నయిన సూర్యచంద్రులు రాహుకేతు గ్రహముల నోళ్లలో బడుటలేదా? ఎటువంటి మహాత్ములైనను దేవేంద్రుడైనను, దైవ సంకల్పమును దాటగలరా? కష్టములు లేకుండ ఎవరైనను కాలము గడపినారా? ప్రాణులకు కీడును మేలును గలుగుట స్వభావసిద్ధము గదా. రాజా! భూపుత్రి అపహరింప బడినను, మరణించినను దానిని గూర్చి నీవు హృదయము

భ్రద్దలగునట్లుగా పామరుని వలె శోకింప వలదు. దుఃఖము కార్యము సాధించు నుపాయమగునా? చెప్పుము. సత్యము నెఱిగిన నీవంటి వారిట్టి భరింపరాని యాపదలు, దుఃఖములు వచ్చినను, వారు సత్యాసత్యముల నెఱిగిన వారగుటచే మనస్సున గూడ నెప్పుడు చింతనొందురు. శ్రేష్ఠమైన బుద్ధితో ఆలోచింపుము. నీవిట్లు సంతాపమును పొందుట తగునా? పండితులు శ్రేష్ఠమైన తమ బుద్ధి బలముచే శుభాశుభములను తెలిసికొందురు. దోషమో గుణమో కనిపించని కర్మ సమూహములను మానవుడు చేసియుండును. అవి యిట్టివని ఫలముచేత గాని నిశ్చయింపబడవు. అట్టి కర్మములు చేసియుండక మానవుడిట్టి సుఖ దుఃఖములను పొందునా? రామచంద్రా! ఈ విధముగా మునుపు నీవే నాకు బోధించి నాడవు. ఇప్పుడు నీవు దుఃఖముచే బాధనొందినచో దేవతల గురువైన నీకు చెప్పునదేమున్నది? నీ స్థిరమైన బుద్ధి దేవతలకైనను దుర్లభము. దుఃఖ భారముచే నీ జ్ఞానము కప్పి వేయబడినందున ఆ మఱపు తొలగునట్లు నేను బోధింప వలసి వచ్చినది. నోరులేని జనులను అపకారము చేయని దేవతలను బాధింపకుము. నీ శౌర్యమును దలంపుము. నీకపకారము తలపెట్టిన వానిని కనిపెట్టి వానిని దండింపుము. అని లక్ష్మణుడు చెప్పగా..



# అఱువది యేడవ సర్గము

## రాముడు లక్ష్మణుని వాక్యములు విని శాంతించుట

సారవంతమైన మంచి మాటలను అర్థయుక్తముగ సౌమిత్రి చెప్పినంతనే సారమును గ్రహింప గలిగిన అతని అన్నగా రాముడామాటల సారమును గ్రహించినవాడై వచ్చిన కోపము నుపసంహరించి ధనస్సు నూదుకొని నిల్చి వత్సా! లక్ష్మణా! సీతను చూచుట కెందుబోదుము. ఏమి చేసిన బాగుండునో ఆలోచింపుము. అని దీనముగా రాముడడుగగా ధీరుడగు లక్ష్మణుడు అన్నా! ఈ జనస్థానము అనేకములైన గొప్ప మృగములతో నిండిన గుహలు గల నొండల సమూహము గలది. కిన్నరులు భవనములతో గూడినది. భయంకరు లగు రాక్షసుల వశమందున్నది. గొప్ప వృక్ష సమూహములతో గూడియున్నది. కాన జానకి నిందే వెదుకదగును. ఆపదలందు నీవంటి బుద్ధి సంపన్నుడు చలింపడు. ఎచ్చుటనైన గాలి వీచినచో పర్వతములు చలించునా? అని పలుకగా రాముడు తన తమ్ముడు వెనువెంట రాగా క్రోధవశుడై తీక్ష్ణమగు బాణమును వింట సంధించి చేత పట్టుకొని ఆ వన సీమయందంతయు జానకికై వెదకెను.

## రామలక్ష్మణులు జటాయువును జూచుట

ఇట్లు వెదకుచు వెళ్ళగా వెళ్ళగా నొకచోట పెద్ద పర్వతము వంటి ఆకృతి గలవాడును నెత్తుటిలో మునిగియున్నవాడును, పవిత్రుడును, మహానుభావుడును, పక్షి రాజును నగు జటాయువును చూచి తమ్మునితో నిట్లనెను. శత్రువులను శిక్షించిన ఓ లక్ష్మణా! చూచితివా ? వీడే సీతను భక్షించెను. నిజము రాక్షసుడే గ్రద్ద రూపము దాల్చి సుఖముగా నున్నాడు. వీనిని నా భయంకరములైన

బాణములచే ఆలసించక చీల్చి చెండాడెదను అని సీతాపతి వాని కభిముఖుడై ఒక బాణమును సంధింపగా భూమి యంతయు వణకసాగెను. నెత్తురులే లాలాజలముగా నోటినుండి గ్రక్కుచు మరణ సమయమున గలుగు బాధచే తపించుచు పక్షిరాజు డగ్గుత్తికతో రామచంద్రునితో నిట్లనెను.

**జటాయువు రామునకు సీతాపహరణ వృత్తాంతము చెప్పుట**

ఓ దీర్ఘాయుష్మంతుడా! ఓషధినివలె మీరు వనమందు దేనిని వెదకుచున్నారో ఆ వనితను, నా ప్రాణమును, ఈ రెండిటిని రావణుడపహరించెను. నీవును లక్ష్మణుడును వనమధ్యమున సీతనొంటరిగా విడచి వెళ్ళగా ఆ పవిత్రురాలగు సీతను బలవంతముగా నెత్తుకొని ఆకాశమార్గమున బోవుచుండగా నేను చూచి ఒక్కయూపున వానికడ్డము వెళ్లి ఎదిరించి నా బలముతో యుద్ధము చేసి వాని రథమును నేల గూల్చితిని. వానిని నొప్పించితిని. అదే నేను విరిచివైచిన విల్లు, అదే అమ్ములపొది, అతడే నా రెక్కలచే కొట్టబడి చచ్చిన సారథి. అదే రథము. నేను ముసలివాడనగుటచే అలసిపోగా అతడు తన ఖడ్గముతో నా రెక్కలను తెగ నరికి జానకిని దీసికొని ఆకాశమున పరువెత్తెను. పంక్తి కంఠుడు సీతకై మున్నేచంపెను. నీవును తిరిగి చంపుట తగునా దశరథపుత్రా!

**జటాయువు దుస్థితికి రాముడు దుఃఖించుట**

అనగా విని రాముడు బాష్పములు నిండిన ముఖము గలవాడును, రెట్టించిన తాపము పొందిన వాడునై ధనస్సునటు పారవైచి రాజశ్రేష్ఠుడా జటాయువును కౌగిలించుకొని హా! యని తెలివితప్పిన వాడై పడిపోయి లేచి తమ్మునితో గూడి యిట్లు పలవించెను. తమ్ముడా! ఒంటరియై వనమందు కాలిత్రోవను బడి నిట్టూర్పులు విడచుచున్న పుణ్యాత్ముడగు ఈ జటాయువును జూడుము. అక్కటా! ధరణి రాజ్యమును గోలుపోవుటయు, భయంకరమైన వనమందు బాధ నొందుటయు ఇచ్చట నీ విధముగా భూపుత్రి నెడబాయుటయు, నిప్పుడీ పక్షిరాజు

చనిపోవుటయు నా అభాగ్య మెటువంటిదో చూచితివా? ఇది అగ్నిని సైతము కాల్చివేయగలదు గదా. ఈ ఘోరమైన తాపము చల్లారునట్లుగా సముద్రమునందు ప్రవేశింప బోయితినేని నా దౌర్భాగ్యముచే నీరెండిపోవును. నేల బీటలు వారును. ఎంచి చూడ నాకంటె నిర్భాగ్యుడు లోకమున నుండబోడు. ఈ విధముగా భరింపరాని ఆపదలనెడు వలత్రాళ్ల నెవడు చిక్కువడును. నా దురదృష్టవశముచే మన జనకుని స్నేహితుడును, వృద్ధుడును, పాపరిహితుడును నగు నీ పక్షిరాజు అయ్యో! కొట్టబడి నేల గూలెను గదా. దైన్యమును చూచితివా? అని పల్కుచు తండ్రియందలి ప్రేమ వంటి ప్రేమతో రెక్కలు తెగిన వాడును, రక్తసిక్తాంగుడును, నగు పక్షిరాజును తనచేతితో తడవుచు యేదీ! అనఘా! నా ప్రాణ సమానయైన సీత యని నేల మీద పడిపోయెను.



# అఱువది యెనిమిదవ సర్గము

## జటాయువు రామునకు సీతావృత్తాంతము సవిస్తరముగా చెప్పుట

తిరిగి తెలివి తెచ్చుకొని లేచి లక్ష్మణుని దిక్కు చూచి తమ్ముడా! ఈ పక్షిరాజు గొప్ప ఉపకారి. నాకై కలుగజేసుకొని తెగించిన వాడై పరాక్రమించి యుద్ధము చేసి పడిపోయి కొనయూపిరితో నున్నవాడు. మాట్లాడునని తోచుటలేదు. కంఠ ధ్వని కొద్దిగానే యున్నది సుమా. అని చెప్పుచు పక్షిరాజున కిట్లనెను. ఓ గృధ్రరాజా! జటాయూ! మాటాడగలవేని సీతాదేవిని గురించియు నిన్ను వధించిన విధమును, సీతాదేవి రాక్షసుడేల దొంగలించెనో, అతడు మనసునందు కోపించుటకు కారణమేమియో తెల్పుము. మిత్రుడా! నా దేవి యొక్క చంద్ర సమానమైన ముఖము ఆ సమయము నందేవిధముగా నున్నదో గదా. ఆ విధముగా దుర్మార్గుడు తన్ను తీసికొని వెళ్ళుచుండగా భూపుత్రి అప్పుడేమను చుండెను? ఆ మాటలను తెలియునట్లుగా జెప్పుము. ఆ రాక్షసుడెటువంటివాడు. ఎట్లుండును? వాని పట్టణమేది? ఎంతటి పరాక్రమము గలవాడు? అను విషయములను తండ్రీ! మనసార చెప్పుము. సతి నెత్తుకొని వాడెట్లు వెళ్లెనో చెప్పుము. ఈ విధముగా రాముడు పలుకగా పక్షిరాజు మెల్లగా రెప్పలను విప్పి రాజపుత్రుని ముఖము చూచుచు సన్నని గొంతుతో నిట్లనెను. రామా! మాయావి యగు రావణుడు వాయువు మేఘములు నిండినదైన పెనుమాయలో గూఢముగా భూపుత్రిని బలవంతముగా హరించి క్రూరాత్ముడై ఆకాశమున వెళ్లెను. గొప్ప యుద్ధమందు నేను బడలిక పడుటచే రాక్షసుడు నామీద బడి ఖడ్గముతో నా రెక్కలను నరికి వేగముగా దక్షిణముగా పరుగెత్తెను. రామచంద్రా! కన్నులు

తిరుగుచున్నవి. నా మనస్సు స్వాధీనము తప్పుచున్నది. నాయనా! నా ప్రాణములు వాటి స్థానములు వీడుచున్నవి. వట్టివేళ్ల కేశములు గల బంగారు వృక్షములవిగో కనిపించుచున్నవి. ఆ రాక్షసుడు భూపుత్రిని దొంగలించిన సమయము చూచినచో పోయిన సొత్తు వేగముగా యజమానికి దొరకుట తప్పదు. తత్తర పాటుచే ఆ రాక్షసుడు ఆముహూర్తమును మనస్సునందు తెలియలేడయ్యెను. ఆ ముహూర్తమునకు వింద యని పేరు. నీ భార్యను హరించిన వాడు గాలమును మ్రింగిన చేపవంటి వాడగును సుమా. దుఃఖ పడకుము జానకి కొరకు వ్యధ జెందకుము. ప్రశస్త గుణములుగల ఓ రామా! నీవు యుద్ధమందు రాక్షస రాజును చంపి తిరిగి జానకిని తీసికొని భూమి యందు గొప్ప కీర్తి కలుగునట్లు పురమునకు సంతోషముగా వెళ్లెదవు అని తెలివి తప్పకుండ రాజపుత్రునితో జెప్పి తిరిగి ఏమో చెప్పబోగా మాంసమును, నెత్తురును నోటినుండి అధికముగా పైకి పైకి క్రక్కుచు విశ్రవసున కౌరసపుత్రుడు, ఈశ్వరుని మిత్రుడైన కుబేరునకు తమ్ముడు అని యీ విధముగా చెప్పుచుండగా ఆరవదియైన ఊపిరి శరీరము నుండి వెడలి పోయెను. అక్కటా! చేతులు జోడించి రామచంద్రుడు చెప్పుము చెప్పమని పల్కుచుండగనే దుఃఖముతో రాముడు చూచుచుండగనే పక్షిరాజు శరీరమును విడచి స్వర్గమునకు వెళ్లెను. కన్నులెఱ్ఱవడగా నోరు దెరచుచు తలను వ్రేల వేసి భూమిపై పాదములను పాయజాచి శరీరము విపరీతముగా వణకుచుండగా ప్రాణములను విడచి భూమిపై పడిపోయెను.

**జటాయుమృతికి రాముడు శోకించుట**

అట్లు పడియున్న గృధ్రరాజగు జటాయువును జూచి రాముడు మనసునందు సంతాపమును బొందుచు తమ్మునితో నిట్లనెను. సోదరా! ఈ జటాయువు అనేక సంవత్సరములు పాపులైన రాక్షసులకు నివాసమైన దండకాటవి యందు భయము లేకుండ పరాక్రమముతో నుండియు, చివఱకిచ్చటనే చనిపోయినాడు

చూచితివా? చిన్నతనము మొదలుగా నిచ్చట వేల సంవత్సరములు స్వేచ్ఛగా సంచరించి చివఱకు చంపబడి యిచ్చట పడిపోయెను గదా. కాలగతి ఎవరికైనను దాటరాదు గదా. చూచితివా? లక్ష్మణా! జానకీ దేవికి ముందుగా నిలబడి దేవతావిరోధితో తలపడి గొప్పదైన పక్షిరాజ్యమును, ప్రాణములను రెండిటిని విడచి నా కొఱకై నేల గూలినాడు. ఇట్టి పుణ్యాత్ముని, ధర్మబుద్ధిగాలవానిని, ఉపకారము చేయువానిని భూమి మీద నెప్పుడైనను జూచితిమా? ధీరగుణా! లక్ష్మణా! పరికించి చూడగా పశుపక్ష్యాదులందు గూడ శౌర్యము గల వారును, అభయమిచ్చు వారును, శ్రేయస్సు కల్గించువారును, సజ్జనులును, ధర్మము తప్పక నడచువారును భూమి యందెల్ల యెడల గలరు సుమా. పూజ్యుడును, స్థిరమైన కీర్తి గల వాడును అగు నీతడు నాతండ్రి వలె నాకు మాన్యుడు, ప్రేమింప దగిన వాడు సుమా. ఈతని యవస్థను చూడగా సీతాపహరణము వలన కలిగిన దుఃఖము నా మనస్సునందు నశించెను.

**రాముడు జటాయువున కగ్ని సంస్కారము చేయుట**

సౌమిత్రీ! చితిని పేర్చుము. నా పనికై మరణించిన పక్షిరాజును నియమముతో అగ్నినుద్భవింప జేసి యథావిధిగా దహనము చేసెదను. అని చెప్పుచు జటాయువున కెదురుగా నిలిచి చేతులు జోడించి, యజ్ఞము చేసిన వారికేగతియో, ఆ హితాగ్నులకు వచ్చు గతి యేదియో, సన్యసించిన వారికేగతియో, భూదానము చేసిన వారికేగతియో అట్టి సర్వోత్తమమైన గతిని నా చేత సంస్కారమును పొందుటచేతను, నా ఆజ్ఞ చేతను ఓ పక్షిరాజా! అధికమైన సత్యము గలవాడా! పొందుమని చెప్పుచు పక్షిరాజును చితిపై నుంచి అగ్ని ముట్టించి రఘురాముడార్తితో తన బంధువును వలె దహనము చేసి లేడి మాంసముతో పిండములు చేసి పచ్చ గడ్డిపై వానినుంచి బ్రాహ్మణుడు మానవ ప్రేతమునకు స్వర్గప్రాప్తికై చదివెడి పైతృక మంత్రముల నన్నిటిని మంచి మనస్సుతో జపించి రాజపుత్రులిద్దఱు గోదావరి నది యందు స్నానమాడి

గ్రద్దల రాజునకు ఉదక ప్రదానము చేయగా, మిక్కిలి చేయరానిదియు, గొప్ప ప్రఖ్యాతిని కలుగజేయునదియు నగు కార్యమును చేసి యుద్ధమునందు మృతి పొంది యున్న పక్షిరాజు మహర్షి సమానుడైన భూభర్తచే సంస్కారమును పొంది శుభ పుణ్య లోకములకు వెళ్లెను. అంత పుణ్య కర్మనిధులగు రామలక్ష్మణులు తమ మనస్సంతయు అతని పైనే యుంచి మనస్సులందతని మాటలనే తలంచుచు భూపుత్రిని పొందవలెననెడు కోరికతో విష్ణు వాసవుల వలె అడవిలోనికి వెడలిరి.



# అఱువది తొమ్మిదవ సర్గము

## లక్ష్మణుడయోముఖిని విరూపను జేయుట

రాజపుత్రులు నైఋతి దిక్కుగా కొంత దూరము వెళ్లి ఆ అడవికి మూడుక్రోసుల దూరమున నున్న క్రౌంచమను మహాటవిని ప్రవేశించి యందు తామచ్చటచ్చట మార్గాయాసముతో చెట్ల నీడల యందు గూర్చుండుచు, జానకిని వెదుకుచు క్రూరమృగములు పక్షులు గల ఆ అడవి యందు వెడలిరి. దానిని దాటి మతంగ వనమందు మూడుక్రోసులు తూర్పుగా వెళ్లి పాతాళము వలె నున్నదియు, క్రూరమృగములతో గూడినదియు, చీకటిగా నున్నదియు నగు నొక కోనను సమీపింపబోగా కొలది దూరమున గొప్ప దంతములు గలదియు, విరబోసికొనిన వెంట్రుకలు గలదియు, మృగములను భక్షించునదియు, వ్రేలాడు బొజ్జ గలదియు నగు భయంకర రాక్షసి వారిని జూచి దగ్గరకు వచ్చి ముందుగా వెళ్లుచున్న లక్ష్మణునాపి చేతులతో అతనిని గట్టిగా కౌగిలించుకొని తమకముతో నిట్లనెను. నీకు పెండ్లామునయ్యెదను. వేగముగా రమ్ము. జీవితకాలమంతయు నీ వనమునందలి నదీ తీరము లందు విహరింతము. నాథా! జనులు నన్నయోముఖి యందురు. అని పల్కగా సుమిత్రాతనయుడు కోపముతో ఖడ్గమును దూసి క్షణములో దాని ముక్కును చెవులను స్తనములను నరకగా ఆ రాక్షసి మొఱపెట్టుచు వచ్చిన దారినే వెళ్లెను. అది అట్లు వెడలగా గుహామార్గమున సోదరులు వెళ్లుచుండగా లక్ష్మణుడు రామునితో నిట్లనెను. అన్నా! గుండె చెదరెను. ఎడమ భుజమదురుచున్నది. అశుభమేదియో కలుగునని తోచుచున్నది సుమా. అన్నా! నా మాటలు విని సిద్ధముగా నుండుము. ఆపదయేదియోరానున్నది సుమా. మనకు జయము నిశ్చయముగా కల్గునని

దెలుపుటకై వంచులకమను నీ పక్షి కూయుచున్నది. అని చెప్పెను. వారలిట్లు వనమందలి దారులందు వెదుకుచు వెళ్లుచుండగా భయంకరమైన యొకధ్వని వనములను నశింప జేయగలదై ఆకాశమును దట్టముగా గాలిచే నింపజాలినదై వీతెచంగా విని యిది యేమియో యని అడవి యంతయు వెదుకుచు వెళ్లి యొక్కచోట ..

**రామలక్ష్మణులు కబంధుని చేజిక్కుట**

పర్వత సమానుడును, గొప్ప వక్షస్థలము గలవాడును, శిరస్సు, కంఠము లేనివాడును, గొప్ప కఠినమైన రోమములు గలవాడును, నల్లని మేఘము వంటివాడను, మేఘము నుండి పిడుగు పడునప్పటి ధ్వని వంటి ధ్వని గలవాడును, భయంకరముగా నెదపై నున్న నొసటి యందు పచ్చని వర్ణము విశాలమైన రెప్పతుదవెంట్రుకలు గలిగి అగ్ని వలె ప్రకాశించు అశుభమైన ఒక కన్ను గలవాడును, ప్రకాశించుచున్న పెద్ద కోరలు గలవాడును, అడవి యందలి క్రూరమైన మృగములను, ఏనుగులను, చేతులతో దగ్గరకు లాగి దూరమునకు త్రోయుచు వినోదించువాడును, యోజనము పొడవుగల బాహువుల జంట కలవాడును, భయంకరుడును, తెరచిన పెద్దనోరు గలవాడును, దారి కడ్డముగా నున్నవాడును నగు కబంధుని జూచి దగ్గరకు వెళ్ల బోగా రామలక్ష్మణులను జూచి ఆ రాక్షసుడు గొప్ప బాహుబలముతో ఆయిరువురను బాహువులచేత పట్టుకొనెను మిక్కిలి తీక్ష్ణమైన తేజముగల శరీరములు గల వారును, భయంకరము లైన విండ్లు ధరించిన వారును, ఖడ్గములను చేతులందు ధరించిన వారును, మహా బలవంతులును నగు వారిరువురు పరుని చేతికి జిక్కి బాధ జెందిరి. ధైర్యము శౌర్యము గల వాడగుటచే రాముడు ధైరమును గోల్పోవడయ్యెను. పిన్నవాడగు లక్ష్మణుడు ధైర్యము గోల్పోయి చింత గలిగిన మనస్సు గలవాడై రామునితో నిట్లనెను. అన్నా! నా గతిని జూచితివా? ఈ రాక్షసుని చేత చిక్కువడితిని. వీడి వాత బడినన్ను వీడి

వేగముగా నీవైనను పరువెత్తుము. నీవైన బ్రతికినచో నెట్టైనను భార్యను పొందగలవని తోచుచున్నది. రాజ్యలక్ష్మిని పొంది సంపదలతో నున్నవేళ నన్ను నీ వెన్నడును మరువబోకుము. అని సౌమిత్రి పల్కగా విని రాముడు లక్ష్మణా! నీవీ విధముగా విచారించుట తగునా? అనుచుండ నారాక్షసుడు వారితో దారుణమైన పద్ధతితో నిట్లనెను. ఎవ్వరయ్యా మీరలు? విండ్లు, వాడి బాణములు ఖడ్గములు ధరించి కొమ్ములుగల ఆబోతుల వలె నిట్టీ యడవిలో నేల తిరుగు చున్నారు? ఎంతయో ఆకలితో నున్న నా నోటిలో ఈ విధముగా పడుటకై ఇచ్చుటికి వచ్చినారేమి? మీ కేవిధముగా నైన జీవింప వశమా? ఇక మీకు నూఱేండ్లు నిండినవి సుమా అని మదించిన మాటలు పలుకుచున్న రాక్షసుని మాటలను విని తమ్ముడితో భూపుత్రీనాథుడు మొగము వెలవెల వోవుచుండగా దుఃఖముతో నిట్లనెను. కష్టములపై కష్టములిట్లనిష్టముగా కలుగుచు బ్రదుకునకే ముప్పు గలిగించెను. ప్రియమైన భార్య కనబడకయే పోయెను గదా. అన్నన్నా! భూమిపై జన్మించిన ప్రాణములపై కాలము యొక్క శక్తి ఏవిధముగా నివారింపరానిదో తెలిసినదా? నిన్నును నన్నును దుఃఖములచే బాధనొందజేసెను గదా. గొప్ప ధైర్యము గల వారును, జయింపరాని బలము గలవారును, యుద్ధములందు చేయితిరిగిన వారును, భరింపరాని తేజము గవారును అయినను, ఓ అనఘా! కాలము కలిసిరాక తప్ప వచ్చినచో ఇసుకచే నిర్మింప బడిన వంతెన వలె నశించెదరు సుమా. ప్రాణులను దైవము చంప దలంచించో దుష్కరమగునా?



# డెబ్బదియవ సర్గము

## రామలక్ష్మణులు కబంధుని బాహువుల నఱకుట

అని తన మనస్సును దిట్ట పరచుకొనుచు రాముడుండగా ఆ మాంసాశనుడిట్లనెను. నన్ను జూచి నివ్వెఱ పొంద నేటికి? దైవము మిమ్ము నా నోటిముద్దగా జేసెను. అని ఈ విధముగా రాక్షసుడు పల్కగా గొప్ప పరాక్రమము గల లక్ష్మణుడు తీక్ష్ణమైన శౌర్యముతో రామునితో నిట్లనెను. అన్నా! ఇక వీడు కడు వేగముగా నిన్ను నన్నును బలిగొనక మునుపే వాడియైన ఖడ్గముల అంచులతో గొప్ప బాహువులను రెంటిని పడగొట్టుట మేలు గదా. వీడు గొప్ప బలము గలవాడగుటచే చంపుటకు శక్యము కాదు. ఎంతో భయంకరమైన శరీరము గలవాడై తన పరాక్రమముచే జగమునంతను జయించియుండుటచే నీ దుష్టుడు మనలను తిని వేయును. ప్రతీకారము చేయు శక్తి లేని వారిని చంపుట రాజశ్రేష్ఠులకు ధర్మము కాదు. యజ్ఞ శాలలోనికి తేబడిన పశువులను చంపుట వలెనది చెడ్డపని గదా. మహాత్మా! అనుచున్న లక్ష్మణుని మాటలను విని రాక్షసుడు వారిని తన నోట వేసికొన బోవునంతలో ఆ మణులవంటి రాజపుత్రులు దేశకాలతత్త్వము తెలిసిన వారగుటచే రాముడు కుడి భుజమును లక్ష్మణుడెడమ భుజమును పదును గల కత్తులతో భీమ బలముతో నరుకగా వాడు దిక్కులును భూమియు ఆకాశమును ధ్వనితో నిండునట్లుగా భూమిపై బడెను.

## లక్ష్మణుడు కబంధునకు తమ వృత్తాంతము చెప్పుట

దీనుడై గొప్ప చేతులు రెండును లేనివాడై రాక్షసుడు మీరలెవ్వరు? ఈ

అడవులలో మీకేమి పని? యని యడుగగా వానికి లక్ష్మణుడు తమ వృత్తాంత మును స్వరమునిట్లు చెప్పెను. ఈ అనఘుడు ఇక్ష్వాకు వంశమున బుట్టిన వాడు. ఇతనిని ప్రజలు రాముడందురు. ఓ దనుజా! ఇతడు మా అన్న. నా పేరు లక్ష్మణుడందురు. దేవ ప్రభావుడగు రాముడు భార్యతో గూడ దండకాటవి యందు సుఖముగా నుండగా రాక్షసులు తమ మాయచే జానకిని హరింపగా ఆమెను వెదుకుచు మేమిచ్చటికి వచ్చినారము. నీ వెవ్వడవో, కబంధమైన రూపమును పొంద కారణమేమియో, గుండెలో నోరును, పిక్కల సొంపు లేకుండుటయు గలిగి ఏల పొరలు చున్నాడవో తెల్పుమనగా వాడు దేవేంద్రుని మాటలను స్మరించుకొని ప్రీతినొంది ఇట్లు సమాధానము చెప్పెను. ఓ రఘువంశశ్రేష్ఠులారా! మీకిదే స్వాగతము. నా భాగ్య వశమున మిమ్ముల నిప్పుడు చూడగలిగితిని. నా యీ చేతులు పోగొట్టుకొన గలిగితిని. నా అవిధేయత చేత ఇటువంటి వికృతపు రూపము నాకు గలిగినది. దాని యొక్క ఉన్న నిజమును శ్రీరామచంద్రా! తిన్ననైన సుగుణములు గలవాడా! రాఘవేంద్రా! చెప్పెదను వినుము.



# డెబ్బది యొకటవ సర్గము

## కబంధుడు రామలక్ష్మణులకు తనవృత్తాంతము చెప్పుట

రామా! నేను పూర్వము చంద్రుడు, సూర్యుడు, దేవేంద్రుడు మున్నగు వారితో సమానమైన సుందర రూపము గలిగి జగములందందమునకు పేరుపొందితిని. గర్వముతో నేనిట్టి వికృతమైన రూపముతో మునులను, వనములందువారలును భయముచే వణుకునట్లు పలుమారులు కష్టపెట్టుచు తామస బుద్ధితో స్థూలశిరుడను తాపసిని భయపెట్టగా శాపమే ఆయధముగా గల ఆ తాపసి కోపముతో "శుచ్చితమైన నీ రూపముతో బెదిరించెదవా పాపి! నీకు ఈ రూపము ఎల్లప్పుడు ఉండు గాక" యని నన్ను శపించెను. అట్లాతడు శపింపగా నేను, అనఘా! దయ చూడవా? శాపాంతమునను గ్రహింపవా? యని వేడగా అడవి యందు రాముడు నీ చేతులు నరికి తగలబెట్టినచో పూర్వరూపమును పొందెదవని ఆనతిచ్చెను. నేను శ్రీయుతదనుపుత్రుడను. లక్ష్మణా! నేనిట్టి వికృత శరీరము గలవాడునగుటకు ఇంద్రుని కోపము కారణము. నేను ఘోరమైన తపస్సు చేసి బ్రహ్మదేవుని వలన ధీర్ఘాయువును వరముగా బొందుటచే నాతో సమానులింకా లేరని తలంచి వెకలినై మందించిన వాడనై ఇంద్రుని యుద్ధమునకు రారమ్మని పిలిచితిని. ఆతడు కోపముతో దయారహితుడై వజ్రాయుధముతో కొట్టి తల వక్షములోనికి కుదియ బడునట్లును, తొడలు కడుపు లోనికి చొచ్చునట్లును అణపగా జంపుమని వేడితిని. ఎంత వేడినను నన్నతడు బ్రహ్మమాట అబద్ధమెట్లగునని యముని కడకు పంపడయ్యెను. సీతానాథా నాకావరము నశించునట్లు రెంటికీ చెడిన రేవడనైతిని. ఎటులయ్యె

నేను బ్రతుకుట? ఇట్లాహారము లేకుండా ఎట్లుందును? కటకటా! భగ్నముఖడను. విరువ బడిన శిరస్సు తొడలు గల వాడను. ఆహారమెట్ల తిందును? కరుణా జూడుము అని వేడుగా దేవేంద్రుడు ఆమడ పొడవగు చేతులను ముఖమును కోరలును నాయుదరమున గలుగనట్లనుగ్రహించెను. దానిలో నేను ఏనుగులు, సింహములు, పెద్దపులులు మొదలుగా గల మృగసంతతులను తినుచుండెను. రాముడు లక్ష్మణ సహితుడై నీ గొప్ప చేతులను వాడియగు ఖడ్గపుదెబ్బచే నేలబడునట్లు నరుకగా నీకు స్వర్గము కలుగునని చెప్పి ఇంద్రుడు వెళ్ళెను. ఆ ముని యొక్క మాటను నమ్మి వికృతమైన రూపమును వేగముగా పోగొట్టు కొనదలచి నేను ఏ మృగము, ఏ పదార్థము కనిపించినను పట్టుకొనుచున్నచో రాముడు చిక్కడాయని గొప్ప ఆశతో ఏదైనా నీ యామడ దూరములో కనిపించినను వేగముగా పట్టుకుని నోట బెట్టుకుందును. ఆ మునీంద్రుడు చెప్పిన రాముడవు నీవే మహాత్మా! రణరంగమందీవిధముగా నన్నెవరు చంపజాలరు. నీకు నేను బుద్ధిచే మంత్రిత్వము చేయుదును. నీకు తగిన మిత్రశ్రేష్ఠుని సంపాదింతును. నాకు అగ్నిసంస్కారము చేయుము అనగా రాముడిట్లనెను. స్వేచ్ఛగా నేనును ఇతడును సంచరించుచుండగా రావణుడు నా భార్యని ఎత్తుకుని పోయెను. ఆ దుర్మార్గుని పెరుయొక్కటియే మేమెరుగుదుము ఆతని రూపముగాని పరాక్రమముగాని అతని నివాసముగాని మాకు తెలియవు. అతనిని నీవెరింగినచో మతి చెడి, దిక్కు తెలియక అడవి అడవి తిరుగుచున్న మమ్ములను, తీవ్రమైన దుఃఖములో నున్న వారలను, మంచిప్రవర్తన గలవారలను కేవలము మంచి దయతో చూచి అతని స్థితియు, గతియు ఇట్టిదని భేధమెంచక మహోపకారము చేయువాడివై ఓ వీరుడా! చెప్పుము. ఏనుగులప్పుడప్పుడు కూల్చిన యెండిన కట్టెల సమూహములను ప్రోగుచేసి నీ మాటననుసరించి నిన్ను బలమునందు కాల్చుటకు యత్నము చేసేదను. యెవ్వడు జానకిని హరించెనో, ఎచ్చటదాచినాడో దయతో మాకా సంగతి నీ వేరిగినచో తెలియజేసి

శుభము కలుగునట్లు చేయవయ్యా! అనగా కబంధుడు దుష్టకృత్యములు చేసి కొనితెచ్చుకున్న యీ వికృతమైన రూపముతో తెలివిని కూడా కోల్పోయితిని. ఓ పద్మాక్షా! సీతకథ కూడా యిప్పుడు స్ఫురించుటలేదు. వేగముగా కాల్చివేసినచో ఆ దొంగయొక్క దాపరికమునంతయు దాచకుండా నీకెరింగించెదను. గోతియందు నన్ను వేగముగా పడివేసి సూర్యుడస్తమించకముందే యథావిధిగా దహనము చేయుము. తర్వాత భూసుతాపహర్తను తెలియజెప్పెదను. వానిని తెలియగల్గువాడొకడు గలడు. వానితో న్యాయమైన విధముగా స్నేహము చేయుము. వాడుకారణాంతరములచే సర్వలోకములను దిరిగెను. వాడు భూమియందు చూడని చోటు లేదు. అతడు నీకుపకారము చేయును అని చెప్పగా..



# డెబ్బది రెండవ సర్గము

## కబంధుడు స్వస్వరూపము నొందుట

వాని శరీరము గోతియందు త్రోసి సుమిత్రానందనుడు మండుచున్న పెద్ద కొరువులను దెచ్చి కర్రలందుంచి అగ్నిని రగిలింపగా మాంసము నేతిముద్దకు సాటియైన అతని దేహమును గాల్చుటలో అగ్నివేగమునందలేక నెమ్మదిగా కాల్చుచుండగా, రామలక్ష్మణులు చూచుచుండగా ఆ మండుచున్న మంటలనుండి సాటిలేని స్వచ్ఛమైన వస్త్రములు గలవాడును, మెరియుచున్న భూషణములచే నలంకరింపబడినవాడునునై కబంధుడు ఆకాశమునకేగసి హంసయుక్తమైన విమానముమీద దిక్కులు కాంతిమంతములగునట్లు చేయుచు నుండి భూపుత్రిని కనుగొను విధమును రామునితో నిట్లు చెప్పెను. అనఘా! రామా! జగత్తునందు ఆరుపాయములెరిగినవారు – సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధిభావ, సమాశ్రయములను నవి ఆరుపాయములు – క్రియలు జరుగు విధానములను విమర్శించెదురు. అందు దుస్థితినందినవారు తమతో సమానమైన స్థితి గలవారిని వెదకి మైత్రి చేసికొందురు. ఇప్పుడు నీవు తమ్మునితో గూడ భార్యానిమిత్తముగా ఆయాసమునొంది యున్నావుగదా.

## కబంధుడు రాముని సుగ్రీవునితో మైత్రి చెయ్యమని చెప్పుట

కాన నీతో సమానమైన స్దితి గలవానితో చేసికొనుట మేలు. కానిచో నీ యొక్క కార్యము పూర్తియగుటెట్టులో తోచకున్నది. రామా! ఒక వానరుడు తన అన్నయైన ఇంద్రపుత్రుడగు వాలి క్రోధముతో రాజ్యమునకై తనను తన్ని వెడలగొట్టగా నలుగురు వానరులు తనకు సహాయులు కాగా పవిత్రమైన

ఋష్యముక పర్వతమున, పంపా సరోవర తీరమున సంచరించు చున్నాడు. అతని పేరు సుగ్రీవుడు. పరాక్రమవంతుడు పావనమైన చరిత్ర గలవాడు సత్యమునే పలుకువాడు. ప్రతిభాసంపద గలవాడు. ధైర్యము కలవాడు. ప్రశంసింపదగిన ప్రతిభను కలవాడు. వానితో నీవు స్నేహము చేయుము. నీ భార్యను వెతుకుటలో నతడు సహాయముగా నుండును. రాజపుత్రా! ఏల విచారించెదవు? ఎవ్వరికైనను జరుగవలసినది మార్చుట కిలలో శక్యమా? కాలం యెవ్వరికైనను అతిక్రమింపదు గదా. ఇప్పుడే అచ్చటికి ప్రయాణము కమ్ము. రామచంద్రా! ఇచ్చటనుండి అతివేగముగా వెళ్ళి సుగీవునితో స్నేహము చేయుము. అతడుత్తమ గుణములు గలవాడు. గొప్ప బలవంతుడు. చిన్నతనం అని తలంపక కపిరాజుతో అగ్నిసాక్షిగా స్నేహం చేయుము. అతడు గొప్ప పరాక్రమము గలవాడు – నీ సహాయమును కోరినవాడు. మేలుచేయునట్టి కృతజ్ఞత కలవాడు. వానరులకందరకు రాజు. కోరిన రూపము ధరించ గలవాడు. మీరు కూడా అతని కోర్కెను దీర్చగలరు. మీరతని కోర్కెను, వేగముగా తీర్చినను తీర్చకున్నను అడ్డు లేకుండా మీకార్యము నతడు సానుకూలము చేయగలడు. అతడు ఋక్షరజుడి యొక్క తనూజుడు. సూర్యుని కౌరసపుత్రుడు. అన్నయైన వాలికి మనసునందు భయపడి పంపాసరోవర ప్రాంత దేశమున సంచరించు చున్నాడు. సర్వాయుధములను ముట్టి ప్రతిజ్ఞ చేసి అతనితో మైత్రి చేయుము. భూమియందు రాక్షసులుండుచోట్ల తడెరుగునవి లేవు సుమా. కీర్తిగలిగిన ఓ రామ! సూర్యకిరణ ప్రసారమున్నంత వరకు భూమియందు గల అడవులు, పర్వతములు, నదులు, సరస్సులు మొదలగు చోట్ల నెల్ల నీ భార్యను వెదకుటకై వానరులను బంపి ఆమె వార్తను దెప్పించును. నమ్ముము. నీ యడబాటుచే కలతజెంది దుఃఖించుచున్న భూపుత్రి ద్రోహచింతగల రావణుని ప్రాసాదమున నుండు వార్తను దెలిసికొను శక్తి గలవాడు. ఆ రావణుని అంతఃపురమును వెదకి పాతాళలోకమందుండి నను మేరు శిఖరమున నున్నను దైత్య సమూహమును జంపి సీతారమణిని తెచ్చును సుమా.

# డెబ్బది మూడవ సర్గము

## కబంధుడు రామునకు పంపా మార్గము చెప్పుట

అని సీతాదేవి ప్రాప్తించు నుపాయమును జెప్పి తిరిగి కబంధుడిట్లనెను. ఇచ్చటి నుండి పడమటి దిశగా నున్న వనము ఫలములు, పుష్పములతో నొప్పుచుండెను. మారేడులు, నేరేడు చెట్లు, మంచి గన్నేరులు, గోవులు, పనస చెట్లు, రేగి చెట్లు, రావి, మామిడి, క్రోవి, ముంత మామిడి చెట్లు, వారిజాపు చెట్లు, కదివి చెట్లు మొదలుగాగల పెద్ద చెట్లనేకములు గలవు. చెట్లనెక్కియో రాలగొట్టి నేల బడవైచియో మీరు ఫలములను భుజించుచు దారి సాగుచుండగా తరువాత పుష్పించిన వృక్షములు గల వనముండును. అది నందనవనమును బోలిన అందముతో పండిన ఫలరసములతో అన్ని ఋతువుల పండ్లు గల వృక్షములతో ఉత్తర కురుభూములను బోలి ఉండును. ఆ చెట్లెక్కియో క్రింద పడగొట్టియో నీ తమ్ముడు నీకాహారమును సమకూర్చును. అటుపై వేగముగా కొండలను అడవులను చూచూచు వెళ్ళినచో

## కబంధుడు రామునకు పంపాసరస్సును వర్ణించి చెప్పుట

బెగ్గురులు, రాజహంసలు, చక్రవాకములు మున్నగు జలపక్షుల మనోహర ధ్వనులను, నాచుగల జలములను, ఇసుక తిన్నెలతో నొప్పిన నిర్మలములగు సమతలములైన తీర ప్రదేశములను, క్రొత్తగా వికసించిన పద్మముల, కలువల సుగంధములతో గూడిన జల ప్రవాహములను గలిగి పంపాసరస్సు అపూర్వమైన సంతోషమును కలుగజేయును. చంపబడుట తెలియని జల పక్షులు నీటి ముద్దలవలె ప్రకాశించుచు మనుష్యులు తమ్ము చేరవచ్చినను వదరు బెదురు లేక మోదముతో తిరుగుచుండెను. మీరలు గండుమీనులను సొరచేపలను, రొయ్యలను, కొఱ్ఱచేపలను, బొమ్మిడాయిలను, వాలుగలను, మరియు ముండ్లులేనివగు జలచరములను ఆ సరోవరము నందున్న వాటిని కోరిన వెల్లను తీసికొనుడు. వానిని నీ తమ్ముడు బాణములతో చంపి చర్మము నొలిచి రెక్కలు తీసివేసి ఇనుప కాడలకు గృచ్చి అగ్నియందుడకపెట్టి చిక్కగానున్న

వాటి ముండ్లు తీసివేసి భక్తితో నీకై దెచ్చి ఇచ్చును. తనివి తీరునట్లు భుజించి క్రొత్తక్రొత్త తామరల వాసనలతో సుఖకరమైన చల్లదనముతో, స్ఫటికము వలెను, వెండి వలెను స్వచ్ఛతతో నెల్లప్పుడు సంతోషమును గలుగజేయు ఆ సరోవర జలములను నీ తమ్ముడు తామరాకు దొన్నెలందు దెచ్చి ఈయగా హాయిగా దాహము తీర త్రాగుము. పెద్ద పెద్ద మృగములు నీటిని తృప్తిగా త్రాగుటకై పరువెట్టి ఆయాస పడుచు కోడెదూడల వలె వచ్చుచుండుటను ఓ రాజపుత్రా! పంపా సరోవర తీరమున చూడగలవు. పుష్ప భారముతో నొప్పుచున్న మనోహరమగు చెట్ల గుంపును చల్లని నీరమును సంధ్యాసమయమున మనసును సంతోష పెట్టుచు ఉపచారము చేయుటను జూచెదవు సుమా.

## కబంధుడు రామునితో శబరికి దర్శన మిమ్మని చెప్పుట

వికసించిన పద్మములును కలువలును అందమైన పువ్వులతో నిండిన కానుగ చెట్లును, బొట్టుగు చెట్లును నీకు సంతోషమును గలిగించును. సూర్యవంశ్యా! ఆ పువ్వులను జనులెవ్వరు ధరింపరు. అవి ఎప్పుడును వాడవు. తొడిమెలనుండి యూడవు. అచట మతంగుడును మునివరుడు తపస్సు చేయుచుండగా అతని శిష్యసముహము వనములలో నుండు దుంపలను పండ్లను తెచ్చుటకు వెళ్ళగా ఆ మహాత్ములయొక్క చెమట భూమిపై చిందగా దాని వలన పుట్టినవి గాన నవి అట్టి మహిమను పొందెను. ఆ యనఘు లచ్చోటు విడచి వెళ్ళినను వారియొక్క సేవకురాలు అచ్చటనే యున్నది. చిరకాలజీవి సన్యాసిని, ధర్మమైన చరిత్రగలది శబరియనునది. యెల్లప్పుడును సమస్థ ప్రాణులకు నమస్కరింప దగిన వాడవును, దేవతలతో సమానుడును నగు నిన్ను దర్శించి స్వర్గము చేరును. ఆ భూమియందు నాగుల సమూహము తిరుగుచుండియు ఆ మాతంగుని తేజస్సుయొక్క మహిమచే ఆశ్రమ సమీప ప్రదేశముల కొక్కటియును రాదు. ఆ సరస్సు యొక్క పడమటి దిక్కున రహస్యమైన యొక యాశ్రమ ప్రదేశమున్నది. స్త్రీ శ్రేష్ఠురాలగు శబరి ఆ యాశ్రమమునందు నిరంతరము తపస్సు చేయుచుండును. దేవతావనసమానమై నందనవన సదృశమై అందమైన వింత వింత పక్షుల సమూహముతో విలసిల్లు ఆ వనమందు

నీ వనేక విధముల నానందింప గలవాడవు. ఆ శబరిని జూచి తర్వాత పంపా సరోవర ప్రాంతములకు వెళ్ళుము. అచ్చట పువ్వుల భారముతోనున్న చెట్లతో గూడిన పర్వతము ఋష్యమూక మనునది కనిపించును. ఏనుగులధికముగా నుండుట చేత కొండను సుఖముగా ఎక్క వీలు లేదు. ఇది నిక్కము. ఆ పర్వతమున నిద్రించువాడు యే వస్తువును కలలో చూచునో, దానిని మేల్కొనగనే పొందును. పాపాత్ములాపర్వతము పైకి పోరాదు. వెళ్ళి నిద్రించినచో రక్షసులు వారిని కొట్టుదురు. రామచంద్రా! ఇయ్యది బ్రహ్మచే నిర్మింపబడినది. మతంగాశ్రమమున నివసించుచు పంపాసరోవరము తీరమున విచ్చలవిడిగా తిరుగు ఏనుగుగున్నలు వేయు కేకలు ఓ సూర్యవంశ్యా! ఆ కొండ మీదికి చక్కగా వినవచ్చునవియు మేఘ వర్ణము గలిగి బలిసిన యేనుగులు మదగర్వముతో వానిలోనవి దెబ్బలాడుకుని నెత్తురులు గారుచుండగా విడిపోయి వేరు వేరు త్రోవలను బట్టి వెడలిపోవును. స్వచ్ఛముగాను చల్లగాను నున్న సరోవరజలములను త్రాగి అడవి యేనుగులు కోరిక తీరునట్లు సౌఖ్యములు పొందిన మనస్సులతో అచ్చటచ్చట సంచరించును. ఎలుగుబంట్లను, పులులను, నల్లగా నింద్ర నీలములవలె నున్న మృగములను చూడగా నీకు దుఃఖముపశమించును గదా. రాజా! ఆ పర్వతమున గొప్ప గుహ యొక్కటున్నది. దానికి గొప్ప రాతిమూతయున్నది. దానిని ప్రవేశింప దలంచుట సౌఖ్య ప్రదము కాదు. ఆ గుహ యొక్క తూర్పు ద్వారము నొద్ద చల్లని మంచినీటి మడుగొకటి గలదు. ఆ జలాశయముయొక్క తీరము మనోహరమైన ఫలములతో దుంపలతో గూడి, లేళ్ళ సమూహము గలిగి యొప్పుచుండును. వాలి వలని భీతిచే సుగ్రీవుడు నల్వురు వానరులచే గూడి ఆ గుహయందుండును. ఎప్పుడైనా పర్వత శిఖరముయొక్క పై భాగము నిలుచుండును. అని రాజపుత్రులకు విశదముగా జెప్పి ఆకాశమున వెడలుచు నిలువగా రాముడతనికి వెళ్ళుమని సెలవివ్వగా అతడు సంతోషముతోవెళ్ళెను. అంతట రాముడును తమ్ముడును వేగముగా పడమటిదేశ ప్రశస్తములైన తియ్య తియ్యని ఫలములు గల పర్వతములను వనములను వృక్షములను జూచూచు వెళ్ళి...

# డెబ్బది నాలుగవ సర్గము

## రామలక్ష్మణులు శబరిని చూచుట

ఆ పర్వత సమీపమున నారాత్రి గడిపి సూర్యుడుదయింపగనే నిర్మలమైన నీటితోనున్న పంపాసరోవర తీరమును జూచుచు పడమటి దిక్కు తీరమున వెదికి అచ్చట శబరియొక్క అందమైన యాశ్రమమును జూచి దగ్గరకు వెళ్ళగా ఆ ముదుసలి వేగముగా లేచి తన చేతులను జోడించి వారల పాదముల సోకునట్లుగా నిర్మలమైన మనస్సుతో నమస్కరించి పాద్యమునొసగి తగిన సత్కారముల నన్నిటిని యధావిధిగాజేసి నిలబడగా దేవసముడైన రామచంద్రు డిట్లనెను. మంచి నడవడిగల ఓ శబరి! నీ యొక్క తపస్సును, వ్రతములును విఘ్నములేకుండా సాగుచున్నవి గదా. నిర్మలమైన మనస్సుగల దాన! ఆగ్రహము నందు ఆహారమునందు నియమము కలదుగదా. నీ నియమములన్నియు నెరవేరుచున్నవా? మనస్సు నిర్మలముగా నుండుచున్నదా? అమ్మా! గురువుయొక్క సేవలు చక్కగా సాగుచున్నవా? మంచి చరిత్రగల శబరి! అవి సఫలములగు చున్నవా? అని రాముడడుగగా ఆ తపోధనురాలు సిద్ధులచే ప్రశంసించబడిన సిద్ధురాలు కౌసల్యా పుత్రుని జూచి భక్తితో వినయముతో తన విషయమును ఇట్లు చెప్పెను. ఓ నిర్మలాత్మ! నిన్ను చూచుటచే నా గురుశుశ్రూష యిప్పుడు ఫలించినది. ఓ నీరజాక్షా! నీ దర్శనముచే ఇప్పుడు నా తపములు వ్రతములు సిద్ధించినవి. ఓ కౌసలేయా! కన్నులార నిన్నుజూడగల్గుటచే ఇప్పుడు నా జీవిత మెల్లను సార్ధకమైనది. దేవశ్రేష్ఠుడా! కుతూహలముచే నిన్ను పూజింపగల్గుటచే ఇంకా నేను స్వర్గమునకు వెళ్ళదగుదును. (స్వర్గము = వైకుంఠము ‘ విద్వేషాదపి

గోవిందం దమఘోశాత్మజః స్మరన్ / శిశుపాలోగతః స్వర్గం కింపునస్తత్పరాయణః // 'అత్రిస్మృతి) నీ దయార్ద్రమైన దృష్టిచేత పాపములు హరింపదాననైతిని. ఓ శతృసంహారా! పరమ పవిత్రమైన చరిత్ర గలవాడా! ఘోర పాపములను తొలగించువాడా! నల్లని దేహముగల రామచంద్రా! అక్షయములైన పదములను పొందెదను. శ్రీ రఘురామచంద్రా! నేను పరిచర్య చేయుచుండిన నా గురూత్తములు గొప్ప తపోధనులు స్వర్గమును పొందుటకై వెళుచు మీరలు చిత్రకూట పర్వతమునందుంటుటయు, చిన్న తమ్ముడును నీవును ఇచ్చుటకి వత్తురనియు ప్రశస్తమగు విధముగా మిమ్ములను చూచిన వెంటనే అక్షయ సంతసము కలుగగా నీ కొరకు మంచి మంచివి యేరి కోరికతో అనేకవిధములైన వన్యములగు ఫలములను సమకూర్చి యుంచినదానను. అనగా శతృ సంహారియగు రాముడు జ్ఞానముచే పండిపోయినదియు దృఢమైన నిశ్చలమైన మనస్సు గలదియునగు శ్రమణిని జూచి యిట్లనెను. మీ గురువుయొక్క ప్రభావమును ఓ శ్రమణీ! కబంధుని యొద్ద వింటిని. కన్నులారా ఈ ఆశ్రమమునందున్న చిత్రములను చూడవలెనని మనస్సందు చాలా కోరిక కలిగినది. నీ కిష్టమైనచో వానినన్నిటిని క్రమముగా చూపించుము అనగా ఆమెయు..

**శబరి రామలక్ష్మణులకు మతంగాశ్రమమునందలి వింతలు చూపుట**

ఇవే మేఘశ్యామలమైననదియు, మృగములతో, పక్షులతో నిండియున్నది యగు మాతంగాశ్రమము. ఇచ్చటనే మాగురువులు తమమంత్రశక్తితో తీర్ధములను కల్పించి ప్రకాశించినవారు. పడమటనున్న వేదికయందు మా స్వాములు వణకుచున్న చేతులతో పూవులతో పూజలు చేసినవారు. వారియొక్క తపఃప్రభావముచేత ఇప్పుడుకూడ వేదిక అన్ని దిక్కులను ప్రకాశింప జేయు చున్నది. ఆహారమేమియు గైకొనని కటిక యుపవాసములచేత సత్తువలేని వారై

నడువలేక పోవుటచే మనస్సున తలంపగా ఏడుసముద్రములు నిచ్చటికి వచ్చినవి రామా సుగుణధామా! చూడవయ్యా! స్నానముచేసి నార బట్టలను నీచెట్ల కొమ్మలపై నారవేయగా అవి నా గురువర్యుల తపఃప్రభావముచే ఇప్పటికీ నట్లే ఆరక యున్నవి చూడుమా రామచంద్రా! ఆ నియమాఢ్యులు భక్తితో దేవపూజయందుంచిన పుష్పములు నేటికినీ వాడకున్నవి. వినదగిన వాటిని వింటివి. ఈ వనమంతయు జూచితివి. ఇంక నేను శరీరమును విడచి ఘనులైన నా గురువులను చూచుటకై వెళ్ళుటకు సెలవిమ్ము కాకుత్స్థ! యనగా ఆమెయొక్క మాటలు విని శ్రీరాముడిట్లనెను. నీ సపర్యలు మెచ్చదగియుండెను. మంచి చరిత్ర గలిగిన ఓ శ్రమణీ! యధాసుఖముగా నీ కోరిక ప్రకారముగా వెళ్ళుము అని జనకాత్మవిభుడిట్లనుజ్ఞ నొసగగా కృష్ణజినములే వస్త్రములుగా ధరించి నదియు, జాడలు ధరించినదియు ముసలిదియునగు ఆ బోయస్త్రీ తన యోగము వలన జనించిన అగ్నులందు శరీరము నర్పించి ఒప్పుచున్న అలంకారములచే ప్రకాశించుచున్న దేహముగలదై వేగముగా మునీంద్రుల సన్నిధికి వెళ్ళెను.



# డెబ్బది యైదవ సర్గము

## రామ లక్ష్మణులు పంపాతీరము చేరుట

ఈ విధముగా శబరి పరమపదమునకు వెళ్ళగా ఏకాగ్రముగా చూచుచున్నవాడును, హితుడును నగు తనతమ్ముని జూచి యింద్రసమానుడైన రాముడు మనస్సునందధికమైన సంతోషముతో ఆ మౌనుల విషయముగా నిట్లని పల్కెను.

సౌమిత్రీ! ఏమీ? వారలయొక్క మహాప్రభావములు. అవి యెంతో ఆశ్చర్యమును కలుగచేయుచున్నవి. లేళ్ళును, పులులును అత్యంత చనువుతో నమ్మకముతో సంచరించుచున్నవి. మనమిచ్చట మౌనిశ్రేష్టులు సృష్టించిన ఆ సముద్రజలములతో పితృతర్పణములను శుభము కలుగునట్లుగా చేసినారము. కలత తొలగినది. ఇక సౌఖ్యము కలుగ గలదు. మనస్సు సంతుష్టి చెందినది. సుగ్రీవుడు ఉండు పర్వతమెంతయో దూరములేదు. మనమింక పంపా సరోవరమునకు పోదాము. అచ్చట ఋష్యమూకమను పర్వతముండును గదా. అందు సూర్య పుత్రుడైన సుగ్రీవుడు నల్గురు వానరులతో గలిసియుండును. వేగముగా సూర్యపుత్రుడను చూచుటకై వెళ్ళుదుము లెమ్ము. అతని చేతనే గదా భూపుత్రిని వెదకు పనితీరును అని చెప్పుచున్న అన్నతో లక్ష్మణుడు, అన్నా! వినుము. ఆ విషయమునందే నా మనస్సు తొందరపెట్టుచున్నది పద–పద మని వారలు పంపాసరోవరము చేరిరి. అనేకములైన లతలతోడను క్రొత్తచెట్ల తోడను నిండిన జలప్రవాహములతో నొప్పునదియు, మకరందములొల్కు

దట్టములైన పద్మములచే ఎఱ్ఱకలువలచే నీలవర్ణము గలదియునై వివిధవర్ణముల కంబళమును బోలిన ఆ పంపాసరస్సును జూచి నియమవంతుడైన తపస్వీ జనులతో గూడియున్న దాని మహిమకుచాలా ఆశ్చర్యమును చెంది కన్నుల పండుగగా దానిని చూచుచు వెళ్ళి దానికి కొంత దూరమున పవిత్రమైన మతంగ సరస్సునందు ఆ రాజపుత్రులు స్నానముచేసి అచ్చచ్చటనున్న అందమైన వనములను చూచుచు వెళ్ళుచు సుకుమారమైన లతలతో కూడినవైన తిలక వృక్షములు, మాదిఫలపుచెట్లు, గన్నేరులు, మొల్లలు, భాండీరములు, అరటిచెట్లు, మొగలిచెట్లు, ఎఱ్ఱ గన్నేరులు, మామిడి చెట్లు మొదలగువానితో నలంకరింప బడిన భూషణములు దాల్చిన స్త్రీ వలె ప్రకాశించుచున్నదియు, చిలుకలు, గ్రుడ్డి కొంగలు, నెమళ్లు మొదలగు మనోహరములగు పక్షుల కలకలములు గలదియునగు వనమును చూచుచు సంతోషముతో వెళ్ళి మరలా పంపా సరస్సును జేరి సీతానాథుడు అనురాగముతో తమ్ముడితో నిట్లనెను. ఈ పంపాతీరమునందున్న ఋష్యమూక పర్వతమునందు పవిత్రుడగు సుగ్రీవుడు తన హితులతో గలిసి నివసించుచుండును. దీనుడనై, రాజ్యసంపద లేనివాడనై సీతనెడబాసి యెట్లు బ్రతుకవచ్చును? కాన సూర్యపుత్రుని జూచుటకు కార్యార్థమై నీవు వెళ్ళుముయని చెప్పుచూ లక్ష్మణునితో గూడిన వాడై ఇనవంశ భూషణుడు విశదముచే మిక్కిలి తపించుచున్నవాడై చూచుటకు అందముగానున్న పంపా సరస్సును చేరెను. ఈ విధముగా దుఃఖకారకములైన అడవులను దాటి క్రమముగా విఘ్నములను దప్పించుకొనుచు చాలా దూరము ప్రయాణము చేసి మనోహరములైన అనేక రకములైన పక్షుల సమూహములతో నిండినదియు, క్రొత్త క్రొత్త నీటితో నిండినదియునగు పంపా సరస్సును జూచి ఆ రాజపుత్రు లిద్దరూ అపారమైన సంతోషముతో నొప్పిరి.

# అరణ్యకాండ పద్యములు

రామా! రమింపజేయువాడా!
గుణములకు నిధములైనవాడా! విరోధులకు భయంకరమైనవడా!
సౌందర్యమున మన్మధుడు వంటివాడా! శుభనామము గలవాడా!
కాంతి కవధియైనవాడా! ఒంటిమిట్ట యందున్న సీతారామా!
శుభమార్గములచే నమస్కరింపదగినవాడా!
పొందరాని వస్తువులందాసక్తిగల నరులసమూహము కందనివాడా!
ఇంద్రియలోలురైన జనుల అధికములైన ఆర్తులను దూరము చేయువాడా!
తరుగని దయగలవాడా! సంసారబద్ధుల కేకైక గతియైనవాడా!
గొప్ప మనస్సు గలవాడా!

**జయము జయము.**

ధర్మమును రక్షించు వారిలో శ్రేష్ఠుడా! ప్రశస్తములైన సర్వగుణములకు ఏకవాసమైనవాడా! ధీరుడా! ఒక వేయి రెండువందల పెనబడి తొమ్మిది పద్యములతో నొప్పుచున్న అరణ్యకాండ కథ గలవాడా! క్రూరులైన రాక్షసులను సంహారించేవాడా! లక్ష్మీదేవియనెడు కమలమునకు భ్రమరమువంటివాడా! భక్తులహృదయ పద్మములందు నివసించువాడా!

**జయము జయము.**

## గద్యము

ఇది శ్రీరామచంద్ర చరణారవింద మిళిందాయమాన మానసయు,
శ్రీ మొలుగు వెంకటనృసింహాచార్య తనూజయు, శ్రీమత్పండిత మంత్రరత్న
బిరుదాంచిత శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులు
అయ్యవార్లంగారి ధర్మపత్నియునగు వెంకట సీతమాంబచే శ్రీ వావిలి
కొలను సుబ్బారాయ ప్రణీత శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణమునకు
వ్రాయబడిన వచనానువాదమునందు

**అరణ్యకాండము**

**శ్రీరామప్రసాద సిద్ధిరస్తు**

**శ్రీ జగన్మాత్రార్పిత మస్తు**

**శ్రీ శ్రీ శ్రీ**



# ఇతర రచనలు

1. **శ్రీ ఆంధ్ర వాల్మీకి వచన రామాయణము**

   బాల కాండ, సుందర కాండ,

   అయోధ్య కాండ, అరణ్య కాండ,

   కిష్కింధా కాండ, యుద్ధ కాండ,

   ఉత్తరకాండతో సహా

2. **సన్మార్గ దర్శనము**

3. **శ్రీ రామానుజ చరిత్ర**

4. **దశరథుని కోడళ్ళు**